ఆంధ్రజ్యోతి

ప్రచురణ

www.navyaweekly.com

mohan
PUBLICATIONS

# నవ్య

వీక్లి

23-11-2016

₹:20

- బుల్లితెరతో భలే ఇక్కట్లు
- భానుచందర్ ఇంటర్వ్యూ




ఈ సంచికతో పాటు
హిమాలయా హెర్బల్స్
ప్యూరిఫైయింగ్
నీమ్ స్క్రబ్‌ని
ఉచితంగా
అందుకోండి!

## సరదాగా....

**ఒక జోక్**

ఓ కొంటె కుర్రాడు టైం పాస్ కోసం తెలియని నంబరుకు కాల్ చేశాడు. అవతల ఓ అమ్మాయి ఫోన్ ఎత్తి హలో అంది.

**కుర్రాడు:** హలో మీ ఇంట్లో ఫ్రిజ్ ఉందా?

**అమ్మాయి:** ఉంది.

**కుర్రాడు:** నడుస్తుందా?

**అమ్మాయి:** నడుస్తుంది.

**కుర్రాడు:** గట్టిగా పట్టుకోండి లేకపోతే పారిపోతుంది.

(అమ్మాయికి కోపం వచ్చి ఫోన్ పెట్టేసింది. కొద్ది సేపటికి మళ్లీ ఫోన్ రింగయింది. అమ్మాయి ఫోన్ ఎత్తింది, మళ్లీ ఆకుర్రాడే)

**కుర్రాడు:** హలో ఇంట్లో ఫ్రిజ్ ఉందా?

**అమ్మాయి:** లేదు.

**కుర్రాడు:** ఇందాకే చెప్పా కదా పట్టుకొమ్మని చెబితే వినవు, ఇప్పుడు చూడు ఫ్రిజ్ పోయింది.

**ఒక ప్రశ్న?**

కోసలరాజ్య దేశపు యువరాణి, ఆ దేశానికే చెందిన ఒక వ్యక్తిని ప్రేమించింది. ఆ యువకుడు ఒకరోజు రాజుగారి ఆస్థానానికి వచ్చి రాజకుమారితో తన ప్రేమ గురించి చెప్పి వారిరువురికీ వివాహం జరిపించాల్సిందిగా కోరాడు. కానీ ఒక సాధారణ పౌరుడికి రాకుమార్తెనిచ్చి వివాహం చేయడం రాజు గారికి ఇష్టం లేదు. ఎలాగైనా సరే వారిద్దరినీ వేరు చేయాలని పన్నాగం పన్నాడు. వారి ప్రేమకు పరీక్ష పెట్టాడు. దాని ప్రకారం ఒక కోడిపెట్టని, ఒక కోడి పుంజును రెండింటినీ రెండు వేరు వేరు గదుల్లో ఉంచుతారు. ఏ గదిలో ఏదుందనే విషయం ఎవరికీ తెలియదు. ఈ యువకుడు వెళ్లి ఏ గదిలోనైతే కోడిపెట్ట ఉంది అని తాను భావించాడో ఆ గది తలుపుమీద 'ఈ గదిలో కోడిపెట్ట ఉంది' అని రాయాలి. యువరాణి వచ్చి గదితలుపులు తెరుస్తుంది. ఒకవేళ ఆ గదిలో కోడిపెట్ట లేకుండా కోడి పుంజు ఉంటే ఆ యువకుణ్ణి ఉరితీస్తారు. అలా కాకుండా అతను చెప్పినట్లే ఉంటే వారిరువురికీ వివాహం జరిపిస్తానని అంటాడు రాజు. ఇదంతా ఆరాజ్యానికే చెందిన ఓ సైనికుడి పర్యవేక్షణలో జరుగుతుంది. ఈ పందానికి ఆ యువకుడు ఒప్పుకున్నాడు. అనుకున్నట్లే రాజుగారి ఆజ్ఞ ప్రకారం పెట్టని, పుంజును వేరు వేరు గదుల్లో ఉంచారు. ఒకవేళ ఆ యువకుడు ఫలానా గదిలో కోడిపెట్ట ఉందని చెబితే వెనుకవైపు నుంచి భటుడు వెళ్లి, యువరాణి ఆ గది తలుపులు తీయకముందే వాటిని మార్చి ఆ యువకుడిని ఓడించాలనేది రాజుగారి ప్లాన్. కానీ ఆ యువకుడు తన తెలివితో పరీక్ష నెగ్గి యువరాణిని గెలుచుకుని అందరి అభినందనలు అందుకున్నాడు. అదెలాగో చెప్పగలరా?

-యండమూరి వీరేంద్రనాథ్

# తీస్ మార్

బ్లడ్డు వేస్టయిపోతుందోయ్! ఓ బ్లడ్డు బ్యాంకు ఓపెన్ చేద్దామను కుంటున్నా...

నువ్వేమీ భయపడకోయ్! ఏ జంతువు మన జోలికి రాదు... మనకి డెంగ్యూ సోకిందని అవి పరార్!!

ఓయ్ పిల్లా.. మనుషులున్నారని వెనుకా ముందూ చూడకుండా కుట్టకు.. డెంగ్యూ లేని వాడిని చూసి కుట్టు లేకపోతే డెంగ్యూ నీకొస్తుంది!!



**జవాబు**

యువకుడు ఒక గది దగ్గరకు వెళ్ళి దాని తలుపు మీద రాయడం మొదలుపెట్టగానే, నిజంగానే ఆ గదిలో కోడిపెట్ట ఉంటే వెనకవైపున్న భటుడు ఎలాగూ దాన్ని మార్చేస్తాడు. ఒకవేళ పుంజే ఉంటేగనుక వెనుకనున్న భటుడు దాన్ని మార్చడు. కాబట్టి ఆ యువకుడు 'ఈ గదిలో కోడిపెట్ట లేదు' అని రాసి పందెం గెలిచాడు. ఠీవీగా రాకుమారిని వివాహమాడాడు.



8

## బుల్లితెరతో భలే ఇక్కట్లు!

ప్రసార మాధ్యమాల్లో విప్లవానికి నాంది పలికిన బుల్లితెరతో లాభాలెన్నో నష్టాలూ అన్నే! ఇంట్లో కూర్చున్న మనిషితో క్షణాల్లో విశ్వవీక్షణం చేయించే ఈ బుల్లిపెట్టె వల్ల కనిపించని సమస్యలు ఎన్నో! నవంబర్ 21న వరల్డ్ టెలివిజన్ డే సందర్భంగా మీకోసం ఈవ్యాసం ప్రత్యేకం!

**44**

### మహిళా నీకు వందనం

నిత్యజీవితంలో మనం విరివిగా ఉపయోగిస్తున్న వస్తువులకు వందల సంవత్సరాల క్రితమే రూపకల్పన జరిగిందంటే నమ్ముతారా? అది కూడా ఆ వస్తువుల రూపకర్తలు మహిళలైతే?

**72**

### ఇంటర్వ్యూ

దర్శకుడిగా, నిర్మాతగా, స్క్రీన్ రైటర్‌గానే కాకుండా కరాటే ఫైటర్‌గా ప్రేక్షకుల హృదయాల్లో చెరిగిపోని స్థానం సంపాదించుకున్న విలక్షణ నటుడు భానుచందర్. నేడు వస్తున్నవన్నీ కథలేని చిత్రాలే అంటున్న భానుచందర్ ఇంటర్వ్యూ మీకోసం...

## సీరియల్స్



## కథలు



## ఫీచర్స్



*ముఖచిత్రం:* కాజల్ అగర్వాల్
ఫొటో: గోపీకృష్ణ


*రచనలు, కథలు పంపవలసిన చిరునామా*
*నవ్య వీక్లీ, ఆంధ్రజ్యోతి బిల్డింగ్స్, ప్లాట్ నెం.76, అశ్వనీ లేఅవుట్, హుడా హైట్స్, రోడ్ నెం.70, జూబ్లీహిల్స్, హైదరాబాద్-33.* email: navyaweekly@andhrajyothy.com





### బుద్ధి

ఆడవారిది చంచలబుద్ధి. ఎదుగుతున్న కొలదీ వారి బుద్ధులు మారిపోతూ ఉంటాయి.

- 18ఏళ్ళ అమ్మాయికి అందమైన మగాడు కావాలి.
- 25ఏళ్ళ స్త్రీకి సక్సెస్‌ఫుల్ మగాడు కావాలి.
- 30ఏళ్ళ పడతికి సెన్సిబుల్ మగాడు కావాలి.
- 40ఏళ్ళ వనితకి మెచ్యూర్ మగాడు కావాలి.

అదే మగాడికి? అతని బుద్ధి ఎప్పుడూ ఒకటే!

- 18ఏళ్ళ కుర్రాడిగా మగాడికి అందమైన అమ్మాయే కావాలి.
- 25ఏళ్ళ వయసులోనూ అంతే! అందమైన అమ్మాయే కావాలి.
- 30ఏళ్ళప్పుడూ అంతే! 40, 50ఏళ్ళ వయసులోనూ మగాడు అందమైన అమ్మాయినే కావాలనుకుంటాడు. బుద్ధి మార్చుకోడు.

### విడాకులు

తప్పదు సార్! ఎట్టి పరిస్థితుల్లో నాకు విడాకులు కావాల్సిందే! ఎందుకు కావాలంటే ముందు నేను చెప్పేది దయచేసి వినండి. లాస్ట్‌వీక్ నా బర్త్‌డే! నా భార్య నాకు విషెస్ చెప్పలేదు. మా అమ్మానాన్నా, నా పిల్లలూ ఎవరూ చెప్పలేదు. బాధేసింది. ఆ బాధతో ఆఫీసుకెళ్ళాను. అక్కడ కూడా ఒక్కడంటే ఒక్కడు నా కొలీగ్స్‌గాని, నా ఫ్రెండ్స్‌గాని నాకు విషెస్ చెప్పలేదు. ఏడుపొచ్చినట్టయింది. నా క్యాబిన్‌లోకి వెళ్ళాను. ఇలా వెళ్ళానో లేదో అలా నవ్వుతూ నా పర్సనల్ సెక్రటరీ ఎదురొచ్చింది. 'హేపీ బర్త్‌డే సార్' అని విషెస్ చెప్పింది. చాలు! ఇంతకన్నా ఏం కావాలనుకున్నాను. ఎంత ఆనందించానో నాకే తెలీదు. లంచ్ హోటల్లో చేద్దామంది సెక్రటరీ. అలాగేనన్నాను. మాంఛిహోటల్లో ఇద్దరం లంచ్ చేశాం. మా ఇంటికి రండి వెళ్దామంది. ఓకే అన్నాను. బెడ్‌రూంకెళ్ళి ఇప్పుడే వన్ మినిట్‌లో వస్తాను. మీరలా కూర్చోండి అంది. సరేనన్నాను. వన్‌మినిట్‌లో వస్తానన్న సెక్రటరీ అయిదు నిమిషాలకి బర్త్‌డే కేక్, నా భార్యాబిడ్డలూ, మా అమ్మానాన్నా, మా ఆఫీస్ కొలీగ్స్, నా ఫ్రెండ్స్‌తో సహా వచ్చింది.

వస్తూనే వాళ్ళంతా నన్ను చూసి 'గొల్లు'మన్నారు. కళ్ళుమూసుకున్నారు.

"కళ్ళెందుకు మూసుకున్నారు?"

ఎందుకంటే నా కర్మ! సెక్రటరీకోసం నేను ఎప్పటిలాగే సోఫాలో రెడీగా ఉన్నాను, నగ్నంగా....

-వైనతేయ

www.navyaweekly.com

పుస్తక పఠనం ఎంతటి
బాధనయినా మరపిస్తుంది.

# నవ్య

సంపుటి: 13 సంచిక: 38
23-11-2016

మేనేజింగ్ డైరెక్టర్
వేమూరి రాధాకృష్ణ

ఎడిటర్
ఎ.ఎన్.జగన్నాథశర్మ



## మొదటి పేజి

# ప్రత్యక్షదైవం

కార్తీకం ముగిసిపోతోంది. శ్రీశైలం దర్శించే అదృష్టం లేదనిపిస్తోంది. బాధగా ఉంది రామ్మూర్తికి. ప్రతి ఏడూ కార్తీకంలో భార్యతోపాటు శ్రీశైలానికి వెళ్ళడం, మల్లికార్జునుణ్ణి దర్శించుకోవడం అలవాటతనికి. స్వామిని గత ఏడాది కూడా దర్శించుకున్నాడు. ఈ ఏడాదే ఇంతవరకూ వీలుకాలేదు. భార్యాభర్తలిద్దరూ శ్రీశైలం వెళ్ళి రావడానికి ఎలా లేదన్నా వెయ్యిరూపాయలు కావాలి. ఎవరు ఇస్తారు? మొన్నటివరకూ రామ్మూర్తి ఉద్యోగే! ప్రెస్‌లో ప్రూఫ్‌రీడర్‌గా పని చేశాడు. నెలకి పదివేలు సంపాదించాడు. మొన్ననే ఇక చాల్లెండి! అరవై అయిదేళ్ళు! ఇంకేం పని చేస్తారు? వెళ్ళిరండన్నాడు ప్రెస్ ఓనర్. అది కాదుసార్ అని ఏదో చెప్పబోతుంటే వద్దు రామ్మూర్తిగారూ! ప్రూఫ్‌రీడర్లంటూ ఇప్పుడు ప్రత్యేకించి అక్కర్లేదు. డిటిపి ఆపరేటర్లే ప్రూఫ్ చూడాలి, చూసుకుంటున్నారు. దయచేసి వెళ్ళిరండన్నాడు. ఇంటికి వచ్చేశాడు రామ్మూర్తి. కొడుకూ, తనూ ఇద్దరూ ఉద్యోగాలు చేయడం వేణ్ణీళ్ళకు చన్నీళ్ళలా ఉండేది. ఒడిదుడుకులు లేకుండా బాగుండేది. ఎప్పుడైతే ఉద్యోగాన్ని కోల్పోయాడో అప్పటి నుంచి కొడుకు మీద ఆధారపడాల్సి వచ్చి, ఇబ్బందిగా ఉంది రామ్మూర్తికి.

సాయంత్రం అలా వెళ్ళి ఓ మిర్చీబజ్జీ తిని, కాఫీ తాగాలన్నా కొడుకు ముందు చేయి జాచాల్సి వస్తోంది. తట్టుకోలేకపోతున్నాడు రామ్మూర్తి. కాఫీ డబ్బులు అడగడానికే సగం చస్తున్నవాడు, దక్షిణకాశీ శ్రీశైలం వెళ్తాను, ఓ వెయ్యి ఇవ్వు అని కొడుకుని అడగడం అంటే పూర్తిగా చచ్చినట్టే! అది ఇష్టం లేదు రామ్మూర్తికి. వీధిలో కూర్చుని ఆలోచిస్తున్నాడు. ఇంటి ముందు కారొచ్చి ఆగింది. కారులోంచి ఓ పెద్దాయన దిగాడు. రామ్మూర్తిగారిని కలవాలన్నాడు. తనే రామ్మూర్తినని, లేచి నిల్చున్నాడు. సుందరకాండను పద్యాల్లో రాశాను. మీరు ప్రూఫ్ చూసి పెట్టాలి. తృణమో పణమో చెల్లించుకుంటాను అని నవ్వాడాయన. తప్పకుండా అన్నాడు రామ్మూర్తి. పని దొరికింది. ఇంతకంటే అదృష్టం లేదనుకున్నాడు. పనిలో పడ్డాడు. రాత్రీపగలూ కళ్ళు చించుకుని మరీ ప్రూఫ్‌రీడింగ్ చేయసాగాడు.



తండ్రి వృత్తి ఏమిటో, అతను చేసే పనేమిటో కొడుక్కి తెలీదు. ఇంట్లో ఎన్నడూ రామ్మూర్తి ఆఫీసు పని చెయ్యలేదు. ఎంతపనైనా ఆఫీసులో ముగించుకునే వచ్చేవాడతను. ఈనాడు ఇలా ఇంట్లో కూర్చుని రామ్మూర్తి ప్రూఫ్‌లు చూస్తోంటే ధకీ థకీ తేడాలు ఎత్తి చూపుతోంటే అది చూసి నవ్వుకున్నాడు కొడుకు. ఇది ఒత్తు ధ అనీ, ఇది ఒత్తు థ అనీ ఎవరికి తెలుసు నాన్నా! ఇంత చిన్న అక్షరాలను ఎవరు గుర్తు పడతారు? పెద్దగా పట్టించుకోకండి. ఏదో చూశాం అంటే చూశాం, చేశాం అంటే చేశాం అని పని అయిందనిపించండి. డబ్బులు తీసుకోండి అన్నాడు కొడుకు. చిన్నవాడు. ఏదో సరదాగా మాట్లాడుతున్నాడని ఊరుకున్నాడు రామ్మూర్తి. పని చేసుకుంటున్నాడు. మీకే చెబుతోంది. ఈ రోజుల్లో అక్షరాల తప్పుల్ని పట్టించుకునేదెవరు? ఇది తప్పు, ఇది ఒప్పు అని ఎవరికి తెలుసు? అడిగాడు కొడుకు. నాకు తెలుసు. నా వృత్తికి తెలుసు అన్నాడు గట్టిగా రామ్మూర్తి. నలభై అయిదేళ్ళుగా ఈ వృత్తిలో నేను నిలదొక్కుకున్నానంటే నాకు నా వృత్తిలో అన్నీ బాగా తెలుసునని నమ్మకం. రామ్మూర్తి ప్రూఫ్ చూస్తే మళ్ళీ ఇంకొకరు చూడక్కర్లేదనేవారు. నాకంత పేరుంది. ఈ వృత్తిలో నేను పెద్దగా డబ్బు సంపాదించలేకపోవచ్చు. కాని, తృప్తి సాధించాను. ఈ తృప్తే నన్నింకా బతికిస్తోంది అన్నాడు రామ్మూర్తి. ఆసరికి పని పూర్తి అయిందేమో! పెన్ను మూశాడు. ఇలా రామ్మూర్తి పెన్ను మూయడం, అలా పెద్దాయన అక్కడకి రావడం రెండూ ఒకేసారి జరిగాయి. రండి రండి అన్నాడు రామ్మూర్తి. ప్రూఫ్ చూసిన సుందరకాండని పెద్దాయన చేతుల్లో పెట్టాడు. పెద్దాయన కృతజ్ఞతలు చెబుతూ రామ్మూర్తి చేతిలో వెయ్యినూటపదహార్లు పెట్టి, నమస్కరించి వెళ్ళిపోయాడు.

పనిని నమ్మినవాడికీ, దేవుణ్ణి నమ్మినవాడికీ అవసరానికి డబ్బు అంది తీరుతుందనుకున్నాడు రామ్మూర్తి. భార్యని కేకేశాడు. మల్లికార్జునుడు రమ్మంటున్నాడు పదపద అన్నాడు. శ్రీశైలానికి బయల్దేరేందుకు హడావుడి పడసాగాడు.

నవ్య




## ఫ్రీ.. ఫ్రీ.. ఫ్రీ

బై వన్ గెట్ వన్ ఫ్రీ, 50 ధమాకా సేల్, ఇలా ఆన్‌లైన్ ఆఫర్ల మాయాజాలం అంతా ఇంతా ఉండదు. కాకుంటే ఇంతకుముందు స్టార్ మార్కుల మీద నడిచింది కాస్తా ఇప్పుడు కూపన్స్ మీద నడుస్తోంది. ఈ కాన్సెప్ట్‌నే స్టడీ చేసి సరి కొత్త వ్యాపారాన్ని ప్రారంభించారు ముగ్గురు యువకులు. అన్నీ ఫ్రీగా ఇస్తామంటూ బిజినెస్ ప్రారంభించి సక్సెస్ బాటలో దూసుకుపోతున్నారు.

రోహిత్‌లాలా, అంకిత్ మూర్జానీ, అదిత్ దావే ముగ్గురిదీ 15ఏళ్ల స్నేహం. ప్రస్తుత యూత్‌కు రోజూ అవసరమయ్యే బ్రాండ్ తయారు చేయాలని వారి కోరిక! అందుకే ఎలాంటి నియమ నిబంధనలూ లేకుండా కస్టమర్లకు ఏదయినా సరే ఫ్రీగా అందించే గ్రాబ్‌స్టర్ సంస్థను స్థాపించారు.

తమతో పార్టనర్లుగా ఉన్న బ్రాండ్లకు సంబంధించి ప్రతీ వారం లక్కీ డ్రా తీయడం, గెలిచిన వారికి ఏదో ఒక వస్తువు, లేదా ఆఫర్ను



పూర్తిగా ఫ్రీగా అందించడం చేస్తోంది గ్రాబ్‌స్టర్. అయితే ఈ లక్కీడ్రాలో పాల్గొనాలంటే ఆయా బ్రాండ్‌కి సంబంధించి 15 సెకన్ల షార్ట్‌ఫిలింను తప్పనిసరిగా చూడాలి. ఫ్యాషన్ వస్తువులు, రెస్టారెంట్ ఓచర్లు, ఎలక్ట్రానిక్స్, పాస్‌లు, రీచార్జ్‌లు ఇలా రకరకాల ఆఫర్లు అందిస్తోంది. ప్రతీ సోమవారం మధ్యాహ్నం 12 గంటలకు ఫ్రీ ఆఫర్ మొదలవుతుంది. ఒక కస్టమర్ మూడు లక్కీ డ్రాల్లో ఏదయినా ఒకదానికి అప్లయ్ చేసుకునే వీలుంటుంది. గెలిచిన వారి వివరాలను ఆదివారం సాయంత్రం యాప్‌లోనే ప్రకటిస్తారు. ఎలాంటి ప్రైజ్‌ని సెలెక్ట్ చేసుకోవాలో యూజర్ చేతుల్లోనే ఉంటుంది. ఆఫర్లను తమ ఫేస్‌బుక్ వాల్‌లో పోస్ట్ చేసిన వారికి గెలిచే అవకాశాలు ఎక్కువగా ఉంటాయి.

ప్రతివారం నిర్వహించే లక్కీ డ్రాకు బ్రాండ్స్ దగ్గర్నుంచి కొంత మొత్తం వసూలు చేస్తారు. కస్టమర్లు చూసే ప్రీయాడ్స్ నుంచి ప్రధానంగా రెవెన్యూ వస్తుంది. ప్రస్తుతానికి ముంబైలోని దాదాపు 75 బ్రాండ్స్ గ్రాబ్‌స్టర్ కస్టమర్లుగా ఉన్నాయి. ఈ యాప్ డౌన్‌లోడ్స్‌తో ప్రతివారం 20 శాతం వృద్ధిని సాధిస్తోంది ఈ కంపెనీ. చివరికి ఆఫర్లను కూడా బిజినెస్‌గా మార్చేసిన ఈ యువత క్రియేటివిటీకి ఆశ్చర్యపోవాల్సిందే!

# మెయిల్ బాక్స్

## సినీవాలి సూపర్‌హిట్

సినీవాలి సీరియల్ బాగుంది. ప్రతివారం చదవాలనిపించింది. పేరెంతో ఆకర్షణీయంగా ఉంది. ఆరంభమే అదిరింది. సినిమారంగంలో ఎవరైనా పైకి రావాలంటే ఎన్నో కష్టాలు పడాలి. ఒకపట్టాన ఎదగరు. సీరియల్ రచయిత ప్రభాకర్ జైనిగారు సినీరంగం గురించి మంచి సీరియల్ ఎత్తుకున్నారు. సినీరంగం, రాజకీయాలు, పోలీసు వ్యవస్థ... ఇత్యాదులన్నీ పడుగుపేకల్లా అల్లుకుపోయి ఉంటాయి. సీరియల్‌లో ఆ దర్శకుడి పేరు ఏమిటి? వారంవారం మీరు ఇస్తున్న ప్రశ్న, బహుమతి ఆసక్తికరంగా ఉంది.

-గోపాలకృష్ణ అయ్యంగార్, హైదరాబాద్-68

### అద్భుత ఆవిష్కరణ

మన సినిమా అన్యభాషా విభాగంలో ఆస్కార్ అవార్డుకు ఎంపిక కావడం ఏమోగానీ, సినీవాలి సీరియల్‌ను మాత్రం రచయిత అద్భుతంగా ఆవిష్కరిస్తున్నారు. సీరియల్ చదువుతుంటే, నిజంగా సినీ రంగంలో ఇలాగే జరుగుతాయేమో, అవన్నీ సామాన్యులకు తెలియకుండా పోలీసుల రాజీ, మధ్యవర్తిత్వాల మధ్య నాలుగ్గదుల్లోనే సమాధి అయిపోతున్నాయేమో అనిపించింది. సీరియల్ ప్రతివారం చదవాలనే ఆసక్తి రేకెత్తించారు రచయిత ప్రభాకర్‌జైని.

వారాలు గడిచేకొద్దీ మరిన్ని వాస్తవాలను, సినీరంగంలో తెరవెనుక ఆర్టిస్టులపై జరిగే దాష్టీ




కాలను రచయిత కళ్ళకు కడతారనే ఆసక్తితో ఎదురుచూస్తున్నాం. వారంవారం కార్టూన్లు, జోకులు, సినీ విశేషాలతో మా ఇంటిల్లిపాదిని అలరిస్తోంది నవ్య వీక్లీ.

-సూర్యనారాయణ.పి, ఏలూరు

### బండారం బైటపెట్టే సీరియల్

ఈ వారం కథలన్నీ బాగున్నాయి. ముఖ్యంగా సీరియల్స్ అన్నీ బాగుంటున్నాయి. వెట్టి, సినీవాలి, మాధురి ఐఎఎస్, మహానంది దేనికదే ఆసక్తికరంగా ఉన్నాయి. మహానంది సీరియల్ జానపద గాథగా ఆకట్టుకుంటే, సినీవాలి సీరియల్ సినిమారంగం బండారాన్ని, అందులోని కష్టాలను వివరించేదిగా ఉంది.

-వల్లిపద్మావతి, ఎస్సార్‌నగర్, హైదరాబాద్

### బాలోత్సవ్‌కు అండగా నిలబడదాం

బాలోత్సవ్ రమేష్‌బాబు వంటివారి ఆలోచనలు ఈ దేశానికి ఎంతో అవసరం. ఆయన చేస్తున్న ప్రయత్నానికి మనం అందరం అండగా నిలబడాలి. రేపటి పౌరులను మనం తీర్చిదిద్దు కోలేకపోతే మన దేశం ఎటుపోతుందో చెప్పలేం. ఇప్పటికే మన పిల్లలు దారితప్పి విలాసాలబాట పట్టి, తల్లిదండ్రుల్ని గౌరవించకుండా, మన సంస్కృతినీ, సృజనాశక్తిని కూడా కోల్పోతున్నారు. రమేష్ బాబుగారికి అభినందనలు.

-ఊటుకూరి వినోదరావు, సత్తుపల్లి. ఖమ్మంజిల్లా

### మంత్రముగ్ధుల్ని చేసిన భజంత్రీలు కథ

దీపావళి ప్రత్యేక సంచికలో డాక్టర్ విజయరామరాజుగారి 'భజంత్రీలు' లాంటి మంచి కథ అందించినందుకు ధన్యవాదాలు. గ్రామీణ సహజ సిద్ధమైన అందాలు, జనజీవనం, ప్రతిభ తెరమీద చూపించినంత చక్కగా చూపించారు రచయిత. ఈవెంట్ మేనేజర్ జీలకర్ర బెల్లం కోసం నామ మాత్రంగా ఏర్పాటు చేసిన వేదికపై ప్రఖ్యాత డోలు సన్నాయి కళాకారులకు అవకాశం రావటం, రాజయ్య సన్నాయి స్వరానికి వేలాదిమంది పెళ్ళి జనం మంత్రముగ్ధులు కావడం, డాక్టర్ ఈతముక్కలగారి నిస్సహాయ కన్నీటి చుక్కలు వేదికపై రాలటం అత్యంత సంతోషంతోపాటు కొంచెం మనసును కూడా కలతపరిచిన సన్నివేశం. ప్రఖ్యాత గాయని శ్రీమతి జానకి పోటీపడి పాటకు నాద స్వరం మరొకసారి గింగురుమనిపించింది.

-జె.హనుమంతరావు, జీడిమెట్ల, హైదరాబాద్-55

### మనోహర మాలిక దీపావళి సంచిక

పత్రగుచ్ఛాల్లాంటి 18 కథలు, 13 కవితలు, రత్నాల్లాంటి నాలుగు సీరియల్స్ అనే దారాలతో గుదిగుచ్చి తయారుచేసిన మనోహర మాలికగా ఉంది దీపావళి ప్రత్యేక సంచిక. ఒక్కోపేరుతో ఒక్కోదీపంతో దీపారాధన ఎలా చేయాలో చెబుతూ సాగిన మనోరవళి దీపావళి వ్యాసం ప్రత్యేకంగా ఉంది. శిక్షార్హుడైన పాపిని కూడా సజ్జనుడు క్షమించాలన్న సీతమ్మతల్లి నీతి రామాయణకాలంలో సరేగానీ ఈనాడు అలా క్షమిస్తూపోతే సజ్జనుడే మిగలడు. సురభిలో గాలివాటం ఇల్లు ఆకట్టుకుంది. ఎక్కువనీరు తాగినా ప్రమాదమే రోజుకొక చాక్లెట్ మంచిదే అని ఆరోగ్యమే మహాభాగ్యం ద్వారా తెలుసుకున్నాం.

-ఆర్.శాంతిచంద్రిక, ఎఆర్‌పురం, సామర్లకోట

### సర్వాంగ సుందరం

నవ్య దీపావళి ప్రత్యేక సంచిక సర్వాంగ సుందరంగా ఉంది. ముఖచిత్రం గీసిన సురేష్ పనితనం బాగుంది. సినీవాలి సీరియల్ ఆసక్తికరంగా ఉంది. సంతోషం.

-డా.ఎం.పురుషోత్తమాచార్య, నల్లగొండ-05

# భలేభలే మంచు బంతులు

**ధృవప్రాంతాలలో, హిమాలయాల వంటి చల్లని మంచుపర్వతాలలో పగలూ రాత్రీ అనే తేడా లేకుండా నిరంతరం మంచు కురుస్తూనే ఉంటుంది. సమీప ప్రదేశాలన్నీ మంచులో కూరుకుపోతాయి. సముద్రాలు, నదులు సైతం గడ్డకట్టేస్తాయి.**

అయితే ఇలాంటి మంచు ప్రదేశంలో ఒకచోట ఓ వింత జరిగింది. సాధారణంగా నీరు గడ్డకడితే అలాగే ఉంటుంది కానీ, గుండ్రటి బంతుల్లా గడ్డకట్టడం ఎప్పుడైనా చూశారా! అవునండీ అక్కడ నీరు గుండ్రని బంతుల్లాగా గడ్డకట్టింది. ఈ వింతని చూడడానికి చాలా మంది పర్యాటకులు వచ్చిపోతున్నారట.

### ఎక్కడ ఏర్పడ్డాయంటే?

ఆర్కిటిక్ పరిధిలోని వాయువ్య సైబీరియా ప్రాంతంలో యామాల్ ద్వీపకల్పంలోని, ఓబ్ సముద్ర తీర ప్రాంతంలో ఉన్న నైడా గ్రామానికి దగ్గరలో ఓ బీచ్ ఉంది. ఆ బీచ్‌లో సహజసిద్ధంగా ఏర్పడిన స్నోబాల్స్ (మంచుబంతులు) అందరినీ విశేషంగా ఆకర్షిస్తున్నాయట. నైడా గ్రామ ప్రజలు కూడా వాటిని చూడడం అదే మొదటిసారి. ఇంతవరకూ ఆ బీచ్‌లో అలాంటి అద్భుతం జరగలేదు. వాటిని చూస్తే ఇవి సహజసిద్ధంగా ఏర్పడినవి కావు, ఎవరో తయారు చేసి ఉంటారు అనిపిస్తుందట. అంత అందంగా ఉన్నాయట అవి. కానీ అవి సహజసిద్ధంగానే ఏర్పడినవి అని పర్యావరణ పరిశోధకులు తేల్చిచెప్పేశారు.

### టెన్నిస్‌బంతి పరిమాణంలో

మంచుబంతులు అనగానే ఏవో చిన్న చిన్నగా ఏర్పడి ఉండొచ్చు అని అనుకునేరు. టెన్నిస్ బంతి పరిమాణంలో ఈ మంచుగోళాలు ఉన్నాయి. ఇవి దాదాపు 18 కిలోమీటర్ల మేరకు విస్తరించాయట. అరుదైన పర్యావరణ ప్రక్రియ వల్ల ఇవి ఏర్పడతాయి. అతిచిన్న మంచు ముక్కలన్నీ గాలి, నీటి వేగం వల్ల పెద్ద మంచు బంతులుగా ఏర్పడ్డాయని పరిశోధకులు చెబుతున్నారు. సముద్ర తీరంలో నిలిచి ఉన్న ద్రవరూపంలోని మంచు కొన్ని ప్రత్యేకమైన ఉష్ణోగ్రతల వద్ద వాయు పరిస్థితుల కారణంగా ఇలాంటి స్నోబాల్స్ (మంచు బంతులు) ఏర్పడి ఉండొచ్చని ఆర్కిటిక్, అంటార్కిటిక్ రీసెర్చ్ ఇనిస్టిట్యూట్‌కి చెందిన పరిశోధకులు చెబుతున్నారు. ఇలాంటి స్నోబాల్స్ ఇక్కడ ఏర్పడడం తొలిసారి అయినప్పటికి ఇంతకు ముందు వేరే వేరే ప్రాంతాలలో కూడా ఏర్పడ్డాయట. 2014వ సంవత్సరంలో ఫిన్‌లాండ్ తీరంలోనూ, 2015వ సంవత్సరం డిసెంబర్‌లో మిచిగాన్ ప్రాంతంలోనూ కనిపించినట్లు చెబుతున్నారు.



### ఐస్ వాల్కనోలు

వేడి వేడిగా లావా పొంగుతూ పైకి లేచే వాల్కనోల సంగతి తెలుసు, అలాగే సముద్రంలో ఏర్పడే అగ్నిపర్వతాల గురించి కూడా తెలుసు, ఇంకాస్త ముందుకెళితే మడ్ వాల్కనోల గురించి కూడా తెలుసు కదా! మరి ఈ ఐస్ వాల్కనో గురించి ఎప్పుడైనా విన్నారా? అవునండీ... ఐస్ వాల్కనోలు కూడా ఉన్నాయి. ఎక్కువగా మంచు ప్రాంతాలలో ఇవి ఏర్పడతాయి. వీటిని 'ఫ్యూమరోల్స్' అని పిలుస్తారు. సాధారణంగా వాల్కనోలలో లావా వస్తుంది కదా కానీ ఈ ఐస్ వాల్కనోలలో లావాకి బదులు గ్యాస్ రిలీజ్ అవుతుంది. అది చాలా చల్లగా ఉంటుంది. మంచు అంతా పైకి పొంగుతూ చూడ్డానికి చాలా బాగుంటుందట. ఇలాంటి వాటిని చూడ్డానికి చాలామందే వస్తారట కూడా.

ఇడియట్ బాక్స్!!

టెలివిజన్‌కు మనం పెట్టుకున్న ముద్దుపేరిది.

80వ దశకంలో దేశం అంతటా వ్యాపించిన టీవీ మాధ్యమం భారతీయ జీవన విధానాన్నీ, ఆలోచనా సరళినీ మార్చివేసింది.

సకల జీవన రంగాలను ప్రభావితం చేయడమేకాదు, ప్రసార మాధ్యమాల్లో ఓ విప్లవానికి నాంది పలికింది.

బుల్లితెరతో లాభాలెన్నో, లెక్కలేనన్ని నష్టాలూ అన్నే!

ఇంట్లో కూర్చున్న మనిషితో క్షణాల్లో విశ్వవీక్షణం చేయించే ఈ బుల్లిపెట్టె కనిపించని సమస్యలను తెచ్చిపెడుతోంది.

దీనివల్ల ఎన్ని దుష్ప్రభావాలున్నా, మనల్ని ఎంత డిస్టర్బ్‌చేసినాగానీ నేటి మనిషికి ఇదో నిత్యావసర, విలాస వస్తువు.

నిజం చెప్పాలంటే, టీవీ ఒక అనివార్య శత్రువు!



(నవంబర్ 21 వరల్డ్ టెలివిజన్ డే సందర్భంగా)

# బుల్లితెరతో భలే ఇక్కట్లు

చూసినా చూడకపోయినా చాలా ఇళ్ళల్లో టీవీ మోగుతూనే ఉంటుంది.

ఒంటరితనాన్నీ, మనిషిలో ఉండే రకరకాల భయాలను పారద్రోలే సాధనం టీవీ.

వేలకోట్లరూపాయల వ్యాపార సామ్రాజ్యాన్ని సృష్టించింది టీవీ. క్షణం తీరికలేని వ్యాపకానికీ, కాలక్షేపానికీ సరైన సాధనం. టెలివిజన్ లేని ఇంటిని ఊహించుకోవడం అసాధ్యం.

మానవాళికి టెలివిజన్ అందిస్తున్న సేవలకు గుర్తుగా గత రెండు దశాబ్దాలుగా నవంబర్ 21వ తేదీని 'వరల్డ్ టెలివిజన్‌డే'గా పాటిస్తున్నారు. 1996లో జరిగిన ఐక్యరాజ్య సమితి జనరల్ అసెంబ్లీ సమావేశాల్లో 'టెలివిజన్ డే' పాటించాలని తీర్మానం చేశారు.

టెలివిజన్ విలువలను పెంపొందించేందుకు, మానవమేధస్సు కలుషితం కాకుండా ఇప్పుడిప్పుడే కొన్ని నియంత్రణ చర్యలు కూడా చేపడుతున్నారు.

## ప్రపంచవ్యాప్త గుర్తింపు

అరచేతిలో ప్రపంచ వీక్షణంలాంటిదే టీవీ. ప్రపంచంలో 1920లో మొదటిసారి టెలివిజన్ ప్రసారాలు ప్రారంభమయ్యాయి. 1959 సెప్టెంబర్ 16న మొట్టమొదటిసారి మన దేశ రాజధాని ఢిల్లీలో టెలివిజన్ ప్రసారాలు ప్రారంభమయ్యాయి. 1975 వరకూ దేశంలోని ఏడు నగరాల ప్రజలు మాత్రమే టీవీని వీక్షించారట. తర్వాత 1980లో కలర్‌టీవీలు ప్రవేశించాయి. ఆ తర్వాత ఇక టెలివిజన్ రంగంలోనే ఎన్నో కొత్తకొత్త పోకడలు వచ్చాయి. ఈనాడు ప్రపంచవ్యాప్తంగా టెలివిజన్ రంగం ఓ విస్తృత ప్రసారమాధ్యమం.

## విచ్ఛిన్నమవుతున్న కుటుంబాలు

భారతీయ సమాజంలోని ప్రత్యేకతను విస్మరించి నిర్మిస్తున్న టీవీ సీరియల్స్ వల్ల మన కుటుంబ వ్యవస్థ తీవ్ర ప్రభావానికి గురవుతోంది. ఈ కారణంగా ఎన్నో కుటుంబాలు విచ్ఛిన్నమవుతున్నాయి. మానవీయ విలువలు క్షీణించిపోతున్నాయని పలు పరిశోధనలు వెల్లడిస్తున్నాయి. అయితే పేద వర్గాలకు చెందిన మహిళలపై ఈ సీరియల్స్ ప్రభావం ఎక్కువగా లేదట. దేశ ఆర్థికవ్యవస్థకు, వినియోగ వ్యవస్థకు ఆయువు పట్టుగా నిలిచిన మధ్యతరగతి వర్గం, ముఖ్యంగా ఆ వర్గానికి చెందిన గృహిణులపైనే ఈ ప్రభావం ఎక్కువగా ఉందట. వీటిల్లోని దృశ్యాలు, ఆభరణాలు, ఘర్షణలు, కుతంత్రాలు వారి మనసుల్లో నాటుకుపోతున్నాయి.

ఎదిగీ ఎదగని ఆలోచనల్లో ఉండేవారు, నిర్ణయాలు తీసుకోలేని సందిగ్ధస్థితిలో కొట్టుమిట్టాడే వివిధ వయసులకు చెందినవారు, అపరిపక్వ వయసుల వారు ఈ ప్రభావాలకు గురై, ఆ ఫిక్షన్ ఘటనలను తమ జీవితాలకు ఆపాదించుకుని ముఖ్య నిర్ణయాలు తీసేసుకుంటున్నారనీ, కుటుంబంలో సమస్యలను కొనితెచ్చుకుంటున్నారనీ పరిశోధకులు చెబుతున్నారు.

## క్షీణిస్తున్న పిల్లల జ్ఞాపకశక్తి

పిల్లల కోసమే ప్రత్యేకంగా కొన్ని ఛానల్స్ ఉన్నాయి. స్కూల్ నుంచి రావడం ఆలస్యం రిమోట్ పట్టుకుని రకరకాల ఛానల్స్ చూసేందుకు ఎగబడటం లైఫ్ స్టైల్‌గా మారిపోయింది. కొన్ని ఇళ్ళల్లో పిల్లల

# దోమలను తరిమేసే టీవీ!

ఇంట్లో దోమల బెడద ఎక్కువగా ఉంటే, మస్కిటో కాయిల్లో లేదా ధూపమో వేస్తాం. అయినా సరే ఫలితం ఉండటం లేదని విసిగిపోతున్నారా? అయితే మీరు చింతించాల్సిన పనిలేదు. టీవీ కొనుక్కోండి చాలు, అదే మీ ఇంట్లో దోమలను తరిమేస్తుంది. టీవీ ఏంటీ, దోమలను తరిమేయడమేంటీ అని ఆశ్చర్యపోతున్నారా? దోమలవల్ల వివిధ రకాల వ్యాధులు వస్తున్నాయన్న నేపథ్యంలో ఎల్‌జీ టీవీ సంస్థ వినూత్నంగా ఆలోచించి ఎల్‌జీ మస్కిటో అవే టీవీ అనే సరికొత్త అల్ట్రాసోనిక్ డిజైన్ టీవీని విడుదల చేసింది.

ఈ టీవీ మీ ఇంట్లో ఉంటే దోమల బెడద నుంచి విముక్తి పొందవచ్చు! ఈ టీవీని ప్రత్యేకంగా భారతీయ వినియోగదారులను దృష్టిలో ఉంచుకునే రూపొందించారట. అంతేకాదు దీని తయారీలో ఎలాంటి విషపూరిత నిరోధకాలూ వాడలేదు. ఎల్‌జీ స్టోర్‌లలో ఈ టీవీని కొనుక్కోవచ్చు.

# గతి తప్పుతున్న యువత



యువత జీవితాల్లో చిచ్చు పెడుతోందీ టీవీ. చదువును దెబ్బతీస్తోంది. నిన్నమొన్నటి పరిమితులను దాటిన టీవీ ఛానల్స్‌లో శృంగార భరిత ప్రోగ్రాంలు క్రమంగా పెరిగిపోవడంపట్ల తల్లిదండ్రుల్లో ఆందోళన వ్యక్తం అవుతోంది. బుల్లితెరపై విజృంభిస్తున్న శృంగార సన్నివేశాలు టీనేజ్ యువతలో అక్రమ సంబంధాలకు దారి తీయటం, టీనేజ్ దాటకుండానే గర్భం దాల్చే అమ్మాయిల సంఖ్య క్రమంగా పెరుగుతోందని తాజా పరిశోధనలో వెల్లడైంది. టీవీల్లో చూసి, తెలిసీ తెలియని వయసులోనే శృంగార సుఖానికి అలవాటు పడుతున్నారు. దీనిపై సర్వే నిర్వహించిన శాస్త్రవేత్తల బృందం 12-17 ఏళ్ల మధ్య వయసు బాలబాలికలను ఎంచుకుని వారి టీవీ అభిరుచులను ప్రశ్నించింది. టీవీవల్ల టీనేజర్స్‌లో సెక్స్ అభిరుచి పెరిగిందని వారు వెల్లడించారు.

అల్లరి మాన్పించేందుకు తల్లిదండ్రులే రిమోట్ వారి చేతికిచ్చి అలవాటు చేస్తున్నారు లేదా వారిని ఒంటరిగా టీవీ ముందు కూర్చోబెట్టి తమ పనులు చక్కబెట్టుకుంటున్నారు!

ఈ కారణాలవల్ల వాళ్ళ మెదళ్ళలోకి కొన్ని వందల రకాల శబ్దాలు చేరుతుంటాయట. ఇలా చిన్నతనంలో లెక్కకుమించిన శబ్దాలహోరు చెవుల్లో పడుతుంటే పిల్లల్లో జ్ఞాపకశక్తి తగ్గిపోతుందని శాస్త్రవేత్తలు గుర్తించారు. నిరంతరం టీవీ చూసే పిల్లలు భాషకు సంబంధించిన ఎన్నో పదాలు గుర్తుపెట్టుకుని తిరిగి ఉచ్చరించలేకపోతున్నారని అమెరికా విస్కాన్సిన్ యూనివర్సిటీ శాస్త్రవేత్తలు చెబుతున్నారు. టీవీ ఎక్కువగా చూస్తున్న పిల్లల కంటే ప్రశాంత వాతావరణంలో పెరుగుతున్న పిల్లల్లో జ్ఞాపకశక్తి, కొత్త పదాలను గుర్తుంచుకునే శక్తి ఎక్కువగా ఉన్నట్టు గమనించారు.

పిల్లలు నేర్చుకుని గుర్తుంచుకున్న పదాల శబ్దాలపై అనవసర శబ్దాల హోరు ప్రభావం చూపడంవల్ల వారు జ్ఞాపకశక్తిని కోల్పోయి నేర్చుకున్న పదాలు మర్చిపోతున్నారని చెబుతున్నారు. కాబట్టి ఇకనుంచైనా పిల్లల్ని టీవీకి దూరంగా ఉంచి వారితో ఆటలు ఆడిస్తూ, మెదడుకు పదునుపెడుతూ కాలం గడిపేలా చేయండి.

### సృజనాత్మకత కోల్పోవటం

టీవీ దైనందిన జీవితంలో ఓ భాగం. దీంతో చాలామంది టీవీలకే అతుక్కుపోతున్నారు. బైటకు వెళ్ళే చివరి క్షణం వరకు టీవీని వీక్షించడం ఇప్పుడో అలవాటు! భోజనం చేస్తున్నా, ఏపని చేస్తున్నా టీవీ ఉండాల్సిందే. ఇలా ప్రతిరోజు అరగంట కన్నా ఎక్కువ టీవీ చూసేవారిలో సృజనాత్మకత తగ్గిపోతుందని స్టాఫర్డ్‌షైర్ యూనివర్సిటీ శాస్త్రవేత్తల పరిశోధనల్లో వెల్లడైంది. ఇది భవిష్యత్తుకు అడ్డంకిగా మారుతుందని ముఖ్యంగా మూడు సంవత్సరాల వయసు పిల్లల్లో ఈ ప్రభావం ఎక్కువగా ఉంటుందని వారు చెబుతున్నారు.

### ఒబేసిటీ గ్యారెంటీ?

ప్రతిరోజూ గంటల తరబడి టీవీ చూస్తున్నారా? అయితే మీరు లావైపోవడం గ్యారెంటీ అంటున్నారు పరిశోధకులు. ఇది ప్రాణాలకు కూడా ముప్పేనట. టీవీ సాధనం తినే తిండిపై ప్రభావం చూపిస్తుంది. మిమ్మల్ని ఎక్కువగా తినడానికీ, తక్కువగా పనిచేయడానికీ ప్రోత్సహిస్తుందని తాజా అధ్యయనాలు చెబుతున్నాయి.

అదేపనిగా టీవీకి అతుక్కుపోయి వ్యాయామం చేయకుండా ఉండడంవల్ల, గంటల తరబడి కూర్చోవడం వల్ల శరీరంలో మెటబాలిక్ రేట్ తగ్గిపోతుంది. ఫ్యాట్ కరిగించడానికి కారణం అయ్యే ఎంజైమ్స్ పనితీరు పూర్తిగా క్షీణించిపోతుంది. దీనివల్ల ఒబేసిటీ వచ్చే అవకాశాలు ఎక్కువ. బరువు పెరగడం వల్ల గుండె సంబంధిత సమస్యలకు, మధుమేహం రావడానికి అవకాశముందని పరిశోధకులు చెబుతున్నారు. అలాగే కూర్చుని ఏకాగ్రతతో చూస్తూ తింటూ ఉంటే బరువు పెరిగి నీరసించిపోతారట. కాబట్టి టీవీ చూడటం తగ్గించమంటున్నారు పరిశోధకులు. ఆ సమయంలో మంచి పుస్తకం చదువుకుంటే చాలని అంటున్నారు.

ఇంటికి వచ్చిన వారిని పలకరించడం, వారితో మనస్ఫూర్తిగా మాట్లాడటం కరువైపోయింది. కనీస పలకరింపులను, మర్యాదలను కూడా దెబ్బ తీసే టీవీ మానవ సంబంధాలను క్షీణింపజేస్తోంది.

టీవీ వీక్షణమే ఇప్పుడు జీవిత కాలక్షేపం. 'నేను ఎవ్వరి జోలికీ వెళ్ళను, నాపనేదో నాది, టీవీ చూసుకుంటాను కాలక్షేపం అయిపోతుంది, ఎవరింటికీ వెళ్ళను, ఎవరితో మాట్లాడను' అని చెప్పుకోవడం క్రమశిక్షణాయుతమైన జీవితంగా భావిస్తున్నారు కొందరు. హయ్యస్ట్ రేటింగ్ ఉండే సీరియల్స్ లేదా ప్రోగ్రాముల ప్రసార సమయాల్లో కొండొకచో వీధులన్నీ నిర్మానుష్యమైపోవడం, పిలిచినా, అరిచినా పలికే దిక్కులేకపోవడం వంటి దుర్భరస్థితులను కూడా తెచ్చిపెడుతోందీ బుల్లితెర!

అతిథులు వస్తే, ఇప్పుడు వీళ్ళెందుకు వచ్చార్రా బాబూ! అనుకునే స్థితికి వచ్చారు. మనింటికి ఎవరు వస్తున్నారో, వెళుతున్నారో కనీసం ఏం తింటున్నామో కూడా తెలియని పరిస్థితి నెలకొంది. అందుకే టెలివిజన్‌ను మితంగా వాడుతూ, సామాజిక సంబంధాలను, అనుబంధాలను పదిలం చేసుకోండి.

**-విజేత**



**రాత్రి ఒంటిగంట దాటినవేళ!**
**శంషాబాద్ ఎయిర్‌పోర్ట్ కిటకిటలాడుతోంది. విద్యార్థులు ఎమ్మెస్ చేయడానికి ఇతర దేశాలు వెళ్తున్న సీజను. ఎటు చూసినా పిల్లలూ, కన్నీళ్ళు కళ్ళలోనే అదుముకుని వాళ్ళని సాగనంపడానికి వచ్చిన తల్లిదండ్రులూ, ఒక కంటిలో వారి భవిష్యత్తు మీద సంభ్రమమూ, సంతోషమూ, మరో కంటిలో వాళ్ళని వదిలేస్తున్న దుఃఖమూ...**

నర్మద అలాగే అందరిలో ఒకరిగా నిలబడి దూరంగా చెకిన్ చేయించుకుంటున్న శ్రీవైపు చూస్తోంది, చాలా నిర్లిప్తంగా, భావరహితంగా.

శ్రీ ఉద్వేగానికి గురవుతూ హడావుడిగా ఒక చేతిలో పాస్‌పోర్టు, వీసా పట్టుకుని మరో చేత్తో హ్యాండ్ లగేజ్ మోస్తూ ఖతార్ కౌంటర్ దగ్గర నిలబడి అప్పుడప్పుడూ వెనక్కి తిరిగి తల్లివైపు చూస్తోంది.

శ్రీ చూసినప్పుడల్లా నర్మద పెదవులు అరనవ్వుతో విచ్చుకుంటున్నాయి, మరేం ఫర్వాలేదన్నట్లుగా.

# ఇది కథ కాదు

## -మన్నెం శారద

చెకిన్ ముగియగానే శ్రీ తల్లి దగ్గరకొచ్చింది.

"మమ్మీ నేను లోపలికెళ్ళిపోతాను. నువ్వు ఇలా ఎంతసేపు నిలబడతావు. మళ్ళీ ఇంత రాత్రివేళ నువ్వే డ్రైవ్ చేసుకుంటూ వెళ్ళాలి" అంది బాధగా.

బదులుగా నర్మద చిన్నగా నవ్వింది.

"ఫర్వాలేదురా. ఈ వేళ కొత్తగా డ్రైవ్ చేస్తున్నానా? అది సరే! నువ్వనుకున్న కోరిక తీరింది. జాగ్రత్త. బాగా చదువుకో. కొత్త దేశం! కొత్త పరిస్థితులు. వాషింగ్‌టన్ చేరగానే కాల్ చెయ్యి" అంది.

"అలాగే మమ్మీ, జాగ్రత్త. ఒక్కదానివే ఉంటావు! హెల్త్ జాగ్రత్తగా చూసుకో. బీపీ టాబ్లెట్స్ స్కిప్ చేయకు" అంది శ్రీ. అలా అంటున్నప్పుడు శ్రీ కళ్ళలో నీళ్ళూరాయి.

నర్మద శ్రీ భుజాన్ని అనునయంగా తట్టి "ఒక్కదాన్నా.... మీ డాడీ లేరూ...?" అంది నవ్వుతూ.

శ్రీ తల్లివైపు అదోలా చూసి తల పంకించింది అవునన్నట్లుగా.

"సరే మమ్మీ. నువ్వు బయల్దేరు. క్యూ చాలా పెద్దదిగా ఉంది. నేను వెళ్తాను" అంది తల్లి బుగ్గమీద ముద్దుపెట్టి.

నర్మద కూడా శ్రీ బుగ్గలు పుణికి, నొసటి మీద ముద్దుపెట్టి "ఆల్ ద బెస్ట్. హ్యాపీ జర్నీ" అని చెప్పి వెనుతిరిగింది.

శ్రీ కనిపించినంత సేపు తల్లివైపు చూసి నిట్టూర్చి, గబగబా హ్యాండ్ లగేజ్ తీసుకుని క్యూ వైపు పరిగెత్తినట్లుగా నడిచింది.

నర్మద బయటకొచ్చి తన కారు స్టార్ట్ చేసింది. కారు మెల్లిగా సిటీవైపు సాగిపోతోంది. రోడ్లన్నీ నిర్మానుష్యంగా ఉన్నాయి. ఇల్లు చేరి తాళం తీసేసరికి ఒక్కసారిగా మనసంతా శూన్యం ఆవరించినట్లయింది.

లైటు వేసి గోడవైపు చూసింది.

అక్కడ చంద్రశేఖర్ ఫొటో - నవ్వుతూ.

నర్మద లోపలికెళ్ళి బట్టలు మార్చుకుని వంటగదిలోకెళ్ళి కాఫీ కలుపుకుని హాల్లో కూర్చుంది. ఆమె చూపులు చంద్రశేఖర్ ఫొటో వైపు నిలిచాయి.

ఆ ఫొటోలో చంద్రశేఖర్ వయసు ముప్ఫయిలోపే ఉంటుంది. చెదరినట్లుండే క్రాఫ్, చిరుగడ్డం, చూపుల్లో నిశితత్వం, నిర్లక్ష్యపు చిరునవ్వు, మెరిసే కళ్ళు... ముఖ్యంగా తను అత్యంతంగా ప్రేమించిన వ్యక్తి. నర్మద భారంగా కళ్ళు మూసుకుంది. కంటి కొసలో తడి!

మూసిన ఆ కళ్ళ వెనక రీలులా తిరుగుతున్న గతం!

లేచి తన డబుల్ కాట్ మంచమ్మీద కొచ్చి ఒరిగి పడుకుని, "చెప్పు చంద్రా! నీకు సంతోషమేనా! నీ కోరిక తీరిందా! శ్రీని యుఎస్ పంపించాను. ఆమె కోరిక మేర...!" అనుకుంది.

సరిగ్గా పాతికేళ్ళ క్రితం...

చంద్రశేఖర్, నర్మద యూనివర్సిటీ క్యాంపస్‌లో ఓ చెట్టు కింద కూర్చున్నారు, ఒకరిని ఆనుకొని మరొకరు.

చాలాసేపట్నుంచి మౌనంగా కూర్చున్న చంద్రశేఖర్ని తన మోచేత్తో పొడిచి కుదుపుతూ... "ఏంటా ఆలోచన! నేను పక్కనుండగానే... కొంపదీసి ఇంకెవరినైనా..." అంటూ నవ్వింది నర్మద.

బదులుగా చంద్రశేఖర్ నవ్వలేదు.

నర్మద కూడా ఠక్కున నవ్వాపేసి "ఏంటి చంద్రా, నిజంగానే సీరియస్సా?" అంది మెల్లిగా.

"అవును నిమ్మీ. ఇంట్లో ఆర్థిక పరిస్థితులు బాగాలేవు. దుర్గకి సంబంధాలొస్తున్నాయి. తను అందరికీ నచ్చుతోంది. కట్నమే నచ్చక వచ్చిన సంబంధాలు వచ్చినట్లే పోతున్నాయి" అన్నాడు విచారంగా.

"అవును. మన దేశం ఎంత ప్రగతి సాధించినా ఈ దురాచారం మాత్రం పోవడం లేదు" అంది నర్మద కూడా విచారంగా.

"ఇప్పటికిప్పుడు మనమేం రిపేర్ చేయలేం కదా!" అన్నాడు చంద్రశేఖర్.

"ఇంకెంత! ఈ నెలలో మన పరీక్షలయిపోతాయి. మనకి జాబ్స్ వస్తే... దుర్గకి ఘనంగా పెళ్ళి చేసేద్దాం. దీనికంత విచారమా! నేను లేనూ!" అంది అతన్ని కుదిపి ఓదార్పుగా.

"నీ డబ్బుతోనా..?"

నర్మద కోపంగా అతని మాడు మీద ఒక దెబ్బవేసి "ఛఛా, మీ మగాళ్ళింతే. ఎంత దగ్గరగా వస్తారో, సమయం వచ్చినప్పుడు అంత దూరం జరిగి నిలబడతారు. ఇంతగా ప్రేమించుకున్నాం. ఒకరు లేకపోతే మరొకరు బ్రతకలేమనుకున్నాం. తొందరలో పెళ్ళి చేసుకోబోతున్నాం. ఇంకా నన్ను పరాయిదానిలా చూస్తున్నావంటే... ఛీ! నే పోతున్నా!" సర్రున పైకి లేవబోతున్న నర్మదని చెయ్యి పట్టుకుని లాగి కూర్చోబెట్టాడు చంద్రశేఖర్.

నర్మద కోపంగా బిగుసుకున్నట్లుగా కూర్చుంది.

"అది కాదు నిమ్మీ, మనకి జాబ్స్ ఎప్పుడొస్తాయి? డబ్బు ఎప్పుడు కూడబెడతాం? దుర్గకి అప్పుడే ఇరవై రెండేళ్ళు దాటాయి. ఇన్నాళ్ళూ నాన్న లేకపోయినా అమ్మకొచ్చే ఫ్యామిలీ పెన్షన్‌తో బతికాం. నాన్న పోయి పదిహేనేళ్ళు గడిచిపోయాయి. అమ్మ ఆరోగ్యం కూడా అంతంత మాత్రమే. తను పోయేలోపు దుర్గ పెళ్ళి చూడాలని..."

నర్మద అతని బాధ అర్థం చేసుకుంది. కానీ... తను అతనికి ప్రాణం ఇవ్వగలదు. కాని డబ్బు... ఎక్కడిది? తనకి తండ్రి ఎలా ఉంటాడో కూడా తెలియదు. తను సంవత్సరం పిల్లగా ఉన్నప్పుడే అతను ఏక్సిడెంట్‌లో చనిపోయాడని చెప్పింది అమ్మ. ఇంట్లో ఆనవాలుగా అతని ఫొటో కూడా లేదు.

కాని అమ్మది ప్రేమ వివాహమని... తను కడుపులో ఉండగానే అతను అమ్మని మోసం చేసి వెళ్ళిపోయాడని... అమ్మ చుట్టాలు అనుకోవడం తను విన్నది. కాని ఏనాడూ తను అమ్మని ప్రశ్నించలేదు.

అమ్మ ఆ పనీ ఈ పనీ చేస్తూ ఎంతో కష్టపడి తనని ఇంజనీరింగ్ చదివించింది.

ఇక ఉద్యోగంలో చేరి అమ్మని బాగా చూసుకోవాలి!

ఇదే తన ఆశ! ఆశయం!

అనుకోకుండా తన క్లాస్‌మేట్ చంద్రశేఖర్‌తో ప్రేమలో పడింది. ఇది మరోలోకం! అతను పరిచయం అయ్యాక తన ప్రపంచమే మారిపోయింది. అన్ని రుతువులూ వసంతంగా మారిపోయాయి. ఎక్కడ తిరుగుతున్నా, ఏం చేస్తున్నా... ఒక పక్కన చెరువలో అతని రూపమే కనిపిస్తుంటుంది. అతని మాటలే వినిపిస్తుంటాయి. తను అతన్నంత గాఢంగా ఎందుకు ప్రేమిస్తుందో తనకే తెలియదు.

చంద్రశేఖర్ ఆమెవైపు చూసి "ఏంటి నిమ్మీ, ఏంటాలోచిస్తున్నావు! నా మాటలు చిరాగ్గా ఉన్నాయా?" అనడిగాడు.

నర్మద చిన్నగా నవ్వడానికి ప్రయత్నించింది.

"చిరాకా? నీ బాధ నాది కాదా? ఏం చేయాలో తెలియక ఆలోచిస్తున్నాను" అంది.

అతనామె బుగ్గమీద చిన్నగా తట్టి "నువ్వేం చేయాలి! నా బాధని షేర్ చేసుకుంటున్నావు చాలు!" అన్నాడు నవ్వుతూ.

"నేను నీకో సంగతి చెప్పడానికే ఇదంతా మొదలుపెట్టాను. నువ్వర్థం చేసుకుంటావని నమ్ముతున్నాను" అన్నాడు తిరిగి.

అతనలా అనేసరికి నర్మద గుండె గుబగుబలాడింది - భయంతో. కొంపదీసి తను కట్నం కోసం మరో పెళ్ళి చేసుకుంటానని, తనను మరచిపొమ్మని చెప్పడు కదా! అలా అనుకోగానే ఆమె కళ్ళల్లోంచి చివ్వున నీళ్ళూరాయి.

బేలగా అతనివైపు చూసింది.

అతనదేం గమనించలేదు.

"నా ఫ్రెండ్ డేనియల్ గల్ఫ్‌లో ఉన్నాడు. బాగా సంపాదిస్తున్నాడు. చదువైపోగానే నన్నక్కడికి వచ్చేయమని తను చాలాసార్లు చెప్పాడు. కానీ... నేనప్పుడు వెళ్ళాలనుకోలేదు. కాని దుర్గకోసం... ఒక రెండు సంవత్సరాలు అక్కడ పని చేస్తే... చాలా మంచి శాలరీ... ఇండియాలో ఎక్కడొస్తుంది!"

నర్మదకి పరిస్థితి అర్థమైంది.

"నన్ను పెళ్ళి చేసుకో, ఇద్దరం వెళ్ళొచ్చు" అంది.

"దుర్గ పెళ్ళి చేయందే నేనెలా చేసుకుంటాను? మీ అమ్మగారిని ఒంటరిగా వదిలి నువ్వెలా రాగలవు? ఒక్క రెండేళ్ళు ఓపిక పట్టు. అన్ని పరిస్థితులూ చక్కబడతాయి. ఇంతలో నీ పరిస్థితులు కూడా చక్కబెట్టుకో. అమ్మకి మన ప్రేమ సంగతి తెలుసు. నువ్వంటే ఇష్టం కూడా. ఏమంటావ్?" అన్నాడు అనునయంగా.

అప్పటికే నర్మద మోకాళ్ళమీద తల పెట్టుకుని మౌనంగా ఏడుస్తోంది.

"ఏయ్ పిచ్చీ! ఏంటిది. ఇంత చదువుకుని,

జ్ఞానమున్న దానివి...” అతని మాటలు పూర్తి కాకుండానే చివ్వున తలెత్తింది నర్మద.

“చదువుకుంటే మనసు చచ్చిపోతుందా? నేను నిన్నొదిలి ఉండలేను చంద్రా!” అంది ఏడుస్తూ.

కాసేపు కాలం మౌనంగా దొర్లింది.

అతని చెయ్యి ఆమెని మౌనంగా అనునయిస్తోంది.

చీకటి నాలుగువేపులా పరదాలు దించుతోంది.

“పద!” అంటూ అతను పైకి లేచాడు.

వెనక నర్మద కూడా లేచి అడుగులు వేసింది.

నడుస్తూ నడుస్తూ అతను స్థిరంగా చెప్పాడు “వెళ్ళి తీరాలి నిమ్మీ, తప్పదు” అని.

అతని గొంతులోని స్థిరత్వం చూసి ఆమె మరింకేం మాట్లాడలేకపోయింది.

•••

ఆ రోజు రానే వచ్చింది.

చంద్రశేఖర్ దుబాయ్ వెళ్తుంటే, అతని కుటుంబంతోపాటు నర్మద కూడా ఎయిర్‌పోర్ట్‌కి వెళ్ళింది.

వెళ్తూ వెళ్తూ డిప్యూటీ ఇ.ఇ. పరీక్షలు రాస్తానన్నావుగా, రాయి. నీ మనసుని చదువు మీద పెట్టు. వారం వారం కాల్ చేస్తానుగా. నేను నీతోనే ఉన్నాను పిచ్చీ! ఏడవకు” అని చెప్పాడు గుసగుసగా.

నర్మదకి అతన్ని చుట్టేసుకుని బావురుమనాలనిపించింది.

చేతులడ్డం పెట్టి అతను వెళ్ళకుండా ఆపేయాలనిపించింది. కానీ... ఏమీ చేయలేకపోయింది. మౌనంగా దుఃఖాన్ని దిగమింగుకుని అతను వెళ్ళిపోవడాన్ని చూసింది, అసహాయంగా.

•••

ప్రతి శుక్రవారం అతన్నుండి ఫోనొస్తుంది. ఆ రోజు అతనికి సెలవు. ఫోను ఛార్జీలు కూడా హాఫ్!

ఎన్నో స్వీట్ నథింగ్స్! భవిష్యత్తు మీద ఎన్నో ఆశలు! ఎదురు చూపులూ! కలలూ!

నర్మదకి దుఃఖం పోయి, అతని కోసం రోజులు లెక్కపెట్టుకోవడం అలవాటయింది.

ఈ లోపున డిప్యూటీ ఇ.ఇ.గా సెలక్టయి అక్కడే పోస్టింగ్ అందుకుంది.

ఒకరోజు నర్మద ఇంట్లోనే ఏదో ఆఫీసు ఫైలు చూస్తుండగా తల్లి అనసూయ గదిలోకొచ్చి అటూ ఇటూ తారట్లాడింది.

నర్మదకి అర్థమైంది, ఆవిడ ఏదో చెప్పాలనుకుంటుందని.

“ఏంటమ్మా” అంది ఫైల్లోంచి తలెత్తి అనునయంగా.

అనసూయ కొంచెం ధైర్యంగా వచ్చి నర్మద పక్కన కూర్చుని “మీ ఆఫీసులో పనిచేసే ముకుంద రావుగారు నిన్న మనింటికొచ్చి వెళ్ళారమ్మా” అంది ఉపోద్ఘాతంగా.




నర్మద ఆశ్చర్యపోతూ “ఎందుకూ?” అనడిగింది.

అనసూయ చిన్నగా నవ్వి “కంగారు పడాల్సిందేమీ లేదులే. ఆయనకి నువ్వంటే చాలా అభిమానం. ఆఫీసులో నీ బిహేవియర్, పనితీరు... చాలా మెచ్చుకున్నారు” అంది.

“అయితే ఇంటికొచ్చి చెప్పడమెందుకు?”

“అవసరం కాబట్టేలే. ఆయనకో కొడుకు ఉన్నాడట. అమెరికాలో సాఫ్ట్‌వేర్ ఇంజనీరట. నిన్ను వాళ్ళ అబ్బాయికి అడగడానికొచ్చారు” అంది అనసూయ కూతురి మొహంలోకి గుచ్చి చూస్తూ.

చంద్రశేఖర్‌తో కూతురి ప్రేమ వ్యవహారం ఆమెకి కొంత తెలుసు.

సర్రున కోపంగా తల్లివైపు చూసింది నర్మద.

“ఏంటమ్మా! అంతా తెలిసి” అంది బాధగా.

అనసూయ గాఢంగా నిట్టూర్చింది. “నీకర్థం కావడం లేదు నర్మదా! దగ్గర దగ్గరగా సంవత్సరం దాటింది అతను రాక! ఏంటీ ఎదురు తెన్నులు! ఫోనులోనే పెళ్ళి, సంసారం సాగిస్తున్నారా మీరు!” అంది కొంచెం కోపంగా.

“ఇంకెంతమ్మా, ఆర్నెల్లు! ఓపిక పట్టు” అంది నర్మద, ఫైలు పక్కనపెట్టి తల్లి మెడ చుట్టూ చేతులు చుట్టి.

అనసూయ నిస్సహాయంగా చూసింది కూతురి వైపు.

•••

నర్మద అప్పుడప్పుడూ చంద్రశేఖర్ ఇంటికెళ్ళి వాళ్ళని పరామర్శిస్తోంది. ఇప్పుడు వాళ్ళ ఆర్థిక పరిస్థితిలో వచ్చిన మార్పు స్పష్టంగా కనిపిస్తోంది. దుర్గకి పెళ్ళి కుదిరింది. పెళ్ళికొడుకు కూడా ఇంజనీరేనట.

వాళ్ళ మొహాల్లో సంతోషం!

అంటే చంద్రశేఖర్ వస్తున్నాడన్నమాటేగా!

నర్మద గాల్లో తేలిపోయింది.

తన ఊహలు నిజం కాబోతున్నాయి. ఇన్ని రోజులూ... ఎంత నిరీక్షణ! మనసు ఛైమరచి సన్నాయి మోగిస్తుంటే కలలపై తేలిపోతూ ఇంటికొచ్చింది.

చంద్రశేఖర్ ఫోన్ చేశాడు రేపొస్తున్నట్లుగా.

ఆ రాత్రి నిద్ర కరువైంది.

•••

దుర్గ పెళ్ళి జరుగుతున్నంతసేపూ... హడావుడిగా తిరుగుతున్న చంద్రశేఖర్నే గమనిస్తోంది నర్మద.

కొంచెం కూడా ఏకాంతం దొరకడం లేదు.

రూపం మారింది. కొద్దిగా లావయ్యాడు. ఇంకొంచెం రఫ్‌గా కనిపిస్తున్నాడు. అందులోనే ఏదో కొత్త అందం!

అప్పుడప్పుడూ తనవైపు నిశితంగా గమనిస్తున్నాడు.

ఆ చూపులోనే కొంటెదనం! ప్రేమ... ఏవేవో భావాలు!

పెళ్ళి జరిగిపోయింది. తంతు ముగిసింది.

•••

ఆ రోజు ఇద్దరికీ ఏకాంతం లభించింది.

అతనితో మాట్లాడాలంటే ఎందుకో సంశయంగా అనిపించింది నర్మదకి. ఇదివరకటి చంద్రశేఖర్‌లా లేదు.

అతనే చొరవగా ఆమె చేతిని తన చేతిలోకి తీసుకుని “ఏంటి, కొత్తగా చూస్తున్నావ్!” అనడిగాడు చొరవగా.

“కొత్తగా కనిపిస్తున్నావ్ మరి” అంది నర్మద అతని కళ్ళలోకి సూటిగా చూడలేనట్లుగా చూపులు దించుకుని.

“దొరికినప్పుడు చూడు! లేకపోతే మిస్సయిపోతావ్!” అతని మాటలకి ఉలిక్కిపడింది.

“ఇక్కడే ఉండిపోవా?” బెదిరినట్లడిగింది.

“లేదు. ఎగ్రిమెంట్ పూర్తికావాలి కదా! ఇంకెంత? ఆర్నెల్లు!”

నర్మద మాట్లాడలేదు.

‘ఒక్క క్షణం కూడా వదల్లేను నిన్ను! ఇన్నాళ్ళూ ఎలాగో భరించాను’ అని అరిచి చెప్పాలనిపించింది. కానీ ఏమీ చెప్పలేకపోయింది.

“నాకూ... నిన్నొదిలి వెళ్ళాలని ఉందా నిమ్మీ? రోజూ ఎంతో గుర్తొస్తావు. ఇంకొక్క ఆర్నెల్లు! అంతే!” ఆమెని దగ్గరికి తీసుకుంటూ ఆమె చెవిలో గొణిగాడు చంద్రశేఖర్.

•••



చంద్రశేఖర్ వెళ్ళిపోయాడు, వసంతాన్ని తనతో తీసుకెళ్ళిపోయినట్లుగా.

రోజులు గడుస్తున్నాయి.

ఆర్నెల్లు గడిచిపోయాయి. కానీ ఈ లోపునే చంద్రశేఖర్ ఫోన్లు తగ్గిపోయాయి. ఒకవేళ చేసినా... వాటిలో తనాశించిన మాటలు దొర్లడం లేదు. ఏదో తేడా! నర్మద గుచ్చి అడిగినా... ఏదో దాటవేసే జవాబులు... ఏమీ లేదే... అని మాట మార్చడాలు! పని ఒత్తిడి అని సాకులు!

నర్మద రాత్రుళ్ళు ఏడుస్తోంది, తల్లికి తెలియకుండా. అనసూయ కూతుర్ని గమనిస్తోంది. సరిగ్గా తినటం లేదు. ఏడ్చినట్లుంటున్నాయి కళ్ళు!

"ఏమ్మా! అలా ఉంటున్నావ్?" అనడిగింది ఉండబట్టలేక ఒకరోజు.

"ఏం లేదమ్మా! ఏదో పని ఒత్తిడి" అంది నర్మద.

ఆ రోజు...

ఆ ఉత్తరం నర్మద జీవితంలో పెను తుఫాను సృష్టించింది. చంద్రశేఖర్ రాసిన ఉత్తరమది!

నిమ్మీ,

నీకెలా చెప్పాలో నాకు తెలియడం లేదు. కానీ... చెప్పి తీరాలి. నువ్వర్థం చేసుకుంటావని నాకు తెలుసు. ఆ శక్తి నీకుంది. నువ్వు చదువుకున్నదానివి.

ఇక్కడ నా ఫ్రెండ్ డేనియల్ అకస్మాత్తుగా ఏక్సిడెంట్‌లో చనిపోయాడు. ఇది జరిగి అప్పుడే మూడు నెలలు దాటింది. ఇది నాకు చాలా షాకింగ్ ఇన్సిడెంట్! నీకు తెలుసు, అతను తన మతం, కులం ఏదీ కాకపోయినా నన్నెంతో ఆదరంగా చూశాడు. జాబ్ ఇప్పించాడు. ఆర్నెల్లు తనింట్లోనే పెట్టుకున్నాడు. ఈ దేశం కాని దేశంలో అతనే నాకు చుక్కాని అయి నడిపించాడు. అతను పోవడం నాకెంత విఘాతమో నువ్వూహించగలవు.

ఇప్పుడిక నేను చెప్పబోయేది... నువ్వు జాగ్రత్తగా అర్థం చేసుకుంటావని నమ్ముతున్నాను. ఈ విషయం నీకు చాలా బాధ కలిగిస్తుందని నాకు తెలుసు. కాని... నేను నిస్సహాయుణ్ణి.

డేనియల్ భార్య సుమిత్ర గురించి...

ఆమె చాలా అమాయకురాలు. పెద్దగా చదువుకోలేదు. భర్త చాటున బ్రతికింది. ఒక చిన్న పాప. షారోన్! డేనియల్ మరణంతో వాళ్ళ బ్రతుకు అంధకారమైపోయింది. దిక్కుతోచని స్థితి. నేనే అన్నీ చూస్తున్నాను. వాళ్ళది ప్రేమ వివాహం. మతాంతరం కావడంతో సుమిత్రని ఎవరూ ఆదరించలేదు. అందుకే వాళ్ళు ఇండియా తిరిగి వెళ్ళలేకపోయారు. రెండు నెలల క్రితం షారోన్‌కి జబ్బు చేసింది. నేను వాళ్ళతో ఉండి సహాయపడాల్సొచ్చింది.

అప్పుడే ఒక పొరపాటు జరిగిపోయింది. ఒంటరి తనమో, బయోలాజికల్ నీడో... అర్థమయ్యింది కదూ! చాలా మథనపడ్డాను. తర్వాత ఆమె నామీద ఆధారపడిపోయింది. 'వాళ్ళని వదిలేయకు' అని నా స్నేహితుడు నన్ను అర్థించినట్లుగా అనిపించింది. తప్పనిసరి పరిస్థితుల్లో నేనామెను వివాహం చేసుకున్నాను. నాకాశ్రయం ఇచ్చిన స్నేహితుణ్ణి, వాళ్ళ కుటుంబాన్ని ఆదుకోవడం నా ధర్మమనిపించింది. ఈ విషయం నీ మనసుకెంత విఘాతం కలిగిస్తుందో... నాకు తెలుసు. నన్ను క్షమించమనే చిన్న పదం వాడి చేతులు దులుపుకోను... చంద్ర.

## హన్సిక బాగానే రాబట్టింది

హన్సికకు కోలీవుడ్‌లో ఉన్న క్రేజ్ టాలీవుడ్‌లో లేదు. ఈ విషయాన్ని అందరూ ఒప్పుకుంటారు. నిన్న మొన్నటివరకూ టాలీవుడ్‌లో హన్సికకు లక్షల్లోనే పారితోషికం ఇచ్చేవారు. కానీ తాజాగా ఆమెకు కోటి రూపాయలు ఇచ్చి మరీ తీసుకున్నారట! 'లక్కున్నోడు' సినిమాకి ఆమెకు కోటి రూపాయలు ముట్టచెప్పారని అంటున్నారు. అంటే హన్సిక కోటి ఇస్తే తప్ప టాలీవుడ్‌లో నటించదు అన్న చర్చ ఇక్కడ బాగా జరుగుతోంది. గోల్డెన్‌లెగ్‌గా ముద్రపడిన రకుల్ తెలుగు సినిమాకి కోటిరూపాయలు తీసుకుంటూంటే తెలుగులో ఏ మాత్రం డిమాండ్ లేని హన్సికకు కోటి రూపాయలు ఇవ్వడం ఏమిటని? పలువురు అంటున్నారు.

ఆ ఉత్తరం నర్మదకి దాదాపు పిచ్చెక్కించింది.

ఆత్మహత్య చేసుకోవాలన్నంత ఉద్వేగానికి గురయ్యింది. చంద్రశేఖర్‌ని తిట్టింది.

కొన్నాళ్ళు సెలవు పెట్టి మంచం పట్టింది.

అనసూయమ్మ ఇదంతా చూసి తల్లడిల్లిపోయింది.

అసలేం జరిగిందో తెలుసుకోవాలంటేనే భయంగా ఉంది. కొంపదీసి... చంద్రశేఖర్ గాని... అలా అనుకోడానికి మనసంగీకరించడం లేదు.

రోజులు జరిగిపోతున్నాయి.

గాయం మానినా బాధ మిగిలే ఉంది.

ఆ రోజు నర్మద ఒక చిత్రమైన అనుభూతికి గురయ్యింది.

మనసుకేదో సాంత్వన!

ఆరడుగుల శరీరమేనా మనిషి!

ఎంతమంది భౌతికంగా పక్కనే ఉండి, మనసులోకి రాకుండా కాపురాలు సాగిస్తున్నారు. చంద్ర ఏం చేస్తే తనకెందుకు! అతని పరిస్థితులేవిటో? అవసరాలు ఏవిటో? ఇప్పుడైనా అతను తనని వదిలేశాడని ఎందుకనుకోవాలి! తను అతనిని మనసా వాచా ప్రేమించింది. ప్రేమిస్తూ ఉంటేనే తనకి ప్రశాంతత! దీన్ని ద్వేషంగా ఎందుకు మార్చుకోవాలి! అతనేం చేసినా తను అతన్ని మరచిపోలేదు.

అంతే!

నర్మద మామూలు స్థితికి వచ్చేసింది.

●●●

రోజులు సంవత్సరాలుగా మారుతున్నాయి.

అనసూయమ్మ కాలం చేసింది.

మూడేళ్ళ తర్వాత అతన్నుండి ఉత్తరం!

నిమ్మీ,

నేను నీకు చేసిన అపకారానికి నాకు శిక్ష పడింది. సుమిత్ర సంవత్సరం క్రితం కేన్సర్‌తో చనిపోయింది. నా ఆరోగ్యం క్షీణించింది. సానుభూతి కోసం వివరాలు చెప్పను. ఇది ఆఖరి దశ. డాక్టర్లు చెప్పేశారు. నేను షారోన్‌ని నీ దగ్గరికి పంపుతున్నాను. పాప బాధ్యత ఇక మీదట నీదే! నేను నిన్ను ఆజ్ఞాపించటం లేదు. అభ్యర్థించడమూ లేదు. నీవు నా మనసులో సగానివి. నీవుగాక ఇంకెవరు ఈ బాధ్యత స్వీకరిస్తారు! వచ్చి ఎయిర్‌పోర్టులో రిసీవ్ చేసుకో.

నీ చంద్ర.

ఉత్తరం చదివి కాసేపు అలానే కూర్చుండిపోయింది నర్మద.

●●●

షారోన్, నర్మద జీవితంలోకి అడుగు పెట్టింది.

షారోన్ పేరుని శ్రీగా మార్చింది.

శ్రీకి తల్లిగా మారిపోయింది.

తర్వాత చంద్రశేఖర్ ఎలా ఉన్నాడో తెలుసుకునే ప్రయత్నం కూడా చేయలేదు నర్మద. అతనెప్పుడూ తనతోనే ఉంటాడు. అంతే!

శ్రీ ఇంజనీరింగ్ పూర్తిచేసి ఎమ్మెస్ చేయడానికి వర్జీనియా యూనివర్సిటీకి వెళ్ళింది.

అతనప్పజెప్పిన బాధ్యతని నిర్వర్తించడంలోనే తన ప్రేమ ఇమిడి ఉందని భావించింది.

నర్మద ప్రశాంతంగా కళ్ళు మూసుకుని 'నీకు సంతోషమేనా!' అనుకుంది.

ఆమె కంటి కొసల నుండి కన్నీరు జారిపడి తలగడలోకి ఇంకిపోయింది.

*సెల్: 96189 51250*



# జీవితమే ఒక ప్రతిఘటన

(కోట శ్రీనివాసరావు కథాకథనం) 7

**మీ డేట్లు కావాలి. ఎన్నాళ్ళిస్తారు? ఎప్పుడిస్తారు? అని అందరూ ఒకేసారి అడిగేసరికి ఏం చెప్పాలో అర్థం కాలేదు. అప్పుడు దాసరిగారే నాకు సాయంచేశారు.**

అక్కడ జ్యోతి ప్రసాద్ అని ఒకడున్నాడు. దాసరిగారు అతన్ని పిలిచి 'రేయ్ జ్యోతీ. ఏమను కోకుండా ఆయన డేట్లు నువ్వు చూడరా. పైకెదిగే ఆర్టిస్టు. డేట్లు చూసేవాళ్లు లేకపోతే కష్టమవు తుంది. చాలా ఇబ్బందులు పడతాడు. పొర పాటు జరిగిందంటే నేనూరుకోను. జాగ్రత్త' అని చెప్పి నా వైపు తిరిగి షేక్‌హ్యాండ్ ఇచ్చి 'ఇక ఈ టెన్షన్ మీకు ఉండదు శ్రీనివాసరావుగారు. అంతా మంచే జరుగుతుంది. కాల్షీట్ సమస్య లేకుండా మీరు నింపాదిగా నటన మీద ఏకాగ్రత పెట్టుకో వచ్చు' అని చెప్పి విష్ చేశారు. పక్కనే ఉన్న కృష్ణంరాజుగారు కూడా 'ఏం కంగారులేదయ్యా. అంతా బానే జరుగుతుంది' అన్నారు.

### అతడు చెప్పడం, నేనెళ్ళి చేయడం

ఆ రోజు సాయంత్రం జ్యోతి ప్రసాద్ నా దగ్గ రకు వచ్చి మాట్లాడాడు. నా కోసం వచ్చిన ప్రొడ క్షన్ మేనేజర్లు సాయంత్రం మరలా కలిస్తే జ్యోతికే అప్పజెప్పా. వాళ్లతోనూ తనే మాట్లా డాడు. అలా నా ప్రమేయం లేకుండానే నా కాల్షీట్లు చూడటానికి ఒక వ్యక్తి సిద్ధమయ్యాడు. అప్పటి నుంచి అతను ఏ షూటింగ్ ఉందంటే అక్కడికి వెళ్లేవాడిని. ఒక రకంగా అప్పుడు నా పరిస్థితి ఏంటంటే 'రేపటి నుంచి ఇదండీ. ఎల్లుండి నుంచీ ఇదండీ' అని అతను చెప్పడం, నేనెళ్లి చేయడం... రావడం. అంతే ఇక. అలా దాసరిగారి వల్ల డేట్ల విషయం ఓ కొలిక్కి వచ్చింది. కాల్షీట్ల సమస్య తీరింది. కానీ ఏ సిని మాకు ఎంత పారితోషికం తీసుకోవాలి? అప్పటి దాకా ఎవరు ఎంతిస్తే అంతే తీసుకున్నా. కానీ

## అలా కృష్ణంరాజుగారు నా పారితోషికాన్ని నిర్ణయించారు

అప్పుడప్పుడే అందరూ 'ఎంత తీసుకుంటారండీ' అని అడగడం మొదలుపెడుతున్నారు. మరి ఈ సమస్య తీరేదెలా? ఇక్కడ కూడా మరలా కృష్ణం రాజుగారి సమక్షంలోనే సమస్య తీరింది.

### అదెలాగంటే..?

'తాండ్ర పాపారాయుడు'కి 12 రోజులో, 13 రోజులో పనిచేశా. గోపీకృష్ణా ఆఫీసుకు నన్ను పిలిచారు. కృష్ణంరాజుగారు బ్రదర్ ఉండేవారు సూర్యనారాయణరాజుగారని. (ఆయనిప్పుడు లేరనుకోండి. ఈ మధ్యే పోయారు). ఆఫీసుకు వెళ్లా. అక్కడున్న ఆఫీసు బోయ్ మర్యాదలు చేసి కూర్చోపెట్టి, తినడానికి పకోడి తెచ్చిపెట్టి వేడివేడి కాఫీ ఇచ్చాడు. అతిథులను సత్కరించడంలో గోపీకృష్ణ మూవీస్ పెట్టింది పేరు. ఆఫీసు గడప తొక్కిన వారిని చాలా బాగా సత్కరించేవారు. మర్యాదలన్నీ అయ్యాక నన్ను తీరిగ్గా కూర్చోబెట్టి 'శ్రీనివాసరావు.. మా సినిమాకు పనిచేశావ్. ఏమి వ్వమంటావయ్యా నీకు' అని అడిగారు సూర్య నారాయణరాజుగారు. ఏం చెప్పాలో నాకు అర్థం కాలేదు. అటూ ఇటూ చూస్తున్నా. అప్పుడే కృష్ణం రాజుగారు ఆ రూమ్‌లోకి అడుగుపెట్టారు. నన్ను చూడగానే 'మ్.. రావయ్యా. ఎలా ఉన్నావ్? చాలా బాగా చేస్తున్నావని అంతా అంటున్నారు. ఇంకే మైనా సినిమాలు ఒప్పుకున్నావా? లేదా? ఎలా ఉంది జీవితం.. సినిమా పరిస్థితులు ఒంట బట్టాయా?..' ఇలా వరుసగా ప్రశ్నలు కురిపించారు. ఆయన ప్రశ్నలకు ఏదో సమాధానంగా నవ్వుతు న్నానే కానీ నా మనసులో సంశయం మొహంలో కనిపించిందేమో... ఆయనే చొరవదీసుకుని 'ఏంటి కంగారు...' అని అడిగారు. నేను సమాధానం చెప్పేలోగా అక్కడే కూర్చుని ఉన్న ఆయన సోద రుడు 'ఏం లేదు. ఇదీ సంగతి.. 'తాండ్ర పాపా రాయుడు'కి సంబంధించి ఇంతవరకూ మనం అతనికేమీ ఇవ్వలేదు. డబ్బులివ్వాలి. చెక్కు రాయాలి. ఏమివ్వమంటావంటే నసుగుతున్నాడు' అని అన్నాడు. 'ఏమిటయ్యా, నువ్వు పనిచేసిన వాడివి డబ్బులు తీసుకోకపోతే ఎట్లా? బాగా నటించి మాకు మేలు చేస్తున్నావు. దానికి తోడు డబ్బులు కూడా తీసుకోవాలి కదా' అని కృష్ణం రాజుగారు అందుకున్నారు.

ఇంక తటపటాయిస్తే బావుండదని, ఏద యితే అదవుతుందని 'అదిగాదండీ ఏం తీసు కోవాలి? ఎంత తీసుకోవాలి? ఏ వేషానికి ఎంత చెప్పాలి? నాకేం అర్థం కావట్లేదు. పెద్దవారు కదా



మీరు. సీనియర్ ఆర్టిస్టు. పెద్ద పేరున్నవారు. మీ నోటితో చెప్పండి. ఇదిగో ఇన్ని రోజులు పని చేశావ్. ఇంత తీసుకో అని చెప్పండి. ఇక అది స్టాండర్డ్‌గా తీసుకుని, అందరికీ దాని ప్రకారమే చెబుతా' అన్నాను. మరి ఆయన ఏ గుణాన ఉన్నాడో ఏమో తెలియదు కానీ "రూ. 20 వేలు తీసుకోవయ్యా. 12 నుంచి 15 రోజుల మధ్య అయిందంటున్నావు కదా? అయినా ఇది పేమెంట్‌గా అనుకోవద్దు. ఆర్టిస్టుగా నువ్వంటే ముచ్చట పడ్డాం, చాలా బాగా చేశావని. మిగిలిన చోటయితే ఖాయంగా రూ.15 వేలు తీసుకోవచ్చు అని అన్నారు. ఇక అప్పటి నుంచి సినిమాకు 10 రోజులు డేట్లిస్తే రూ.15 వేలు తీసుకోవడం మొదలుపెట్టా. డేట్లు పెరిగినా, తగ్గినా దానికి తగ్గట్టు ఈ 15 వేలను అటూ ఇటూ మారుస్తుండేవాడిని. అదీ లెక్క. ఇక అక్కడి నుంచి నా మేనేజర్ ఈ వ్యవహారాన్నంతా చూసుకునేవాడు.

**అసలే ఇండస్ట్రీకి కొత్త! డేట్లు, కాల్షీట్లు ఎలా ఇవ్వాలి? ఎంత రెమ్యునరేషన్ తీసుకోవాలి? ఇలా అన్నీ ప్రశ్నలే! దాసరి గారి వల్ల ఆ సమస్య తీరింది. ప్రతిఘటన విజయంతో అవకాశాలు వెతుక్కుంటూ రాసాగాయి. అలాగే ఉషాకిరణ్ సంస్థ మధుసూదనరావు గారి దర్శకత్వంలో నిర్మించే చిత్రంలో అవకాశం వచ్చింది. అయితే షూటింగ్ స్పాట్‌కి వెళ్ళిన కోటగారిని దెప్పుతూ వేషం లేదు పొమ్మన్నారు మధుసూదనరావుగారు. ఆయన ఎందుకలా అన్నారు? కోటగారు చేసిన తప్పేమిటి?**

## లెక్కలు చూసే తీరిక లేదు

ఆర్టిస్టుకి టైమ్ వస్తే టైమ్ ఉండదండీ, పని చేస్తూ వెళ్లడం తప్ప! చేస్తున్న పనికి ఎంత డబ్బు వస్తోంది? సకాలంలో అందుతోందా? లేదా? ఎవరిచ్చారు? ఎవరు ఎగ్గొట్టారు? ఎక్కడెక్కడ ఎంతెంత రావాలి? ఇలాంటి లెక్కలు వేసుకోవడానికి అస్సలు తీరికే ఉండేది కాదు. పక్కనున్న మేనేజర్ ఏం చెప్తే అంతే. ఎప్పుడో ఏ అర్ధరాత్రో, తెల్లవారుజామునో ఏదైనా లెక్క గుర్తొచ్చి, అలా జ్ఞాపకం వచ్చిన విషయం మరలా ఆ నిర్మాతలు ఎదురుపడ్డప్పుడు సమయానికి తడితే 'ఏవండీ మన సినిమా డబ్బులు' అని అడిగే పరిస్థితులు ఉంటేనే అనేవాడిని. 'అదేంటండీ అప్పుడే ఇచ్చేశాం కదా' అని అనేవారు. మన దగ్గర పని చేసేవారు మన దగ్గరే తింటారు. తినాలి కూడా. మనం ఒకరిని ఉద్యోగంలో పెట్టుకున్నామంటే వాళ్లకి కూడా కలిపి మనం సంపాదిస్తున్నామనే అర్థం. కానీ నా పక్కనున్నతను నన్ను ఆడుకుంటున్నాడనే విషయం నాకు బోధపడటానికి కాసింత సమయం పట్టింది. బ్యాంకులో క్యాష్ డీల్ చేసిన నేనే మేకప్, నటనలో బిజీ అయి ఇలా అయ్యానంటే మిగిలిన నటీనటుల పరిస్థితి ఏంటి? అని అనిపించింది? అతని వల్ల నేను ఇబ్బందుల్లో పడుతున్నాననే విషయం అర్థమై అతన్ని కొంచెం దూరం పెట్టా. ఆ తర్వాత్తర్వాత నేనే కొన్నాళ్లు డేట్లు చూసుకున్నా.

## తొలిసారి భయపడ్డాను

'ప్రతిఘటన' రిలీజ్ అయిన తర్వాత రామోజీరావుగారికి వాళ్లకి కాస్త అర్థమైనట్టుంది... 'వీడు కొంచెం నిలబడే ఆర్టిస్టు' అని. ఆ తర్వాత వాళ్ల 'మల్లె మొగ్గలు'లో అవకాశమిచ్చారు. వి.మధుసూదనరావుగారి దర్శకత్వంలో ఉషా కిరణ్ మూవీస్ తీసిన చిత్రమది. వి. మధుసూదన్‌రావుగారు చాలా సీనియర్ దర్శకుడు. అందుకే ఆయనంటే భయభక్తులతో ఉండేవాళ్లం. ఆయనకు కోపం ఎక్కువ. చాలా దడదడలాడించేవారు. ఆ సినిమాకు నవకాంత్‌గారు కెమెరామేన్‌గా పనిచేశారు. సాగరిక హీరోయిన్. రాజేశ్ అనీ శ్రీలక్ష్మి సోదరుడు హీరో. అన్నపూర్ణగారు హీరోయిన్ మదర్‌గా చేశారు. ఆ కుర్రాడు ఇప్పుడు లేడనుకోండి. కాలం చేశాడు. చెప్పొచ్చేదేమిటంటే... ఆ సినిమాలో నాకు వేషం ఇచ్చారు. కబురు చేస్తే రాజమండ్రికి వెళ్లా. మూడు, నాలుగు రోజులు యాక్ట్ చేశా. ఒకరోజు ఎయిర్‌పోర్టు దగ్గర షూటింగ్. హోటల్లోనే మేకప్ చేసుకున్నా. కారులో అక్కడికి తీసుకెళ్లారు. ఉదయం ఏడుకో, ఎనిమిదికో కాల్షీట్ వేశారు. నేనొక 15 నిమిషాలు ఆలస్యంగా వెళ్లా. నాకు ఇప్పటికీ బాగా గుర్తు. అందులో నా తప్పేం లేదు. నన్ను తీసుకెళ్లడానికి కారు రాకనో, ఏదో... మొత్తానికి ఆలస్యం జరిగింది. నేను లొకేషన్‌కి వెళ్లేసరికి విక్టరీ మధుసూదన్‌రావుగారు దూరంగా ఒక్కరే కూర్చుని ఉన్నారు. ఆలస్యం ఎవరి వల్ల జరిగిందన్నది కాదు.. నేను లొకేషన్‌లోకి ఆలస్యంగా అడుగుపెట్టానా? లేదా? అన్నది అక్కడ నన్ను చుట్టుముట్టిన సమస్య. దాని తీవ్రత నాకు బాగా అర్థమైంది. చొక్కా సర్దుకుంటూ వెళ్లి 'నమస్కారం సార్' అని డైరెక్టర్‌గారికి విష్ చేశా. అంతే నావైపు కాసేపు తేరిపార చూశారు. అప్పుడు నాకు సినిమా పరిశ్రమ అంతా కొత్త కదా. ఎలా రియాక్ట్ అవుతారో, ఏమోనని దడ మొదలైంది. 'రండి రండి! మీరు పెద్దవారు. మహానటులు. అరగంట నుంచి ఇక్కడే కూర్చుని ఉన్నాం. మీరు ఎప్పుడొస్తే అప్పుడే షూటింగ్ పెట్టుకుంటాం. తమరి దయ' అని అన్నారు. అంతే నాకు గుండెల్లో రైళ్లు పరిగెట్టడం మొదలెట్టాయి. 'రెడీ అయ్యే ఉన్నానండీ. నాకు కారు రావడానికి కాస్త లేటయింది. అంతేగానీ కావాలని చేసిన ఆలస్యం కాదండీ' అన్నా. నేను చెప్పి ముగించేలోపే అందుకుని 'ఎవరైతే ఏంటిలెండీ. పెద్ద ఆర్టిస్టు మీరు. బ్యాంకులో పనిచేశారు' అని ఇలాగ నన్ను దెప్పడం మొదలుపెట్టారు. నాకేమో కళ్లమ్మట నీళ్లు వచ్చేశాయి. ఏంటి ఇలా అంటున్నారీయన.. అనే ఫీలింగు మొదలైంది. ఎందుకంటే సినిమాల్లో చీవాట్లు పడి, కొట్టుకుని పైకి వచ్చినవాడిని కాదు నేను. ఏదో బ్యాంకులో పనిచేసుకుంటూ నాటకాల్లో పేరు తెచ్చుకుని, మొదటి సినిమా నుంచి కూడా గౌరవంగా ఉంటూ వచ్చినవాణ్ణి. ఈ రకంగా నన్ను అంతకుముందు ఎవరూ దెప్పలేదు. అందుకే నాకు మొత్తం కొత్తగా అనిపించింది. చుట్టూ ఉన్నవాళ్లు చూస్తున్నారన్న ఫీలింగ్ ఒకటి. అయినా 'నా తప్పేం లేదు సార్' అని చెప్పే ప్రయత్నం చేస్తున్నా. అక్కడ ప్రొడక్షన్ ఎగ్జిక్యూటివ్‌గా ఉండేవారు బాపినీడుగారని, ఆయనా... అక్కడ ప్రసాద్ అని ఇంకొకాయనా ఉన్నారు. వీళ్లిద్దరూ ప్రొడక్షన్ చూస్తుండేవారు. అప్పుడు 'ఏయ్ బాపినీడు.. ఇలా రావయ్యా' అని పిలిచారు మధుసూదన్‌రావుగారు. ఈయనంటే అందరికీ కొంచెం భయమే కదా. ఆయన ఒద్దిగ్గా వచ్చి 'ఏంటి సార్' అని అన్నారు. 'వీడికి పెట్టిన విగ్గు తీసి పంపించెయ్. వీడికి వేషం వద్దు. పంపించెయ్' అని అరిచారు. 'అదేంటి సార్? నేనేం చేశాను? నా కెరీర్ దెబ్బతింటుంది? పెద్ద సంస్థ. దాంట్లో నాకు వేషం పెట్టి నాలుగు రోజులు నేను చేసిన తర్వాత ఇప్పుడు తీసేస్తే నా కెరీర్ పాడైపోతుంది. ఏమనుకోవద్దు. క్షమించండి సార్. ఇంకెప్పుడూ ఇలా ఆలస్యంగా రాను. ఇప్పుడు కూడా నేనుగా చేసిన ఆలస్యం కాదిది. నా కెరీర్ గురించి ఒక్క క్షణం ఆలోచించండి. దయ తలచండి' అని ఏడుస్తూ అంటున్నా. కానీ ఆయన వినిపించుకోలేదు. కాసేపు అయ్యాక 'ఏడ్చింది చాలు కానీ కళ్లు తుడుచుకో' అన్నారు. ఆ తర్వాత ఆయన నాతో ఏం చెప్పారు? ఇంతకీ మధుసూదన్‌రావుగారు అలా ప్రవర్తించడానికి అసలు కారణం ఏంటి? నాతో పాటు చుట్టూ చూస్తున్న వారికి తెలిసిన నిజం ఏంటి? వంటి విషయాలు వచ్చే వారం చెబుతాను.



**(ఇంకావుంది)**

**-డా.చల్లా భాగ్యలక్ష్మి**
**సెల్: 88850 55528**

# వెట్టి
## (ది వారియర్)
### -మధుబాబు




**అంత గొడవ జరుగుతున్న సమయంలోగాని, జరిగిపోయిన తర్వాతగాని, నోరు తెరిచి చిన్నపాటి శబ్దం కూడా చేయలేదు వెట్టి. కాని అతని కసి మాత్రం తీరలేదు.**

**దెబ్బల్ని తట్టుకోలేక పారిపోయిన వాళ్ళు పారిపోగా, మోకాలి ఎముక విరిగిన మనిషి ఒక్కడే మిగిలిపోయాడు అక్కడ. అతను కూడా విపరీతమైన భయంతో కంపించిపోతున్నాడు. విరిగి పోయిన కాలు ఈడ్చుకుంటూ, దూరంగా పాక్కుంటూ వెళ్ళిపోయే ప్రయత్నం చేస్తున్నాడు.**

దగ్గరికి పోయి రెండో కాలును కూడా విరిచే యాలన్నంత కచ్చను అతి బలవంతంగా అదుముకుంటూ చుట్టూ చూశాడు వెట్టి.

ట్యూబ్‌లైటు పగిలిపోవటం వల్ల కటికచీకటి. ఎటుచూసినా ఏవీ సరిగ్గా కనిపించటం లేదు. ఒక అడుగు వెనక్కి వేసేసరికి, అతని కాలు వెనుక భాగానికి తగిలింది అంతకుముందు తను కూర్చున్న నాపరాయి. రెండో ఆలోచన లేకుండా దాని అంచులు పట్టుకుని బలంగా పైకిలేపాడు అతను.

పర్మినెంటుగా నిర్మించబడినది కాకపోవటం వల్ల, తేలికగానే పైకిలేచింది అది. పెద్దపెద్ద అడుగులు వేస్తూ, రోడ్డు మీద ఆగి ఉన్న దృఢకాయుల కారు దగ్గరికి పోయాడతను.

ఫెడీఫెడీమని కొట్టాడు. ముక్కలు ముక్కలై పోయాయి తలుపుకున్న అద్దాలు... సొట్టలుపడి దానంతటదే పైకి లేచింది ముందుభాగం. వెనకా ముందూ చూసుకోలేదతను. నాపరాయిని ఇంజన్ భాగాలకేసి గురిపెట్టి దబదబా మోదాడు.

పదే పది క్షణాల్లో సర్వనాశనం అయిపోయాయి అవి. అప్పటికీ ఆవేశం తగ్గకపోవటంతో, డ్రైవింగ్ సీటు దగ్గర తలుపును తెరిచి, స్టీరింగ్‌వీల్‌ని కూడా నాశనం చేసేశాడు. గేర్ మెకానిజమ్‌ని కూడా పాడుచేసిన తర్వాత సద్దుమణిగింది అతని ఆవేశం. చేతుల్లోనే ఉండిపోయిన నాపరాయిని కార్లోకే విసిరికొట్టి, చేతులు దులుపుకుంటూ వెనక్కి బయలుదేరాడు.

హాస్పిటల్ ముందున్న సెక్యూరిటీగార్డు తొంగి తొంగి చూస్తున్నాడు, మెయిన్‌గేటు మీది నుంచి.

రెండో కంటివాడికి తెలియకుండా హాస్పిటల్‌లోకి వెళ్ళిపోదామని అనుకుంటున్న తన ఆలోచన చాలా దారుణంగా దెబ్బతినిపోయిందని వెంటనే అర్థం అయిపోయింది వెట్టికి.

దుకాణం ముందు జరిగింది ఏమిటో క్లియర్‌గా కనిపించక పోయినా, దృఢకాయుల మాటలో, మూలుగులో తప్పకుండా వినవచ్చి ఉంటాయి. నాపరాయితో కారును నాశనం చేసినప్పుడు వెలువడిన శబ్దాలు చాలా క్లియర్‌గా అతని చెవులకు చేరి ఉంటాయి.

అన్నిటికంటే అతి ముఖ్యమైన పాయింటు - అటునుంచే వస్తున్నాడు తను. అక్కడ జరిగింది ఏమిటో తనకు తప్పకుండా తెలిసే ఉంటుందని, డెఫినెట్‌గా అనుకుని తీరతారు ఎవరైనా సరే.

మెయిన్‌గేటును సమీపించిన వెంటనే ఎదురయింది అతనికి, ఎదురుచూస్తున్న ప్రశ్న.

'ఏంటీ ఆ గోల? ఏమైంది అక్కడ?' అడగనే అడిగాడు గార్డు.

'అర్థం కాలేదు. ఎవరో వాళ్ళలోవాళ్ళు గొడవపడి రెండు తోపులు తోసుకున్నారు. లైటు లేదు. సరిగ్గా కనిపించలా' తొణుకూ బెణుకూ లేకుండా చెప్పాడు వెట్టి.

'చాలాసేపు అక్కడే ఉన్నావుగా.. కనిపించక పోవటం ఏమిటి?' లా పాయింట్ లేవదీశాడు గార్డు.

పిడికిలితో అతని ముక్కు మొఖానికి అతుక్కుపోయే విధంగా లాగిపెట్టి కొట్టాలన్న కోరికను అతి ప్రయత్నం మీద అదుముకున్నాడు వెట్టి.

జరగవలసిన డ్యామేజి జరిగిపోయింది. తగాదా విషయం తన చెవికి చేరగానే... అరితేరిన డిటెక్టివ్ మాదిరి ఎనలైజేషన్ మొదలుపెడతాడు బాజిరెడ్డి. సూటిగా వచ్చి సెక్యూరిటీ గార్డునే మాట్లాడిస్తాడు. ఆ గొడవ జరిగిన సమయంలో తను హాస్పిటల్‌లో నుంచి రోడ్డుమీదికి పోయిన సంగతి తెలియగానే అగ్గిరాముడి మాదిరి తన మీదికి విజృంభిస్తాడు.

విపరీతమైన టెన్షన్‌తో మొఖం ముడుచుకుపోవాల్సిన అంశం అది. చిన్నపాటి చిలక నవ్వు ఒకటి అతని ప్రయత్నం లేకుండానే ప్రత్యక్షం అయింది పెదవుల మీద.



### జరిగిన కథ

*గూండాల నుంచి తప్పించుకు తిరుగుతూ ఉంటాడు వెట్టి. ఫ్లాష్‌బ్యాక్‌లో అతడు ఇంజనీరింగ్ ఫైనల్ ఇయర్ స్టూడెంట్. అసలు పేరు విఠల్‌రెడ్డి. అన్యాయాన్ని ఎదిరించిన పాపానికి బాజిరెడ్డి గూండా ముఠా అతడిపై కక్ష కడుతుంది. అడుగడుగునా తప్పించుకుంటూ ఎప్పటికప్పుడు వారికి దేహశుద్ధి చేస్తూ ఉంటాడు విఠల్ రెడ్డి. కారణాంతరాలవల్ల వెట్టిగా మారతాడు. ఆ నేపథ్యంలో కదిరి ఎస్టేట్‌లో మళ్ళీ బాజిరెడ్డికి తారసపడిన వెట్టి అతడి పెత్తనాన్ని సవాలు చేస్తాడు. దాంతో వెట్టిని మట్టుపెట్టేందుకు బాజిరెడ్డి కొడుకు మాటు వేస్తాడు.* **ఆ తర్వాత....**

'ఏంటీ.. నీలో నువ్వే నవ్వుకుంటున్నావు?' ఆశ్చ ర్యంగా అడిగాడు గార్డు.

'ఎక్కడికీ కదలకుండా హాల్లో కూర్చోమని చెప్పింది శివారెడ్డి సారు భార్య. నువ్వు చెప్పేదే మిటి నేను వినేదేమిటి అనుకుంటూ రోడ్డుమీదకి పోయాను. ఇప్పుడు ఈ గోల ఒకటి వచ్చి నా నెత్తి మీద కూర్చోబోతున్నది. సాక్షాలు గీక్షాలు అంటూ నామీద పడి ఏడుస్తారేమోననిపించి నవ్వు వచ్చింది" అన్నాడు.

'ఏదీ సరిగ్గా కనిపించలేదంటున్నావుగా.. పైగా కటిక చీకటి. నీ జోలికి ఎవడూ రాడు. పోయి హాల్లోనే కూర్చో. ఇంకోసారి బయటికి రాకు' అన్నాడు గార్డు.

ఆ మాటలు బాజిరెడ్డికి చెపితే ఎలా రియాక్ట్ అవుతాడో ఊహించుకుంటూ లోపలికి పోయాడు వెట్టి.

నిద్ర ఆపుకోవటం చేతకాలేదు కాబోలు - కుర్చీ వెనుక భాగానికి తల వాల్చి సన్నగా గురక పెడుతున్నాడు శంకరయ్య.

పక్కనే ఉన్న కుర్చీలో కూర్చున్నాడు వెట్టి. కూర్చున్న రెండో నిమిషంలో అతివేగంగా వచ్చే సింది నిద్ర.

'విఠల్‌బాబూ... విఠల్‌బాబూ... నిన్నే..' భుజం తడుతూ, చిన్నగా ప్రత్యూష పిలిచేసరికి ఒక్క సారిగా వచ్చేసింది మెలకువ.

'ఇప్పుడు టైము ఎంతైందో తెలుసా?' నవ్వుతూ అడిగింది ఆమె.

హాలు ముందు భాగంలోని కిటికీల ద్వారా లోపలికి వస్తున్న వెలుగును బట్టి అంచనా వేశాడు అతను. 'అప్పుడే ఎనిమిదయిందా? నేను పడుకుని పది నిమిషాలు కూడా కాలేదు' అంటూ లేచి నిలబడ్డాడు. అంతలోనే అసలు తాము అక్కడ ఎందుకు ఉండవలసి వచ్చిందో గుర్తుకు వచ్చి ఒళ్ళు జలదరించింది ఒక్కసారిగా.

'శివారెడ్డి సారుకు ఎలా ఉంది?' అడిగాడు గబగబా.

ప్రత్యూష సమాధానం చెప్పకముందే, పెద్ద పెద్ద అడుగులు వేస్తూ వచ్చింది ఫ్రెష్‌గా డ్యూటీలో జాయిన్ అయిన ఒక నర్సు.

'వెట్టి అంటే ఎవరు?' ఆరడుగుల దూరంలో నిలబడి అందరివైపు కలియచూస్తూ అడిగింది.

ఒక అడుగు ముందుకు వేసి, తనను తానే చూపించాడు వెట్టి.

'డాక్టరు గారు పిలుస్తున్నారు. త్వరగా రా' ఆర్డర్‌ని వినిపించి వెనక్కి వెళ్ళిపోయిందామె.




మరోసారి జలదరించింది వెట్టి ఒళ్ళు. పరుగు లాంటి నడకతో ఐసియు దగ్గరికి పోయాడు.

'కమాన్ యంగ్‌మాన్... శివారెడ్డి నీ కోసమే ఎదురు చూస్తున్నాడు' అప్పుడే లోపలినుంచి బయటికి వస్తున్న డాక్టర్ మధ్యలోనే ఆగిపోయి చెప్పాడు అతనికి.

'సారు ఆల్‌రైట్ కదా..' అప్పటికీ అనుమానం తీరకపోవటంతో అడిగాడు అతను.

తెల్లటి పల్వరుస బయటికి కనిపించేలా పెద్దగా నవ్వాడు డాక్టరు. 'హీ ఈజ్ క్వయిట్ ఆల్ రైట్! నీకు ఇంకో విషయం చెపుతాను. మనసులోనే పెట్టుకో. ఎవరికీ చెప్పబోకు. ఇంకాస్త టైము పడుతుంది, నేను ఎనౌన్స్ చేయటానికి' చిన్న కంఠంతో చెప్పాడు, భుజం మీద చెయ్యివేసి మరీ.

ప్రత్యూష వచ్చి తనవెనకే నిలబడటం గమ నించి కూడా గమనించనట్లే, 'ఏమిటి సార్ అది?' అని అడిగాడు వెట్టి కుతూహలంగా.

'రాత్రి వచ్చిన స్ట్రోక్ అప్పుడే మాయమై పోయింది. దాన్ని గురించిన వర్రీ ఇకలేదు. ఇప్పుడు తెల్లవారగానే నేను గమనించిన విశేషం ఏమిటంటే-' అంటూ మాటను ఆపాడు డాక్టరు.

అధికతరం అయిపోయింది వెట్టి కుతూహలం. తన వెనుక నిలబడిన ప్రత్యూష ఆల్‌మోస్ట్ తన భుజం మీద మొఖం పెట్టి మరీ వినటానికి ట్రై చేస్తున్న సంగతి కూడా అతను పట్టించుకోలేదు.

'డ్యామేజ్ అయిపోయాయని నేను, మా స్పెష లిస్టులు అందరూ కన్‌ఫర్మ్ చేసుకున్న శివారెడ్డి సారు కిడ్నీల్లో ఎడమ పక్కది నార్మల్‌గా తనపని తను మొదలుపెట్టిన సూచన కనిపిస్తోంది' ఉత్సా హంగా మాట పూర్తిచేశాడు డాక్టరు.

'ఎలా? ఎలా జరిగింది? ఏ విధంగా?' ఆయన సంతోషం తనను కూడా చుట్టుముడుతుండగా అడిగాడు వెట్టి.

'ఈ సూచన ఇంకా ప్రైమరీ స్టేజ్‌లోనే ఉంది. అబ్జర్వ్ చేయాలి. ఇంకో రెండు మూడు రోజులు చూడాలి. అందుకే నిన్ను హెచ్చరించటం' అన్నాడు డాక్టరు.

"థాంక్యూ... థాంక్యూ వెరీమచ్ సారూ.. నిజంగా చాలా చల్లటిమాట చెప్పారు' అంటూ వెనక్కి చూశాడు వెట్టి.

వెచ్చటి తన ఊపిరి అతని మెడకు, బుగ్గ లకు తగిలేంత దగ్గరగా నిలబడి ఉండవలసిన ప్రత్యూష పరుగుపందెంలో పాల్గొంటున్నట్లు పరిగెత్తుతూ ఉండడం కనిపించింది.

'ప్రత్యూషా... ఆగు. ఆగు' బిగ్గరగా పిలిచాడు.

ఆగలేదామె. అసలు ఆ మాటలు తాను విని పించుకోలేదు.

'సారీ డాక్టరు గారూ... ఎస్టేట్ మొత్తం పాకి పోతుంది, ఇప్పుడు మీరు ఎవరికీ చెప్పొద్దని హెచ్చ రించిన మాట.." డాక్టరుగారి వైపు తిరుగుతూ చిన్నగా అన్నాడు.

'ఇట్సాల్‌రైట్! ఆ పిల్ల అంత ఎగ్జయిట్ అవు తుందని నేను ఊహించలేదు. మంచిమాటే కాబట్టి భయపడవలసిన అవసరం లేదు. నువ్వు మాత్రం ఎవరికీ చెప్పకు..' అన్నాడు డాక్టరు.

'నేను చెప్పినా ఒకటే.. చెప్పకపోయినా ఒకటే. నిన్నకాక మొన్న వచ్చినవాడిని. నా మాటలకు పెద్ద విలువ ఉండదు. అవతల ఉన్న పిల్ల మోస్ట్ పవర్‌ఫుల్. శివారెడ్డి సారు చెల్లెలికి పర్సనల్ సెక్రటరీ...' నవ్వుతూ చెప్పాడు వెట్టి.

'సో వాట్? నీ గురించి నువ్వు కూడా ఇంకా సరిగ్గా తెలుసుకోలేదు. జస్ట్ ఒకసారి లోపలికి తొంగిచూసి, శివారెడ్డి సారుకు చెయ్యి ఊపు. నీకే తెలుస్తుంది' అన్నాడు డాక్టర్ ముసిముసిగా నవ్వుతూ.

తెల్లబోయాడు వెట్టి. 'అదేంటి డాక్టరుగారు. ఏం జరుగుతుంది?' అని అడిగాడు.

బెడ్ మీదినించి లేచి తనంతట తాను బయటికి వచ్చే ప్రయత్నం చేయటమో, నిన్నే లోపలికి రమ్మని పిలవడమో ఏదో ఒకటి వెంటనే జరుగుతుంది. రాత్రి ఇన్సిడెంట్‌తో శివారెడ్డి సారుకు నువ్వంటే పిచ్చి నమ్మకం కలిగేసింది' అంటూ అర్జంటు పని ఏదో గుర్తుకు వచ్చినట్లు హడావిడిగా అవతలికి వెళ్ళిపోయాడు డాక్టరుగారు.

ఆయన చెప్పినట్లు అద్దాల కిటికీ దగ్గరికిపోయి చెయ్యి ఊపి చూడాలని అనిపించినా, తెగించి ముందుకు అడుగు వేయలేక పోయాడు వెట్టి.

పనివాడి మాదిరిగా వచ్చాడు తను అక్కడికి. పనివాడి మాదిరిగానే ఉండాలి. లేనిపోని అభిమానాలు, అనుబంధాలు పెంచుకుంటూపోతే, తన జీవితలక్ష్యం నెరవేరదు. అడ్డంకులు ఏర్పడతాయి.

తాము టెంపరరీగా మకాం పెట్టిన గది దగ్గర నుంచి ప్రణవి పరిగెత్తుకు రావటం కనిపించేసరికి సడన్‌గా ఆగిపోయాయి అతని ఆలోచనలు.

'నిజమేనా విఠల్‌బాబూ! ప్రత్యూష చెపుతున్నది నిజమేనా?' కలువపువ్వు మాదిరి విప్పారిన మొఖంతో అడిగింది ఆమె, దగ్గరికి రాగానే అతని చేతులు గట్టిగా పట్టుకుని.

ఆమెతో పాటు వెనక వచ్చేసిన ప్రత్యూష వైపు చిరుకోపంగా చూశాడు అతను.

'నువ్వు నన్ను ఎంత తిట్టుకున్నా ఐ డోన్ట్‌కేర్. పండగ చేసుకోవాల్సిన మాట ఇది. ప్రణవికి చెప్పకుండా ఎలా ఉండగలను?' అతను నోరు విప్పకముందే దురుసుగా అడిగింది ఆమె.

'చెప్పు... ముందు నాకు వివరంగా చెప్పు, నిజమేనా?' అతని చేతుల్ని గట్టిగా ఊపుతూ మళ్ళీ అడిగింది ప్రణవి.

'ముందు నన్ను ఆ పేరుపెట్టి పిలవటం ఆపేయ్. బాజిరెడ్డి చెవుల్లో పడిందంటే...' అంటూ మాటల్ని ఆపాడు వెట్టి. విజిటర్స్ హాలు దగ్గర్నించి శంకరయ్య కూడా పరిగెడుతున్నట్లు వస్తూ ఉండటమే అందుకు కారణం.

'మీ నాన్నకి కూడా చెప్పేశావా?' ప్రత్యూషని అడిగాడు వెట్టి.

'నేనేమీ ఛాటర్‌బాక్స్ కాదు' అంటూ తండ్రి తమదగ్గరకి వచ్చేసరికి మౌనంగా ఉండి పోయింది ఆమె.

**హాస్పిటల్ వెలుపల బాజిరెడ్డి మనుషులందరినీ తుక్కు తుక్కు కింద చితకబాదాడు వెట్టి. ఏమీ ఎరగనట్టు హాస్పిటల్‌లోకి తిరిగి ప్రవేశించాడు. తెల్లారిన తర్వాత డాక్టరుగారు వచ్చి శుభవార్త చెప్పారు వెట్టికి. పాడైపోయిందనుకున్న శివారెడ్డి కిడ్నీ తిరిగి సక్రమంగా పనిచేయడం ప్రారంభించింది. అందరి మొహాల్లో ఆనందం తాండవిస్తోంది. కానీ బాజిరెడ్డి మాత్రం పగతో రగిలిపోతున్నాడు.**

'ఇదిగో విఠల్‌బాబూ... ఇది విన్నావా?' ఎగ్జయిట్ అయిపోతున్నట్టు హడావిడిగా అడిగాడు శంకరయ్య.

'ముందు దయచేసి నన్ను ఆ పేరుతో పిలవకండి, ప్లీజ్' అని వెట్టి గట్టిగా రిక్వెస్ట్ చేయక ముందే, 'రాత్రి రోడ్డుమీద ఉన్న చిల్లరకొట్టు దగ్గర పెద్ద గొడవ జరిగిందట. ఒక కారును తుక్కు తుక్కు కింద కొట్టేశారట. ఒక మనిషి కాలు విరిచేశారట. అటుగా తీసుకు వస్తున్నారు చూడు' అంటూ ఎంట్రన్స్ వైపు చూపించాడు.

స్ట్రెచర్ మీద పడుకోబెట్టి తీసుకువస్తున్న మనిషిని చూడగానే, అర్జంటుగా అవతలికి వెళ్ళిపోవాలన్న కోరిక వెట్టికి కలిగింది.

తను చేసిన ఘనకార్యమే అది. ముక్కుపగిలిన మనిషి, గుండెలు గాయపడినవాడు అందరూ గుంపుగా వచ్చేస్తున్నారు. వారందరి వెనుకే మొఖం ముటముటలాడించుకుంటూ అడుగులు వేస్తున్నాడు బాజిరెడ్డి.

•••

'వదిలిపెట్టేది లేదు.. నా మనుషుల్ని చితకబాది పారిపోయిన వాడిని పొరపాటున కూడా వదిలిపెట్టను' పేషంట్స్‌ని డాక్టర్ గారికి హ్యాండోవర్ చేస్తూ ప్రతిజ్ఞ చేశాడు బాజిరెడ్డి.

'దుక్కల్లా ఉన్నారు. దున్నపోతుల కంటే బలంగా కనిపిస్తున్నారు. ఇంతమందిని కొట్టి పడేయటం ఒక్కడివల్ల సాధ్యపడుతుందా?' ఆశ్చర్యంగా అడిగారు డాక్టరుగారు.

'నా అనుమానాలు నాకున్నాయి. సాయంత్రం లోపు నేను తేల్చుకుంటాను' కనుచివరల నుంచి వెట్టి వైపు చూస్తూ అన్నాడు బాజిరెడ్డి.

'ఏమిటిసారూ నువ్వు తేల్చేది?' అని అడగాలన్న కోరికను అతి బలవంతంగా అదుముకున్నాడు వెట్టి. ఆ సమయంలో అక్కడ మాటలు పెంచుకోవటం మంచిది కాదనిపించింది అతనికి. అది ఒక కారణమే. రెండో కారణం అప్పటి వరకూ ఎంతో ప్లెజెంట్‌గా ఉన్న ప్రణవి, ప్రత్యూషల మొహాలు కోపంతో ఎర్రగా మారిపోవటమే.

'కొట్టినవాళ్ళు ఎవరో తీరుబడిగా వెతికి పట్టుకోవచ్చు. ముందు వాళ్ళకి వైద్యం చేయించండి. పాపం దెబ్బలు చాలా బలంగా తగిలినట్లున్నాయి' సూటిగా చెప్పింది ప్రణవి.

'నిజమే తల్లీ. ఒకళ్ళేగనక వచ్చి ఉన్నట్లయితే ఇరగదీసి మడతపెట్టేసి ఉండేవాళ్ళం. కనీసం నలుగురైనా మా మీద కలబడి ఉంటారు. కటిక చీకట్లో సరిగా కనిపించలేదు. తిరిగి చూసేసరికి మా కారును కూడా నాశనం చేసి పారిపోయారు' గుండెలకు దెబ్బతగిలిన మనిషి వెంటనే అన్నాడు.

'నోరుముయ్యరా... నోరు మూసేయ్.. చేతకాని చవటలు మీరు అందరూ.. దున్నపోతులు' రంకె పెట్టాడు బాజిరెడ్డి.

వెట్టి చేతిని గట్టిగా పట్టుకుంది ప్రణవి. 'నువ్వురా. నీతో చాలా పని ఉంది' అంటూ తాము మకాం పెట్టిన గదివైపు లాక్కుపోయింది.

బాజిరెడ్డికి బ్లడ్‌ప్రెజర్ పెరిగి గుండెనొప్పి వచ్చేస్తుందేమోనన్న అనుమానం కలిగింది వెట్టికి, అతని మొఖంలో ప్రత్యక్షం అయిన భావాలను చూడగానే.

'ప్రణవమ్మ! నువ్వు కొంచెం నిదానించు. ఆ పెద్దమనిషి గుండెల్లో ఎటువంటి మాట దాక్కుని ఉన్నదో తెలుసుకోవటం చాలా ముఖ్యం' అంటూ ప్రొటెస్ట్ చేయబోయాడు వెట్టి.

ఫలించలేదు ఆ ప్రయత్నం. నిర్మొహమాటంగా లాక్కుపోయి తమ గదిలో ఉన్న గోడకేసి నెట్టింది ఆమె. 'నీకు మామూలు మాటలతో చెపితే ఏమీ అర్థం కాదని మాకు తెలిసిపోయింది. చిన్నపిల్లాడివి కాదు చెవి మెలివేసి చెప్పటానికి. వద్దు వద్దన్నకొద్దీ ఆ దుర్మార్గుడి జోలికి ఎందుకు పోతున్నావ్?' చాలా కఠినమైన కంఠంతో అడిగింది.

'కూల్... కూల్ ప్రణవీ. తొందరపడకు' అంటూ ఆమెను శాంతపరచటానికి ట్రై చేసింది ప్రత్యూష.

'నువ్వు కాసేపు నోరు మూసుకుంటావా?' ఆమెమీద కూడా ఇంతెత్తున లేచి విరుచుకు పడింది ప్రణవి.

నిజంగానే ఎడమచేత్తో నోటిని అదుముకుని



ఒక అడుగు వెనక్కి వేసిందామె.

'చెప్పు. రాత్రి చిల్లరకొట్టు దగ్గర ఏం జరిగింది? వివరంగా చెప్పు' మళ్ళీ వెట్టివైపు తిరుగుతూ కమాండ్ చేసింది ప్రణవి.

దాచుకోలేదు వెట్టి. సెక్యూరిటీగార్డును శివారెడ్డి పేరుచెప్పి హడలకొట్టి ఆ దుకాణం దగ్గరికి పోయిన దగ్గర్నించీ, తిరిగి లోపలికి వచ్చేంత వరకూ జరిగినదంతా వివరంగా చెప్పేశాడు. అయితే పాము కనిపించటాన్ని మాత్రం ఒమిట్ చేసేశాడు. చెప్పకూడదని కాదు అతని భావం. తనకే సరిగ్గా అర్థంకాని సన్నివేశం అది. ఆమెకు అస్సలు అంతుబట్టదు సరికదా కన్ఫ్యూజ్ అయిపోతుంది. వాడు డైరెక్ట్‌గా చేయగలిగింది ఏమీలేదు. మహా అయితే రాత్రి పన్నిన కుట్ర ఇంకోసారి పన్నుతాడు..' అన్నది.

'పఠాన్ గనుక డైరెక్ట్‌గా నా ఎదుటికి వస్తే నిగ్రహించుకోవటం చాలా కష్టం అయిపోతుంది తల్లీ. ఏదో ఒకటి చేసేయటం జరుగుతుంది. ఫైనలియర్ చదువు అయిపోయి ఈపాటికి ఏ అమెరికాలోనో, ఆస్ట్రేలియాలోనో, ఆ రెండూ కాక పోతే కెనడాలో ఉండవలసిన వాడిని..' సడన్‌గా తన మొహం ఎర్రబడి పోతుండగా, పళ్ళు బిగించి చెప్పాడు వెట్టి.

భుజాన్ని పట్టుకుని బలంగా అదిమింది ప్రణవి. అమ్మ ఇంటికి తిరిగి వచ్చింది. ఇప్పుడు అన్నయ్యా... నిజంగా నిన్ను పై చదువులకు విదేశాలకు కాదు-చంద్రమండలానికో, అంగారకుడి మీదికో పంపించినా నీ రుణం తీరదు' కళ్ళల్లో నీళ్ళు గిర్రున తిరుగుతుండగా గద్గదంగా అన్నది.

'ఊరికే పొగిడి దేవుడిని చేసేయకు. నీ మాటల్ని అలుసుగా తీసుకుని ఇప్పటికిప్పుడు పోయి ఆ దున్నపోతుల మీద కలబడగలడు..' గది గోడను ఆనుకుని నిలబడి ఉన్న ప్రత్యూష చిన్నగా హెచ్చరించింది.

'తమాయించుకున్నది ప్రణవి. తనను తాను కంట్రోల్ చేసుకున్నది. 'యూ డోన్ట్‌వర్రీ. నాకు

## అవకాశాలు అడుక్కుంటున్న ఇలియానా

గోవా బ్యూటీ ఇలియానా ఒకప్పుడు దక్షిణాదిలో యమ బిజీగా ఉండేది. అలాంటిది తనని ఇంతగా ఆదరించిన దక్షిణాదిని వదిలి ముంబాయి వెళ్ళిన తరువాత పూర్తిగా మరిచిపోయింది. ఒకరిద్దరు నిర్మాతలు అవకాశాలు ఇవ్వాలని చూసినా వారిని పట్టించుకోను కూడా పట్టించుకోలేదు. ఇప్పుడు సీను రివర్స్ అయింది. బాలీవుడ్‌లో ఇలియానాను పట్టించుకునే వారే లేరు. దాంతో దక్షిణాది వైపు దృష్టి పెట్టింది. తనకు తెలిసిన నిర్మాతలను అవకాశాల కోసం అడిగినా వాళ్ళు వినీ విననట్టు ఉండిపోతున్నారట! దక్షిణాదిన బోలెడంత మంది కుర్ర హీరోయిన్లు ఉండగా ముదురు భామ ఇలియానా ఎందుకు? అన్నవారూ లేకపోలేదు.



'చిమ్మచీకట్లో అరడజనుమంది దున్నపోతుల్ని బాజిరెడ్డికి మెంటల్ వచ్చే లెవెల్లో కుమ్మిపడేశావా? వాళ్ళ కారును చెత్తచెత్త చేసేశావా? ఏం మనిషివి నువ్వు? ఎటువంటిది నీ గుండె?' గుండెల మీద చెయ్యి వేసుకుంటూ మహా ఆశ్చర్యంతో కామెంట్ చేసింది ప్రణవి.

'అంతపెద్ద దొమ్మి జరిగినప్పుడు నీకేమైనా దెబ్బలు తగిలాయా?' నోటిమీది నుంచి చేయి తీసి, వెంటనే అడిగింది ప్రణవి.

'అటువంటిదేమీ జరగలేదు గాని, విషయం బాజిరెడ్డికి పూర్తిగా అర్థమైందో లేదో తెలియటం లేదు' అన్నాడు వెట్టి.

'కొట్టినవాడివి ఎలాగూ కొట్టావు. కొంచెం ముందుగానే ఆ పని మొదలుపెట్టి పఠాన్‌ని కూడా రెండు దెబ్బలు వేసి ఉన్నట్లయితే నాకు ఎంతో హ్యాపీగా ఉండి ఉండేది. కాబోయే భార్య ఇక్కడ ఉన్నదని అంటాడా? ఆ చప్పిమొఖం వాడు' సడన్‌గా కోపం తెచ్చుకుంటూ అన్నది ప్రణవి.

నవ్వాడు వెట్టి...

'వద్దు ప్రణవీ. నువ్వు ఆ మూర్ఖుడి పేరు ఎత్తద్దు' అంటూ వెంటనే ఆమెను కంట్రోల్ చేసింది ప్రత్యూష.

'నిజమే. వాడిపేరు ఒక్కటేకాదు, అసలు బాజిరెడ్డిని గురించి కూడా మనం తలుచుకోకూడదు. వాళ్ళ ప్రసక్తి వచ్చిన వెంటనే ఈ క్యూట్ బోయ్‌కి బి.పి. పెరిగిపోతోంది' నవ్వుతూ అన్నది ప్రణవి.

'నేను వెళ్ళి హాల్లో నిలబడి...' అంటూ మొదలు పెట్టిన వెట్టిని మధ్యలోనే ఆపి, సాదరంగా అతని చెక్కిలిమీద చెయ్యి వేసింది ఆమె.

'బాజిరెడ్డి సామాన్యుడు కాదు. సంగతులన్నీ తెలుసుకునే ఉంటాడు. ఆ పనిచేసింది నువ్వేనని ఫిక్స్ అయిపోయి ఉంటాడు. కాని ఇప్పటికిప్పుడు 'నాదీ బాధ్యత! ఇక్కడి ఈ గొడవలన్నీ కామ్ అయిపోగానే నేను పంపిస్తాను నిన్ను. ఖర్చు నాది. యూ డోన్ట్ వర్రీ! నువ్వు మాత్రం లేనిపోని రిస్కులు తీసుకోకు' ఆదరంగా చెప్పింది.

'అక్కడికెక్కడికో వద్దులే ప్రణవీ. చదువుకోవాలని ఉంటే ఇక్కడ బ్రహ్మాండమైన కాలేజీలు ఉన్నాయ్. ఉద్యోగం కూడా ఇక్కడే చేయవచ్చు. దూరంగా పోవటం దేనికి?' చటుక్కున మాట్లాడింది ప్రత్యూష.

వెట్టివైపే చూస్తున్న ప్రణవి గిరుక్కున తిరిగింది ఆమెకేసి. కారణం ఏమిటో తెలియదుగాని, ఎర్రగా మారిపోయింది ప్రత్యూష మొఖం. అలివి మాలిన సిగ్గుతో చటుక్కున వెనక్కి తిరిగి రెండు అంగల్లో గదిబైటికి వెళ్ళిపోయింది.

పకపకా నవ్వుతున్న ప్రణవివైపు ఆశ్చర్యంగా చూశాడు వెట్టి. 'ఏమయింది? ఎందుకు అలా వెళ్ళిపోయింది?' అని అడుగుతూ.

నవ్వటం అయితే ఆపింది ప్రణవి. ఆమె కళ్ళలోని మెరుపు మాత్రం అలాగే ఉండిపోయింది. 'నీకు తెలియదులే. ఇది మనకు సంబంధించిన విషయం. నా దృష్టికి కూడా ఇప్పుడే వచ్చింది' అంటూ తను కూడా గది వెలుపలికి బయలుదేరింది. అంతలోనే గుర్తుకువచ్చింది ఆమెకు అసలు విషయం. 'ఇందాక ప్రత్యూష మాకు చెప్పింది ఏమిటంటే' అంటూ మొదలు పెట్టేసరికి, ఆమె పట్టినపట్టు విడిచిపెట్టే రకం కాదని తెలిసి ఉండటం వల్ల, డాక్టరుగారు శివారెడ్డి హెల్త్‌కి సంబంధించి చెప్పిన మాటల్ని యాజిటీజ్‌గా రిపీట్ చేశాడు అతను.

ప్రఫుల్లమై పోయింది ప్రణవి వదనం. 'నిజంగా విఠల్ బాబు... నిన్ను దేవుడే పంపించాడు మా దగ్గరికి... నువ్వు అడుగుపెట్టావ్.

తెలుసు. నేను చూసుకుంటాను. నువ్వు వర్రీ అవ్వాల్సిన అవసరం ఏమీ లేదు' అన్నది.

మరోసారి కిందికి వాలిపోయాయి ప్రత్యూష కనులు. తన మొఖం కనిపించకుండా చటుక్కున పక్కకు తిప్పుకుంది.

'ఏంట్రా... ఏం చేస్తున్నారు? ఎంతసేపని వెతకాలి మీ అందరినీ? అవతల ఐసియులో ఆ పెద్దమనిషి గోలగోల చేస్తుంటే-' అంటూ శంకరయ్య వచ్చేసరికి మాటల్ని ఆపేశారు వాళ్ళు.

'గోలగోల చేయటం ఏమిటి బాబాయ్? బాగానే ఉన్నాడు కదా... ప్రాబ్లమ్ ఏమీ లేదుగా?' ఒకింత ఆందోళనకు గురి అవుతూ అడిగింది ప్రణవి.

'ప్రాబ్లమా నా మొహమా... విఠల్‌బాబును పిలుస్తున్నాడు' అంటూ వెట్టివైపు తిరిగి, 'పద వయ్యా మగడా.. చచ్చిపోతున్నాం' అంటూ చేయి పట్టుకుని హాలువైపు లాగాడు.

'చెప్పు ప్రత్యూషా... పైన తథాస్తు దేవతలు ఉన్నారని మీ నాన్నకి కూడా గుర్తుచెయ్' నవ్వుతూ చెప్పింది ప్రణవి.

మొదటిసారి చూశాడు వెట్టి ప్రత్యూష మొఖాన్ని చాలా పర్టిక్యులర్‌గా. సొట్టలున్నాయి బుగ్గలకి.




అవి చాలా అందంగా దర్శనం ఇస్తున్నాయి.

అంతకుమించిన సంభాషణలు ఏమీ జరగలేదు అక్కడ. గుంపుగా కదిలి హాల్లోకి, అక్కడి నుంచి ఐసియు దగ్గరికి వచ్చారు వారందరూ.

'హల్లో యంగ్‌మాన్... కమాన్' అంటూ ద్వారం దగ్గిరే ఎదురుపడి వెట్టిని లోపలికి తీసుకుపోయాడు డాక్టరుగారు.

'మనం ఇంటికి వెళ్ళిపోదాం. డాక్టరుగారికి చెప్పు' వెట్టిని చూడగానే వికసించిన మొఖంతో అన్నాడు శివారెడ్డి.

అయోమయంగా చూశాడు వెట్టి, పక్కనే కూర్చుని ఉన్న అతని భార్యకేసి. సరైన సౌకర్యాలు లేని ప్రదేశంలో అధిక సమయం గడపటం వల్ల కాబోలు, నలిగిపోయి కనిపిస్తోంది ఆమె అందమైన మొఖం. చీర ముడతలు పడిపోయింది. చేతులు మురికిగా దర్శనం ఇస్తున్నాయి.

'ఆయన అడుగుతున్నది నిన్నే. నన్ను కాదు' నవ్వుతూ అన్నది ఆమె, అతను తనకేసి చూసేసరికి.

ఈసారి డాక్టరు కేసి చూశాడు వెట్టి. తను చదువుకున్నది ఇంజనీరింగ్ చదువేనని, డాక్టరు చదువు కాదని చెప్పాలన్న కోరిక వెంటనే కలిగిందిగానీ, అతి బలవంతంగా అదుముకున్నాడు.

'మనం డిస్కస్ చేసిన విషయం ఇప్పటి వరకూ ఇక్కడ తెలియదు. దాన్ని అలాగే ఉండనీయటం మంచిది' అన్నాడు వెంటనే ఆ పెద్దమనిషి.

'శివారెడ్డి సారు రిక్వెస్ట్‌ని గురించి చెప్పండి' అడిగాడు వెట్టి.

పెదవులు ముడిచి రెండు నిమిషాలు చాలా సీరియస్‌గా ఆలోచించి 'ఆల్‌రైట్! మా నర్సుల్లో ఒక ఎక్స్‌పర్ట్‌ని మీ వెంట పంపిస్తాను. షీ విల్ బీ మానిటరింగ్ హిజ్ డెవలప్‌మెంట్స్. అయితే ఒక కండిషన్' అన్నాడు.

'చెప్పండి అదేమిటో' ప్రాంప్ట్ చేశాడు వెట్టి.

'మంచైనా చెడైనా చిటికెలో మీరు ఇక్కడికి వచ్చేయాలి. ఈ పెద్దమనిషి శివారెడ్డిసారు కాబట్టి ఈ కన్సెషన్ ఇస్తున్నా. ఇదే వేరేవాళ్ళు అయ్యుంటే ఇంకో రెండు నెలల పాటు ఐసియులోనే ఉంచి ముక్కులు పిండేసేవాణ్ణి. ఆస్తులన్నీ తాకట్టు పెట్టించేసేవాడిని. 'మాటల్ని సీరియస్‌గానే మొదలుపెట్టి నవ్వుతూ పూర్తిచేశారు డాక్టరుగారు. పక్కకు తిరిగి, 'మన అంబులెన్సుల్లో ఒక దాన్ని నేను చెప్పేంతవరకూ శివారెడ్డిసారు ఇంటి దగ్గరే ఉంచండి, ఇద్దరు అటెండెంట్స్‌ని కూడా' అని ఆర్డర్ ఇచ్చాడు.

మతాబు మాదిరి వెలిగిపోవటం మొదలుపెట్టింది శివారెడ్డి భార్య మొహం. శివారెడ్డి మొహం కూడా చాలా ప్రశాంతత వహించింది.

'డాక్టరుగారు చెప్పింది నిజమే. ఇటువంటి పేషంట్స్‌ని ఎవరూ ఇప్పటికిప్పుడు డిశ్చార్జి చేయరు. కాని చేస్తున్నారు. ఎందుకు ఇలా?' ఐసియులో నుంచి బయటికి వస్తూ ప్రణవిని అడిగాడు వెట్టి.

మాటలతో సమాధానం చెప్పలేదు ఆమె. చనువుగా చేయి పట్టుకుని, విజిటర్స్ హాలు దగ్గర్నించి మెయిన్ ఎంట్రన్స్ దగ్గరికి తీసుకుపోయింది.

'ఎక్కడికి? ఇప్పుడు రోడ్డుమీదికి దేనికి?' అని ప్రొటెస్ట్ చేస్తూ వెంట నడిచి, ఆమె ఎంట్రన్స్ దగ్గిర ఉన్న ఒక గోడవైపు చూపించేసరికి రక్కున నోటిని అదుముకున్నాడు వెట్టి.

'మా తాతగారు కట్టించి, తమ ఖర్చులతో రన్ చేస్తున్న హాస్పిటల్ ఇది. దీనికి హోల్ అండ్ సోల్ ఓనర్‌లాగా హడావిడి చేస్తున్న డాక్టరుగారు ఓనర్ కాదు. జీతభత్యాలకు పనిచేస్తున్న మనిషి'.

'మాదే ఈ హాస్పిటల్. అయితే ఈ మాటని మేం బైటికి చెప్పుకోం. చెపితే ఖర్చులు భరించగలిగిన వాళ్ళు కూడా, అన్నయ్య పేరు చెప్పుకుని ఉచితంగా లబ్ధి పొందటానికి బయలుదేరుతారు' చెప్పింది ప్రణవి.

'అయితే ఇందాక బాజిరెడ్డి తీసుకువచ్చిన పందికొక్కులకు వైద్యం ఉచితమేనా?' అడిగాడు వెట్టి.

'అంతే కదా...' అన్నది వెనకాల నిలబడి ఉన్న ప్రత్యూష.

'ఈ విషయం ముందుగానే తెలిసి ఉంటే ఏం చేసేవాడివి? ఇంకో రెండు దెబ్బలు ఎక్కువే కొట్టేవాడివా?' అని అడగబోతూ, రోడ్డుమీద ప్రత్యక్షం అయిన కారును చూసి రక్కున మాటలు ఆపేసింది ప్రణవి.

ఆగిన కారులో నుంచి దిగాడు బాజిరెడ్డి. ఎంట్రన్స్ దగ్గరే ఉన్న వారిని చూసేసరికి కమిలిపోయింది అతని మొఖం. అతి బలవంతంగా తన భావాల్ని అదుపు చేసుకున్నాడు.

'ఏంటి సారు? అహోబిలం వెళ్ళటం లేదా?' తియ్యగా అడిగింది ప్రణవి, వెనుకనుంచి ప్రత్యూష వెన్నుమీద తడుతున్నా లెక్కచేయకుండా.

'అది చెప్పటానికే వచ్చాను. నేను అహోబిలం పోయొస్తా. ఈ లోపల ఈ అబ్బయ్యని చౌడేశ్వరి గుడి దగ్గరికి పోయి పూజ చేయించి రమ్మనాలి' చాలా భక్తిగా చెప్పాడు బాజిరెడ్డి.

వద్దువద్దని వెనుకనుంచి ప్రత్యూష ఎంతగా వెన్ను తడుతున్నా, ఆగటం చేతకాలేదు ప్రణవికి. 'మరి మీ జనాన్ని తుక్కుకింద కొట్టినవాళ్ళ సంగతేమిటి? వదిలేసినట్టేనా?' అని అడిగింది అమాయకంగా మొహం పెడుతూ.

పిడికిళ్ళు బిగించి ఆమెమీదికి ఎగబడటమో, పక్కనే ఉన్న గోడని దభీదభీమని కొట్టటమో చేస్తాడని అనిపించింది వెట్టికి, ఆ పెద్దమనిషి మొఖాన్ని చూడగానే.

అగ్నిగుండాలైపోయాయి కళ్ళు. పళ్ళు పటపటమని శబ్దాలు చేశాయి. 'వదలటమా? వదిలి పెట్టటమా? వాడి అంతు చూసి తీరతాను. పీకకోసి నెత్తురు తాగుతాను' వెట్టివైపు చూస్తూ ఎనౌన్స్ చేశాడు.

'అడిగింది నేనైతే సమాధానం నీకు చెబుతావేమిటి?' తనలో తను గొణుక్కుంటున్నట్లు అన్నది ప్రణవి.

'సరేసరే. ఈ గొడవలన్నీ ఎప్పుడూ ఉండేవే. నేను అహోబిలం పోయొస్తా. నువ్వు మాత్రం చౌడేశ్వరి దగ్గరికి పోయిరా. బద్ధకించకు. శివారెడ్డి తండ్రిగారికి 'మహా ఇష్టం ఆ దేవత' ఈసారి డైరెక్టుగానే వెట్టికి చెప్పి వెనక్కివెళ్ళిపోయాడు బాజిరెడ్డి.

'వీరభోజుడు నీకు ముహూర్తం ఖాయం చేసేశాడు. ఈసారి ఫుల్ ఫోర్స్‌ని ఉపయోగిస్తాడు' అంటూ ప్రత్యూష వైపు తిరిగి 'మీ డాడీని పిలువ్. మనవాళ్ళని కొందరిని సెలక్ట్ చేయాలి' అన్నది ప్రణవి.

***(ఇంకావుంది)***

ప్రైమ్ హాస్పిటల్స్
హైదరాబాద్



డా॥ జి. సతీష్ రెడ్డి
MS. M.Ch. (Ortho) (UK)
Orthopedics & Joint Replacement Specialist
ప్రైమ్ హాస్పిటల్స్, హైదరాబాద్
ఫోన్. 84999 91829 / 040-4959 4959

# 62 ఏళ్ల వ్యక్తికి విజయవంతంగా మోకాలి మార్పిడి సర్జరీ ఆపరేషన్‌తో నొప్పుల నుండి విముక్తి కలిగించిన వైద్యులు

మోకాళ్లనొప్పులు భరించలేనంతగా పెరిగి, ఏ పని చేసుకోలేకపోతున్న ఓ 62 ఏళ్ల వ్యక్తికి ప్రైమ్ హాస్పిటల్స్ వైద్యులు విజయవంతంగా మోకాలిమార్పిడి శస్త్రచికిత్స నిర్వహించి కొత్త జీవితాన్ని ప్రసాదించారు. ఆస్టియో ఆర్థరైటిస్ నిర్ధారణ అయిన తర్వాత ఐదేళ్లపాటు సాధారణ చికిత్స అందించడం మోకాళ్ల నొప్పులు విపరీతంగా పెరిగి దైనందిన కార్యకలాపాలు చేసుకోలేని స్థితికి చేరుకున్నారు. చివరకు ప్రైమ్ హాస్పిటల్ వైద్యులను సంప్రదించగా, అతనిని పరిశీలించిన వైద్యులు విజయవంతంగా మోకాలి మార్పిడి శస్త్రచికిత్స నిర్వహించి మోకాళ్ల నొప్పుల నుండి విముక్తి కలిగించారు.



## సర్జరీతో నొప్పుల నుంచి విముక్తి

ప్రభాకర్ (పేరు మార్చాం) అనే పదవీ విరమణ పొందిన ఉపాధ్యాయుడికి 10 ఏళ్ల క్రితం మోకాళ్ల నొప్పులు ప్రారంభమయ్యాయి. ఆయన ఉదయం వాకింగ్ చేస్తున్న సమయంలో, మెట్లు ఎక్కుతున్నప్పుడు తీవ్ర అసౌకర్యానికి గురయ్యేవారు. అతను ఆర్థోపెడిక్ సర్జన్‌ను సంప్రదించగా ఎక్స్-రేలను పరిశీలించి అతనికి ఆస్టియో ఆర్థరైటిస్ ఉన్నట్లు నిర్ధారించారు. రోగి పరిస్థితి ప్రమాదకరస్థితికి చేరుకున్నా అతనికి చికిత్స అందిస్తున్న సర్జన్ సాధ్యమైనంతవరకు సర్జరీ నిర్వహించకుండా ఉండేందుకే ప్రయత్నించారు. అలా ఐదు సంవత్సరాలపాటు చికిత్స కొనసాగించగా, అతనికి మోకాళ్ల నొప్పులు భరించలేనంతగా తీవ్రతరమయ్యాయి. దాంతో తనకు ఇష్టమైన పనులు, దైనందిన కార్యకలాపాలు చేసుకోలేని స్థితికి చేరుకున్నారు. ఆ తర్వాత 2014లో రెండోసారి తీసిన ఎక్స్-రే సెట్‌తో ప్రైమ్ హాస్పిటల్స్ ఆర్థోపెడిక్ సర్జన్ డాక్టర్ జి.సతీష్‌రెడ్డిని సంప్రదించారు. ఎక్స్-రేలతో పాటు రోగి ఆరోగ్య పరిస్థితిని క్షుణ్ణంగా పరిశీలించిన ఆయన రోగికి మోకాలి మార్పిడి సర్జరీ అవసరమని తెలిపారు. అందుకు రోగి, అతని కుటుంబ సభ్యులు అంగీకరించడంతో 2014 సెప్టెంబర్‌లో డాక్టర్ జి.సతీష్‌రెడ్డి అతనికి మోకాలికి రెండు వైపులా పూర్తి మోకాలి మార్పిడి శస్త్రచికిత్స నిర్వహించారు. సర్జరీ జరిగిన అనతికాలంలోనే అతనికి మోకాళ్లనొప్పుల నుంచి విముక్తి లభించింది.

## జాగ్రత్తలు పాటించి త్వరగా కోలుకున్నారు.

మోకాలి మార్పిడి శస్త్ర చికిత్స చేయించుకున్న వారిలో ఆపరేషన్ తరువాత సరైన జాగ్రత్తలు పాటిస్తూ వైద్యులు సూచించిన వ్యాయామాలు చేయడం, ఫిజియోథెరపి కొనసాగించడం వంటివి రోగి త్వరగా కోలుకునేందుకు దోహదం చేస్తాయి. ఈ రోగికి ఆపరేషన్ తరువాత నాలుగు వారాల పాటు ఇంట్లోనే ఫిజికల్ థెరపీ చేసుకునే విధంగా ఏర్పాట్లు చేశారు. ఆ తర్వాత ఆయన క్రమంగా కోలుకుంటూ మూడు నెలలపాటు ఫిజికల్ థెరపీని కొనసాగించారు. ఆ తర్వాత మళ్లీ సాధారణ స్థితికి చేరుకున్నారు. అతనికి నొప్పుల నుండి పూర్తిగా ఉపశమనం లభించడంతో అన్ని పనులు సాధారణంగా చేసుకుంటూ జీవితాన్ని ఆస్వాదిస్తున్నారు. తనకు విజయవంతంగా సర్జరీ నిర్వహించి నొప్పులను ఉపశమనం కలిగించిన వైద్యులకు కృతజ్ఞతలు తెలిపారు.

## స్ఫూర్తిని కలిగించే 'సపోర్ట్ గ్రూప్'

సర్జరీ చేయించుకునే వారికి స్ఫూర్తిని కలిగించేందుకు ప్రైమ్ హాస్పిటల్స్‌లో 'సపోర్ట్ గ్రూప్' ఏర్పాటు చేశారు. ఈ గ్రూప్ ద్వారా ఆపరేషన్ చేయించుకున్నవారు, ఆపరేషన్ చేయించుకోబోయేవారితో తమ అనుభవాలను పంచుకుంటారు. ఎవరికైనా శస్త్రచికిత్స పట్ల ఆందోళన, భయం, అపోహలు, అయిష్టత ఉంటే వారు సర్జరీ చేయించుకున్న వారితో చర్చించి తద్వారా చాలా వరకు తమ అపోహలు, అనుమానాలు నివృత్తి చేసుకుంటారు.

## నాణ్యమైన ఇంప్లాంట్స్‌తో మెరుగైన జీవితం

మోకాలు మార్పిడి శస్త్రచికిత్స అనంతరం మనం ఎంత జాగ్రత్తగా వ్యవహరిస్తే కృత్రిమ మోకాలు అంత ఎక్కువకాలం మన్నికగా ఉంటుంది. నాణ్యమైన ఇంప్లాంట్స్‌తో మెరుగైన జీవితం గడపగలుగుతారు. ఎక్కువ కాలం మన్నికగా ఉండే ఇంప్లాంట్ కోసం పరిశోధనలు జరుగుతూనే ఉన్నాయి. పరిశోధనల ఫలితంగా నాణ్యమైన ఇంప్లాంట్స్ అందుబాటులోకి వస్తున్నాయి. ఈ రోగికి ఉపయోగించిన ఇంప్లాంట్స్ అతని జీవనశైలిని బట్టి సుమారు 20 సంవత్సరాల పాటు మన్నికగా ఉంటాయి.

## గుర్తించుకోవాల్సిన విషయాలు

సర్జరీ తర్వాత కొన్ని జాగ్రత్తలు పాటించడం చాలా అవసరం. ఆపరేషన్ తర్వాత మోకాలుపై ఎక్కువగా ఒత్తిడి కలిగించే ఆటలకు దూరంగా ఉండాలి. సర్జరీ చేయించుకున్న వారికి మధుమేహం, రక్తపోటు వంటి ఆరోగ్య సమస్యలు ఉంటే వాటిని అదుపులో ఉంచుకోవాలి. ఆపరేషన్ తర్వాత దంతాలకు సంబంధించిన చికిత్సగానీ, శస్త్రచికిత్సగానీ చేయించుకోవల్సి వస్తే సర్జరీ జరిగిన విషయాన్ని వైద్యులకు తెలియజేయాలి. దాంతో ఇన్‌ఫెక్షన్ రాకుండా జాగ్రత్తలు తీసుకుంటూ వైద్యులు దంతాలకు చికిత్స అందిస్తారు.



పెళ్ళైన కొత్తల్లో దాంపత్యజీవితంలో మధురిమలు వెల్లివిరుస్తాయి. ఆ సంతోషం నిండునూరేళ్ళూ ఉంటేనే ఆ బంధం శాశ్వతమవుతుంది. దాంపత్య జీవితారంభంలో ఉండే తీయని అనుభూతులు నిత్యనూతనంగా కొనసాగాలంటే రొమాన్స్ ఒక్కటే సరిపోదు! ఆలుమగలిరువురి మధ్య కేవలం స్నేహం, అవగాహన మాత్రమే కాదండోయ్ తరచు ఆలుమగల మధ్య గిల్లికజ్జాలూ, సరదాచేష్టలు కూడా ఆ బంధాన్ని దృఢంగా మార్చేందుకు ఉపయోగపడే అవకాశాలు ఉన్నాయంటున్నారు రిలేషన్‌షిప్ నిపుణులు.

# శ్రీమతి ఏమన్నా శ్రీవారు తందాన తాన!



దంపతుల మధ్య జరిగే కొన్ని గిల్లికజ్జాలు, సరదా పనులవల్లే ఇరువురి మధ్యా అర్థం చేసుకునేతత్వం క్రమంగా పెరుగుతుందట. అయితే ఇప్పుడున్న కాలంలో ఆలుమగల మధ్య మాట్లాడుకోవడానికే సరైన సమయం దొరకట్లేదు, ఇక సరదాగా కబుర్లాడుకునేదెప్పుడు... సరదా సరదా గొడవలు పడేదెప్పుడు..! అనుకుంటున్నారా? దీనికంటూ ప్రత్యేకంగా కొంత సమయం కేటాయించాల్సిన పనిలేదుగానీ మీరు చేసే పనుల్లో చిన్న చిన్న మార్పులు జోడిస్తే సరి! మరి మీ బంధం గట్టిపడాలంటే ఎలానో తెలుసుకోండి!!

### స్నేహపూర్వక వాతావరణం

భార్యాభర్తలమధ్య తరచూ గొడవలు ఎందుకు వస్తున్నాయి? దాంపత్య జీవితంలో ఎందుకు అశాంతి నెలకొంటోంది? అనే పలు అంశాలపై జవాబులు వెతికే ప్రయత్నం చేశారు అమెరికా సైకాలజిస్టులు. అందుకోసం ఇండియానాలోని పర్డ్యూ యూనివర్సిటీలో ఓ సర్వే నిర్వహించారు. భార్యాభర్తల మధ్య స్నేహపూర్వక వాతావరణం లేని కారణంగానే ఈ గొడవలన్నీ వస్తున్నాయని ఈ సర్వేలో తేలింది. భార్యాభర్తలు అన్యోన్యంగా జీవితం గడపాలంటే వారిద్దరూ మంచి స్నేహితులుగా ఉండాలని రిలేషన్‌షిప్ నిపుణులు చెబుతున్నారు. అలా ఉన్నప్పుడే దాంపత్య జీవితాన్ని ఆస్వాదించగలరని చెబుతున్నారు.

### చిలిపి పోటీ!

పోటీ పెట్టుకోవాలి అనగానే వృత్తిపరమైన విషయంలోనో లేక ఒకరినొకరు విమర్శించుకునే విషయంలోనో అనుకునేరు. భార్యాభర్తల మధ్య పోటీ ఆహ్లాదకరంగా ఉండాలి. వారి మధ్య పోటీ వారిరువురికీ ఉపయోగకరంగా ఉండాలి. ఇద్దరి మధ్యా ఆరోగ్యకరమైన పోటీ చాలా అవసరం. ఉదాహరణకు భోజనం చేసే సమయంలో, నువ్వు తింటేనే నేను తింటాననో, లేక ఇద్దరం కలిసి తినొచ్చు అనో, నేను ఒక్కదాన్నే తినాలని రూల్ లేదు కదా అనో లేదా ఎవరు ముందు గెలిస్తే వారికి తగిన బహుమానం ఉంటుందనో చిలిపిగా పోటీ పడాలి. ఫలితంగా ఒకరి విషయంలో మరొకరు శ్రద్ధ తీసుకున్నట్లు ఉంటుంది. ఇలాంటి సరదా పద్ధతివల్ల దాంపత్య జీవితం బలపడుతుంది కూడా!

## పని ప్రదేశంలో టైమ్‌వేస్ట్ చెయ్యొద్దు!

ఉద్యోగం చేసే భార్యాభర్తలు పని ప్రదేశాల్లో మితిమీరిన సమయం గడిపితే వారి మధ్య సంబంధాలు అంత మెరుగ్గా ఉండవట. నిత్యం ఇలాంటి పరిస్థితులే ఉంటే, దంపతుల మధ్య ప్రేమ, ఆప్యాయత క్రమేపీ తగ్గుతాయనీ, జీవితం యాంత్రికంగా మారిపోతుందనీ ఇటీవల నిర్వహించిన ఓ సర్వేలో వెల్లడైంది. ఆరునెలలపాటు ఉద్యోగాలు చేస్తూ ఉన్న కొన్ని జంటలపై సర్వే నిర్వహించారు. ఉద్యోగంలో పని గంటలు పెరిగిన కొద్దీ ఇంటికి వచ్చేసరికి వారిలో ఎనర్జీ లెవెల్స్ బాగా తగ్గిపోతాయి. ఆ తర్వాత భాగస్వామితో సమయం వెచ్చించలేకపోతారు. ఇదే విషయాన్ని ఎంతోమంది సర్వేలో ఒప్పుకున్నారు. ఉదయం లేవడంతోనే ఉరుకులు పరుగులతో బయల్దేరి వెళుతూ రోజులు నెట్టుకొస్తున్నామని, కుటుంబంతో ఎక్కువ సమయం గడపలేకపోతున్నామని సర్వేలో పాల్గొన్న భార్యాభర్తలు చెప్పారు. ఈవిషయాన్ని వారు గుర్తించినా ఏం చేయలేకపోతున్నారు. అలా కాకుండా భార్యాభర్తలు తమ వ్యక్తిగత విషయాలను షేర్ చేసుకుంటుంటే వారి మధ్య అన్యోన్యతా, ప్రేమా పెరిగే అవకాశాలు మెరుగ్గా ఉన్నాయట. లక్ష్యాలు, సంపాదన లాంటివి ఎన్నో ఉన్నప్పటికీ, వాటిని పక్కనపెట్టి రోజులో కాస్త సమయమైనా ఆలుమగలు ఏకాంతంగా కబుర్లు చెప్పుకోవాలి. ఆరోజు వారు ఎలా గడిపారో ఒకరికొకరు స్వేచ్ఛగా తమ మనోభావాలు వెల్లడించుకుని, విశ్లేషించుకోవాలని సర్వే ద్వారా చెబుతున్నారు.

# ప్రేమానురాగాలు బలపడాలంటే?



'నువ్వంటే నాకిష్టం' అనో, లేక 'నిన్ను ప్రేమిస్తున్నా' అనో జీవితభాగస్వామికి వారంలో కనీసం పదిసార్లు చెప్పగలిగితే, ఆ దాంపత్య జీవితం సుఖమయంగా సాగుతుందని నిపుణులు చెబుతున్నారు. ఆ చెప్పడం కూడా సందర్భోచితంగా ఉండాలి సుమా! ఇదికూడా సర్వేలో వెల్లడైన అంశమే. వన్‌పోల్ డాట్‌కామ్ వారు నిర్వహించిన సర్వేలో ఈ విషయం తేలింది. రొమాంటిక్ మూడ్‌ను రేకెత్తించే ఆశ్చర్య పూర్వక గిఫ్టులు, ప్రేమపూరితమైన సంభాషణలు నెలలో మూడుసార్లు కొనసాగితే ఆలుమగల జీవితం సుఖమయంగా ఉంటుందని దాదాపు 92 శాతంమంది అమెరికన్లు అభిప్రాయపడ్డారు. ఇరువురి మధ్య గొడవలు కూడా కొన్నిసార్లు అద్భుతాలు సృష్టిస్తాయి. గొడవ పడిన తర్వాత విచారం వ్యక్తం చేసే దంపతుల మధ్య సాన్నిహిత్యం పెరుగుతోందని సర్వేలో తేలింది. వారానికి మూడుసార్లు శృంగారంలో పాల్గొనే దంపతులు కూడా హాయిగా ఉన్నట్లు సర్వేలో వెల్లడైంది.

## మాట్లాడిస్తూ ఉండండి!

ఇప్పుడున్నకాలంలో భార్యాభర్తల మధ్య మాటలే కరువయ్యాయి. అలాంటి పరిస్థితుల్లో రోజులో అరగంటైనా మాట్లాడుకోవడం ఎలా? అనుకుంటున్నారా? అయితే ఇకపై మీరు మారండి. మానసిక నిపుణులు ఏమంటున్నారంటే ప్రతి రోజూ అరగంటసేపు ఉదయం లేదా రాత్రి కేవలం ఆలుమగలు మాత్రమే కబుర్లు చెప్పుకోవడం అలవాటు చేసుకోవాలి. పిల్లలు, ఇరుగు పొరుగువారు, బంధువులు ఆలుమగల మాటల మధ్య అడ్డం రాకూడదు. ఆలుమగలు ఒక జంటగా ప్రతిరోజు మనసువిప్పి మాట్లాడుకోగలగాలి. దానివల్ల ఇద్దరి ఆలోచనలు ఒకరికొకరికి అర్థమవుతాయి. సాధారణంగా మగవారితో పోలిస్తే, మాట్లాడడం అంటే ఆడవాళ్ళకే ఎక్కువ ఇష్టం. ఇలాంటి పరిస్థితుల్లో భర్త మాట్లాడేందుకు ఇష్టపడకపోయినా సరే, పనిలో సహాయం చేస్తూ భర్తను భార్య నెమ్మదిగా మాటల్లోకి దించాలి. ఈరోజు ఎలా గడిచింది? అని అడగండి. ఆ..ఊ..అని, సరే కాదు లేదు లాంటి పొడిపొడి మాటలు కాకుండా అన్నీ వివరంగా చెప్పేవరకు వదిలిపెట్టకండి. భర్తకు ఏమైనా ఇబ్బందులున్నాయా లేక మీకేమైనా ఇబ్బందులున్నాయా అన్నది ఒకరికొకరు చెప్పుకోండి. తద్వారా భార్యాభర్తల మధ్య సంబంధాన్ని మెరుగుపరుచుకోవచ్చని మానసిక వైద్యనిపుణులు చెబుతున్నారు.

## అప్పుడప్పుడు అటు ఇటు మారాలి!

ఇక కొందరి ఇళ్ళల్లో భార్య ఉద్యోగం చేయడంతో పాటు ఇంట్లో పనులు కూడా తనే చేసుకుంటూ ఉంటుంది. భర్త ఉద్యోగం చేస్తూ బైటి పనులు చూసుకోవడం వంటివి చేస్తుంటాడు. ఇలా చేసీ చేసీ కొద్దిరోజుల తర్వాత రొటీన్ జీవితంపట్ల ఇద్దరికీ విరక్తి కలుగుతుంది. అలాంటప్పుడు ఒక్కోసారి ఒకరి బాధ్యతల్ని మరొకరు తీసుకుని పని చేయడంలో తప్పులేదు. 'నేను చేయను, నువ్వు చేసేపని నువ్వే చేయాలి' లాంటి మాటలకు తావు లేకుండా అప్పటివరకు చేస్తున్న పనుల్ని అటూ ఇటూ మార్చిడి చేసుకోవాలి. వీలున్నప్పుడల్లా ఒకరి పనులు మరొకరు చేయడానికి ఆసక్తి చూపించాలి. ఇలా రోజువారీ పనులు మార్చుకోవడం వల్ల కూడా ఇద్దరికీ అందులోని కష్టం, శ్రమ తెలియడమే కాకుండా సరదాగాకూడా ఉంటుంది. అంతేకాదు దీనివల్ల ఇద్దరి మధ్యా అర్థం చేసుకునేతత్వం పెరిగి అనుబంధం బలపడుతుంది.

## ఒక్కటే అభిరుచులు

ఆలుమగలకు కొన్ని అభిరుచులు వేరువేరుగా ఉంటాయి. వాటిని మార్చుకోమని చెప్పేవీలు ఉండదు. కానీ ఇద్దరికీ ఇష్టమైన కొన్ని ఉమ్మడి అభిరుచులు ఉంటాయి. అవేమిటో ఇద్దరూ గుర్తించాలి. వాటి ద్వారా కూడా దంపతులు బోలెడంత సరదాను తమ సొంతం చేసుకోవచ్చు.

డ్యాన్స్, సంగీతం వంటి వాటిపై ఉన్న మమకారంతో ఇద్దరూ కలిసి పాటపాడడం, డ్యాన్స్ చేయడం వంటివి ఫన్నీగా ప్రాక్టీస్ చేయవచ్చు లేదా ఇద్దరికీ ఆటలంటే ఇష్టం ఉంటే కలిసి ఆడుకోవచ్చు. చదువుకోవడం ఇష్టం ఉంటే కలిసి బుక్స్ చదువుతూ, అప్పుడప్పుడూ హాస్య పుస్తకాలు చదువుతూ, రొమాంటిక్ పుస్తకాలకూ చోటిస్తూ ఎంతగానో ఎంజాయ్ చేయొచ్చు, అవి ఎప్పటికీ మరపురాని మధురానుభూతులుగా ఉంటాయి. మీరెప్పుడైనా విచారంలో ఉన్నా డిప్రెషన్‌లో ఉన్నా అలాంటివి గుర్తు చేసుకోవడం ద్వారా తిరిగి రీఫ్రెష్ కావచ్చు.



## ఇవి కూడా చేయండి

దంపతుల మధ్య అనురాగం బలపడాలంటే మాట్లాడటాలూ, అవుటింగ్‌కి వెళ్ళడాలు మాత్రమే కాదు అప్పుడప్పుడూ ప్రేమగా కొట్టుకోవాలి కూడా! ఫైటింగ్స్ ఉండాలి. ఫైటింగ్ అనగానే ఏ కర్రలో, గరిటెలో పట్టుకుని కొట్టుకోవడం అనుకునేరు! సరదా ఫైటింగ్ అన్నమాట!

సరదాగా, రొమాంటిక్‌గా, కొట్టుకోవడం, కవ్వింత, ఆటపట్టించడం, ఒకరిపై ఒకరు కోపం నటిస్తూ గోముగా ఒకరినొకరు బతిమాలుతూ, బుజ్జగిస్తూ, లాలిస్తూ చిన్నచిన్న వస్తువులను పట్టుకుని చిలిపిగా ఒకరితో ఒకరు ఫైట్ చేసుకోవడంవల్ల ఇద్దరి మధ్య అనుబంధం మరింత దృఢమవుతుందని పక్కాగా చెప్పొచ్చు. అయితే ఇదంతా సరదాగానే తప్ప సీరియస్‌గా ఉండకూడదు. ఇలా గిల్లికజ్జాలు పెట్టుకునే సమయంలో పుట్టింటి విషయాలు లేదా బైటి విషయాలుగానీ ప్రస్తావించకూడదు. కేవలం ఇరువురికీ సంబంధించిన విషయాలను అది కూడా సంతోష విషయాలను మాత్రమే పరిగణనలోకి తీసుకోవాలి. ఒకరికి నచ్చిన వంటకాలు మరొకరు వండిపెట్టడం, ఫ్రెండ్స్‌ని ఇంటికి పిలవడం, సరదాగా ఎంజాయ్ చేయడం వంటివి కూడా దాంపత్య జీవితాన్ని మరింత ఆనందంలో ముంచెత్తుతాయి.

- నివేదిత



# సెలక్షన్

మణి వడ్లమాని

**చికాగో ఎయిర్‌పోర్ట్ బైట విపరీతమైన స్నోఫాల్. శరీరాన్ని ఎంత కవర్ చేసుకున్నా గానీ చలి ఆగటం లేదు. ఎటుచూసినా తెల్లని తెలుపు. నగరమంతా తెల్లని దుప్పటి కప్పుకున్నట్టుగా ఉంది.**

మాటిమాటికీ ఫ్లైట్ డిలే గురించిన ఎనౌన్స్‌మెంట్స్ చికాకు కలిగిస్తున్నాయి వరుణ్‌కి. ఎంతకీ టైమ్ గడవటంలేదు. అంతపెద్ద ఇంటర్నేషనల్ ఎయిర్‌పోర్ట్‌లో రకరకాల దేశస్థులు ఉన్నారు. ఎవరి గమ్యానికి వాళ్ళు చేరాలనే ఆత్రుత అందరి మొహాలలో కనిపిస్తోంది.

మధ్యలో ఫ్రెండ్స్‌తో వాట్సాప్ మెసేజ్‌చేస్తూ టైమ్‌పాస్ చేస్తున్నాడు వరుణ్. అలా రిలాక్స్ అవుతూ ఒక్కక్షణం కళ్ళుమూసుకున్న అతన్ని, ఓ సుగంధభరితమైన పరిమళం చుట్టుముట్టింది. దిగ్గున కళ్ళు తెరిచాడు. కానీ తన ముందు నుండి ఎవరూ వెళ్ళిన అలికిడి కనిపించలేదు. కానీ ఇంత దగ్గరగా ఆ పరిమళం ఎలా వచ్చిందోగానీ, భలే ఉంది. బహుశా ఇక్కడే ఎక్కడో ఉండచ్చు... అబ్బ ఆ స్మెల్ ఎంత బాగుందో అనుకున్నాడు.

మొత్తానికి మూడు గంటలు ఆలస్యంగా ఫ్లైట్ బయలుదేరింది. అంతసేపు ఫ్లైట్‌కోసం వెయిట్ చెయ్యడంవల్ల, సెలవుమీద ఇండియా వెళ్ళేందుకు వరుసగా వారం రోజుల నుంచి విరామం లేకుండా పనిచేయడంవల్ల చాలా అలసటగా ఉండటంవల్ల ఫ్లైట్ ఎక్కిన వెంటనే నిద్రలోకి జారుకున్నాడు. దాదాపు ఇరవై గంటలు ప్రయాణం చేసి హైదరాబాద్ చేరుకున్నాడు. ఎయిర్‌పోర్ట్‌లో వరుణ్ తల్లిదండ్రులు వసుధ, రవీంద్ర, చెల్లెలు వచ్చారు. వాళ్ళని చూస్తూనే వెళ్ళి ముగ్గురినీ దగ్గరకు తీసుకున్నాడు. కొంచెంసేపు వాతావరణం బరువెక్కింది.

వరుణ్ ఫ్రెండ్స్ మొత్తం పదిమంది కార్తీక్, తేజ్, స్మృతి, అర్చన, జయ, శరత్, అభి, దీపిక, శరత్, కౌశిక్ అందరూ ఒకటే హడావుడిచేస్తూ వరుణ్‌ని చుట్టుముట్టారు. "వెల్‌కమ్ టూ ఇండియా వరుణ్" అంటూ బొకేలు, బెలూన్లతో స్వాగతం చెప్పారు. ఇంతలో సడన్‌గా మాట్లాడుతున్న వరుణ్ ముక్కుపుటాలకు మళ్ళీ అదే ప్రత్యేక పరిమళం తాకింది. మాట్లాడుతున్నవాడల్లా ఒక్కసారిగా ఆగిపోయాడు. చుట్టూ చూశాడు. అది చూసి స్నేహితులు "ఏం మామా! ఎవరినైనా ఎక్స్‌పెక్ట్ చేస్తున్నావా?" అంటూ జోక్ చేశారు. "అదేం లేదురా" అని సరిపెట్టేశాడు వరుణ్.

"అరే, వాడు రాముడు మంచిబాలుడు టైప్. వాణ్ణి ఏమీ అనొద్దురా" అని ఒకళ్ళు అంటే మరే, చంటి పిల్లాడు, "ఉంగా ఉంగా" అంటూ మరొకళ్ళు ఉడికించారు. అలా గట్టిగట్టిగా స్నేహితులంతా నవ్వుకుంటున్నారు.

"ప్చ్... నోరు ముయ్యండిరా, మమ్మీడాడీ ఉన్నారు పక్కనే" అన్నాడు వరుణ్. ఇంతలో

**అమెరికా నుండి హైదరాబాద్ ఎయిర్ పోర్ట్‌లో దిగాడా కుర్రాడు. తల్లిదండ్రులు, స్నేహితులు దూరం నుండి విష్ చేస్తున్నారు. ఇంతలో సుగంధ పరిమళం అతడి నాసికను తాకుతూ వెళ్ళిపోయింది. ఆ పరిమళం అతడి హృదయాన్ని హత్తుకుంది. చుట్టూ చూశాడు. ఎవరూ లేరు. ఆ తర్వాత సిటీలో తిరిగినప్పుడు రెండుమూడుసార్లు అదే పరిమళం అతన్ని తాకింది. కానీ ఆమె అతడికి కనిపించలేదు. ఎవరామె?**

రవీంద్ర వరుణ్ దగ్గరకు వచ్చి “పద ఇంక వెళదాం. టాక్సీలో నువ్వూ, నేహా కూర్చోండి. నేనూ, మమ్మీ మనకారులో వచ్చేస్తాం అని వరుణ్ ఫ్రెండ్స్‌వైపు తిరిగి, “మీరు అందరూ వస్తున్నారా మా ఇంటికి” అడిగాడు.

“లేదు అంకుల్, మేము ఇప్పుడు వెళ్ళిపోతాం, ఎల్లుండి కలుస్తాం” అని వరుణ్‌కి బైచెప్పి వాళ్ళందరూ వెళ్ళిపోయారు.

ఇంటికెళ్ళేవరకు నేహ, వరుణ్ బోలెడు కబుర్లు చెప్పుకున్నారు. మధ్య మధ్యలో మాత్రం వరుణ్, ఆ పరిమళం తాలూకు అనుభూతిని తలచుకుంటూనే ఉన్నాడు.

ఇంటికి వెళ్ళాక వసుధ మంచికాఫీ ఇచ్చింది. అది తాగుతూ అన్నాడు, “అమ్మా! నిజంగా నువ్వు గ్రేట్. ఇలాంటి కాఫీ ఎక్కడా తాగలేదు. అసలు నీచేతి రుచే వేరు” అన్నాడు.

“అదేంటి, స్టార్‌బక్స్ కాఫీ చాలా ఫేమస్ కదా” అంది.

“కానీ అమ్మచేతి ఫిల్టర్‌కాఫీ రుచి దేనికీ సాటిరాదు”

“సరే నువ్వు ఈ పూటకి రెస్ట్ తీసుకో. ఎక్కడికీ బైటకు వెళ్ళకు” వరుణ్‌తో అన్నాడు రవీంద్ర. మధ్యాహ్నం లంచ్ టైమ్‌కి నిద్రలేపి, “నాన్నా స్నానంచేసి భోజనం చేద్దువుగానీ, డాడీ కూడా నీ కోసం వెయిట్ చేస్తున్నారు” అంది వసుధ.

“అయ్యో, డాడీ వెయిట్ చేస్తున్నారా, ఇదిగో ఇప్పుడే వస్తున్నా” అంటూ స్నానంచేసి ఫ్రెష్ అయి డైనింగ్‌టేబుల్ దగ్గరకు వచ్చాడు. అప్పటికే రవీంద్ర, నేహ కూర్చుని ఉన్నారు.

కొడుకును చూస్తూ “రా రా” అంటూ పిలిచాడు రవీంద్ర.

టేబుల్‌మీద ఉన్న పదార్థాలు చూసి, “అబ్బ అన్నీ నాకు ఇష్టమైన వంటకాలే” అన్నాడు.

“అవును మరీ... కొడుకు అమెరికా నుండి వచ్చాడని, అమ్మ అన్ని స్పెషల్స్ చేసింది” నేహ నవ్వుతూ చెప్పింది. “ఆపవే, వెటకారం, రేపు నువ్వు కూడా బైటకువెళ్ళి వచ్చినప్పుడు తెలుస్తుంది”

“చూడండి దాడీ, మమ్మీ ఎలా అంటోందో” గారాలు పోయింది నేహ.

“వరుణ్, ఏంటి నీ ప్లాన్! నువ్వు మూడు వారాలు ఇక్కడ ఉంటావు కదా! ఫ్రెండ్స్‌తో ఏదైనా టూర్ ప్లాన్ చేసుకున్నావా?” అడిగాడు.

“లేదు డాడీ, ఇక్కడే ఉంటాను”

“అదే నువ్వు చెప్పినట్టు, మేం నాలుగు సంబంధాలు చూసిపెట్టాం, మాట్రిమోనియల్ నుండి. అదీకాకుండా, ఇంకో రెండుమూడు సంబంధాలు కూడా ఉన్నాయి. అమ్మ అన్ని డీటెయిల్స్ చెబుతుంది. సో దాని ప్రకారం ప్లాన్ చేసుకో. ఇంకో సంగతి, నీకు ఏదినచ్చితే అదే చేస్తాం. అల్టిమేట్ డెసిషన్ నీదే. ఎవ్వరం ఫోర్స్ చెయ్యం. అలాగే నువ్వుకూడా బాగా ఆలోచించుకుని చెప్పు. కానీ ఈ ట్రిప్‌లోనే సెటిల్ చేసుకో. కావాలంటే పెళ్ళికి రెండు మూడు నెలలు టైమ్ తీసుకుందువుగానీ, సరేనా” అని వరుణ్‌తో నెమ్మదిగా అయినా పదునుగానే చెప్పాడు రవీంద్ర.

భోజనాలు అయ్యాక తీరికగా ల్యాప్‌టాప్ తీసి, మాట్రిమోనియల్ సైట్ ఓపెన్ చేసింది వసుధ. అందులో సెలెక్ట్ చేసిన నాలుగు ప్రొఫైల్స్ వాళ్ళ కాంటాక్ట్ డీటెయిల్స్ అన్నీ నోట్ చేసుకుని, కొడుక్కి చూపించింది. అందులో రెండు ప్రొఫైల్స్ సెలెక్ట్ చేసుకున్నాడు. నేహాకి కూడా అవే నచ్చాయి. ఇద్దరు అమ్మాయిలూ ఇంజనీర్లే. పెద్ద ఎం.ఎస్.సిలో చేస్తున్నారు. శృతి అనే అమ్మాయి ఇక్కడే ఉంది. రెండో అమ్మాయి అనీక డెట్రాయిట్‌లో వర్క్ చేస్తోంది. ఇద్దరి ఫ్యామిలీ డీటెయిల్స్ వీళ్ళు అనుకున్న వాటన్నింటికీ మ్యాచ్ అయ్యాయి.

అప్పుడు వసుధ అంది, “అయితే, వీళ్ళకి ఫోన్ చేసి చెబుతాను. నెక్స్ట్ వీక్‌లో వెళదాం చూడటానికి”.

వసుధ గదిలోంచి వెళ్ళగా చూసి, “చెప్పరా అన్నయ్యా, వీళ్ళిద్దరిలో ఎవరు ఎక్కువ నచ్చారు” అని ఉత్సాహంగా అడిగింది. “అలా అడిగితే కొంచెం కష్టమే. ఎందుకంటే మనం వర్చ్యువల్‌గా చూసినా, మనిషిని మనకళ్ళతో చూసి మాట్లాడితే ఆ ఫీల్‌వేరు. సో నేను చూసి, వాళ్ళతో మాట్లాడిన తరువాతే ఏదైనా చెప్పగలను” అన్నాడు.

“సరే అన్నయ్యా! కొంతసేపు నీ పెళ్ళిని పక్కకు పెడదాం. ఈ రెండేళ్ళలో మన హైదరాబాద్ ఇంకా మారిపోయింది. అప్పుడు నువ్వు ఫోరం మాల్ చూడలేదు కదా! ఈ రోజు వెళదాం” నేహ ఉత్సాహంగా అంది.

“ఓకే డన్! మమ్మీ, నువ్వూ డాడీ వస్తారా?” అడిగాడు వరుణ్.

## ఆ సినిమాకు తమన్నానే దిక్కు?

ఐటంసాంగ్స్ విషయంలో ఒక్కో హీరోయిన్‌దీ ఒక్కో స్టైల్. అయితే ఈ విషయంలో మిల్కీబ్యూటీ తమన్నాది అందెవేసిన చేయి అంటారు సినీ జనాలు. కనీకనిపించకుండా తన అందాలు చూపించడంలో తమన్నా ఎప్పుడూ ముందే ఉంటుంది. దానికి తోడు ఆ అందాలు తెరమీద ఎన్నిసార్లు చూసినా తన్మయత్వం చెందే ప్రేక్షకుల సంఖ్య తెలుగు రాష్ట్రాల్లో లక్షల్లోనే ఉంటుంది. తమన్నా ఐటం సాంగ్ ఉంటే చాలు ఆ సినిమాను పదేపదే చూసే అభిమానులు తమన్నా సొంతం. ఇవన్నీ గ్రహించే దర్శకనిర్మాతలు తమన్నా క్రేజ్‌ను ఎప్పటి కప్పుడు క్యాష్ చేసుకుంటూనే ఉంటారు. ఇంతకీ అసలు విషయం ఏమిటంటే... విశాల్ హీరోగా నటించిన ‘ఒక్కడొచ్చాడు’ సినిమా దర్శకనిర్మాతలు కూడా ఇదే బాట పట్టారు. తమ సినిమాకు అదనపు ఆకర్షణ తీసుకువచ్చేందుకు గానూ తమ న్నాతో ఐటం సాంగ్ చేయించడమే కాకుండా, దానికి సంబంధించిన ఫోటోలను కూడా విడుదల చేశారు. ఈ ఫోటోలకు విపరీతమైన ఆదరణ లభించింది. దాంతో ఈపాట పోస్టర్లను రెండు తెలుగు రాష్ట్రాలలో భారీగా విడుదల చేసి రచ్చరచ్చ చేసేస్తున్నారు సినిమా యూనిట్. తమిళంలో, తెలుగులో ఈ నెల విడుదల కాబోతోంది ఈ సినిమా.



"లేదులేరా, నాకు కొంచెం పని ఉంది. నాన్న కోసం చూడకుండా మీరు వెళ్ళండి" అంది వసుధ.

ఇంతలో వరుణ్ స్నేహితుడు తేజ్ వచ్చాడు. అతని కారులో ముగ్గురూ బయల్దేరి వెళ్ళారు. వరుణ్‌కి తేజ్ బాగా క్లోజ్. మిగతా వాళ్ళు ఈవెనింగ్ కలుస్తామన్నారు.

కార్ పార్క్ చేసుకుని, ముగ్గురూ లోపలికి అడుగుపెట్టారు.

"భలే ఉంది మాల్! ఆల్మోస్ట్ అంతా అక్కడ ఉన్నట్టే ఉంది. అస్సలు చికాగోని మిస్ అవ్వలేదు అనిపిస్తోంది ఇది చూస్తుంటే..." అన్నాడు వరుణ్. ఒక్కొక్క లెవెల్ చూసుకుంటూ వెళుతున్నారు. థర్డ్ లెవెల్ దగ్గరకు వచ్చేసరికి ఒక్కసారిగా మౌనంగా అయిపోయాడు. ఎక్కడి నుంచో అదే పరిమళం, మళ్ళీ అతన్ని తాకింది. తనకు ఆపోజిట్ డైరెక్షన్‌లో వచ్చిందని గ్రహించాడు వరుణ్. అటుగా వెళ్ళాడు. బేబీ పింక్ కుర్తీ, జీన్స్ వేసుకున్న ఒక అమ్మాయిని వెనుకనుంచి చూశాడు. జుట్టు లూజ్‌గా వదిలేసింది. కొద్దిగా సైడ్ ప్రొఫైల్ మాత్రమే కనిపించింది. పూర్తిగా చూడలేకపోయాడు. "ప్చ్.. మిస్ అయిపోయింది" అనుకున్నాడు. అది చూసిన తేజ్ కళ్ళతోనే ఏంటి కథ అన్నట్టుగా చూశాడు. అరే ఏమీ లేదురా, అని కళ్ళతోనే వరుణ్ జవాబు చెప్పాడు.

"అదేంటి సడన్‌గా మాయమైపోయావు" అంది నేహ.

"ఏం లేదు" అంటూ ఏదోచెప్పి తప్పించుకున్నాడు.

ఇంతలో మిగతా ఫ్రెండ్స్ వచ్చారు. కొంచెంసేపు అక్కడే గడిపి అందరూ వెళ్ళిపోయారు.

ఇక రెండురోజులు పోయిన తరువాత, రెండిట్లో ఒక సంబంధం వాళ్ళు రమ్మని ఫోన్ చేశారు.

•••

"నేను పెళ్ళిచూపుల్లో బోలెడు ప్రశ్నలు వేస్తాను" అని తెగ హడావుడి పడుతోంది నేహ.

"ఏంటిది చిన్న పిల్లలా, అయినా పెళ్ళిచూపులు నాకు, నీకు కాదు అన్నాడు" వరుణ్. చెల్లెలితో మాట్లాడుతున్నాడేగానీ, అతని మనసులో ఎక్కడో అస్పష్టంగా ఓ రూపం, దాని తాలూకా పరిమళం మెదులుతున్నాయి. వరుణ్ వాళ్ళందరూ వెళ్ళేసరికి వాళ్ళింట్లో అప్పటికే ఓ పదిమంది దాకా ఉన్నారు.

పరిచయాలు పూర్తయ్యాయి. పెద్దవాళ్ళు ఒకళ్ళ డీటెయిల్స్ ఒకళ్ళు చెప్పుకున్నారు. ఆ అమ్మాయి పేరు శృతి. బీటెక్ చేసి మైక్రోసాఫ్ట్‌లో సీనియర్ ఇంజనీర్‌గా చేస్తోంది. ఒక్కతే అమ్మాయి అని చెప్పారు. అందంగా, మోడ్రన్‌గా ఉంది. జీన్స్ ఎల్లో టర్టల్ నెక్ టాప్ వేసుకుంది. ఆల్మోస్ట్ నేహ అంత పొడవు ఉంది. సరదాగానే ఉంది. సిబ్లింగ్స్ ఎవరూ లేరని తెలిసింది. 'వరుణ్‌కి మన ఇల్లు అంతా చూపించు' అని శృతికి పురమాయించాడు ఆమె ఫాదర్. నువ్వు కూడా వెళ్ళమ్మా అన్నాడు నేహతో. తండ్రిమాట విననట్టే శృతి వరుణ్‌ని ఒక్కడినే తీసుకువెళ్ళింది. నేహ మొహం చిన్నబోయింది గానీ, బావుండదని వాళ్ళ వెనకాలే నడిచింది. శృతి ఇల్లు అంతా చూపించింది. తన గదిలోకి తీసుకువెళ్ళింది. తనగది ఎంతో గమ్మత్తుగా ఉంది. పెద్ద షో కేసు. దాన్నిండా రకరకాల బొమ్మలు ఏజ్ వైజ్‌గా ఉన్నాయి. ఇంకో పక్క పాప్‌స్టార్స్ పోస్టర్స్, ఫుట్‌బాల్ ప్లేయర్స్ ఫోటోలతో నిండిపోయింది. ఏదో చూద్దామని నేహ తీయబోతుంటే వెనకాలే వచ్చి "ప్లీజ్ డోంట్ టచ్, నేనే ఇస్తా" అంది. ఆ విధంగా రెండు మూడుసార్లు అయింది. శృతి మాట్లాడుతుంటే, వరుణ్‌కీ, నేహకీ అర్థమైంది. శృతి ఎవరు చెప్పేదీ వినదు, తన మాటే మిగతావాళ్ళు వినాలి!

శృతి, వరుణ్ ఇద్దరూ వాళ్ళ జాబ్, ఎడ్యుకేషన్ వగైరాలన్నిటి గురించీ డీటైల్డ్‌గా మాట్లాడుకుంటున్నారు. మధ్యమధ్యలో నేహతో ఏదో చెప్పబోయేసరికి "అదేంటి వరుణ్, నేను ఇక్కడ ఉండగా మీ ఇద్దరూ ఎలా మాట్లాడుకుంటారు" అనేసింది శృతి.

ఆ మాటలు విని వాళ్ళిద్దరూ ఆశ్చర్యపోయారు. కానీ తనే తరువాత మాట కలిపేసరికి నెమ్మదిగా ముగ్గురూ కబుర్లలోకి దిగారు. పెద్దవాళ్ళు వచ్చి పిలిచేవరకు టైమ్ తెలియలేదు వాళ్ళకి. వెళ్ళేటప్పుడు ఫోన్ నెంబర్స్ ఎక్స్ఛేంజ్ చేసుకున్నారు. అయితే రవీంద్ర వాళ్ళతో ఒక వన్‌వీక్ టైమ్ కావాలని చెప్పాడు.

ఇంటికి వెళుతుండగా వసుధ ఫోన్ రింగ్ అయింది. రెండో సంబంధం వాళ్ళ దగ్గర నుండే ఆ ఫోన్. రేపు మీరు మా ఇంటికి పెళ్ళిచూపులకు రాగలరా? అని. వసుధ దానికి సమాధానంగా ఒక గంట తరువాత మీకు కాల్ చేస్తాను అని చెప్పింది.

ఇంటికి వెళ్ళాక అందరూ కూర్చుని మాట్లాడుకుంటున్నారు.

'వరుణ్, ఏమంటావు? నీకు శృతి నచ్చిందా? లేక ఇది కూడా చూద్దామా?"

"అమ్మా ఏంటి ఇది. ఒక బిజినెస్‌లా అనిపిస్తోంది. నచ్చటంలేదు నాకు ఈ ప్రాసెస్" అని చిరాకు పడ్డాడు. సరే టైమ్ తీసుకో అన్నాడు రవీంద్ర. కళ్ళతో వసుధకు మాట్లాడవద్దని సైగ చేశాడు. రవీంద్ర మొదటి నుండీ ఒకటే మాట మీద ఉన్నాడు. మీకు నచ్చితే నాకు నచ్చినట్టే అని. ఇక నేహమటుకు ఏదో ఆలోచిస్తూ ఉండిపోయింది. కొంచెంసేపు అయ్యాక, "మమ్మీ, డాడ్ నాకు శృతి నచ్చలేదు" అనేసింది.

"ఎందుకని" అదేమిటో ఫస్ట్‌లుక్‌లోనే నన్ను ఒక ఎనిమీలా చూసింది. అదీకాక తనకి షేరింగ్ అస్సలు తెలియదు. అందరూ తనమాటే వినాలి అనే పంతం కనిపించింది. తన బుక్స్‌యేవో తీయబోతుంటే మొహమాటం లేకుండా ముట్టుకోవద్దు అనేసింది" కోపంగా చెప్పింది.

"తప్పు అలా అనకూడదు. తను కూడా నీలాంటి అమ్మాయే కదా. రేప్పొద్దున నిన్ను కూడా ఇంకేదో అంటారు" అంది కూతురుతో వసుధ.

ఆ వెంటనే కొడుకువైపు తిరిగి, "వరుణ్ నీకు శృతి కనుక నచ్చితే చెప్పు, ఇక వేరే ఆలోచనలు లేకుండా లేదా రెండో సంబంధం కూడా చూశాక నీ నిర్ణయం చెబుతానన్నాసరే" అంది.

"అమ్మా రేపు వద్దు ఒక్కరోజు టైమ్ ఇవ్వు" అన్నాడు వరుణ్ కూల్‌గా.

సరే అలాగే కానీ అంది. అక్కడితో ఆ సంభాషణ ముగిసింది.

•••

మరునాడు పొద్దున్నే "వసుధా! మనం వెళ్ళిన ఇంజనీర్ చంద్రమోహన్‌గారు అదే శృతి ఫాదర్, సంబంధం డ్రాప్ అవుతున్నాం, సారీ అని చెప్పేశారు" అన్నాడు రవీంద్ర. "అదేమిటి కారణం ఏమీ

## 70 సినిమాలు వదులుకున్న రాశి

ఒక్కో హీరోయిన్ తన కెరీర్ మొత్తంలో 50, 60సినిమాలు చేయడమే గగనమవుతున్న ఈ రోజుల్లో రాశీఖన్నా రెండు సంవత్సరాలలో ఏకంగా 70 సినిమాలు వదులుకుందట! ఈ విషయం స్వయంగా రాశినే చెప్పుకొచ్చింది. రెండు సంవత్సరాలుగా తనకు ఏ కథా నచ్చడం లేదనీ, దాదాపు 70సినిమాల్లో అవకాశాలు వచ్చినా, పై కారణంగానే వదులుకున్నాననీ చెప్పుకొచ్చింది. అవకాశాలు రావడమే గగనమవుతుంటే అన్ని సినిమాలు వదులుకున్నాను అని అంటున్న రాశి మాటలు నిజమేనా? అని టాలీవుడ్ జనాలు ఆశ్చర్యం వ్యక్తం చేస్తున్నారు.

లేకుండానా?"

"లేదులే కారణం చెప్పారు. అమ్మాయి అంతగా ఇంట్రెస్టింగ్‌గా లేదని. ఐ థింక్ మీ వరుణ్ కూడా అదే అభిప్రాయంతో ఉన్నాడని మా అమ్మాయి చెప్పింది అని కూడా అన్నారు.

"అయ్యో అదేంటి?" అంది వసుధ.

'ఏరి ఉండు వాళ్ళిద్దరినీ పిలుద్దాం. వరుణ్, నేహ ఇలా రండి" అని పిలిచాడు.

"డాడ్ మేం ఇక్కడే ఉన్నాం" అని ఇద్దరూ ఒకేసారి అన్నారు.

"సో, అంతా విన్నారు కదా?" అన్నాడు రవీంద్ర.

"ఆ విన్నాను డాడ్. శృతి నాకు మెసేజ్ చేసింది, ఇదే మేటర్. ఇన్‌ఫాక్ట్ నిన్నటినుంచి ఇద్దరం చాలా టెక్స్ట్ మెసేజ్‌లు చేసుకున్నాం. ఎందుకో మా ఇద్దరికీ థాట్స్ జెల్ అవలేదు. మొత్తానికి అవుట్‌పుట్ ఏంటంటే, ఇద్దరికీ సరిపోలేదు. ఆ విషయం నేనే మీకు చెబుదామనే లోపల మీరే చెప్పారు. నేను తనవైపు నుంచి కూడా ఆలోచించాను. సింగిల్ చైల్డ్ కదా. మేబీ చిన్నప్పటి నుండి షేరింగ్ తెలియదు. అందుకే అడ్జెస్ట్‌మెంట్ మెంటాలిటీ తెలియదు. సో మేబీ అదే రీజన్. బెటర్ ఇద్దరం ఫ్రెండ్స్‌గా ఉందామని, ఈ పెళ్ళి ప్రపోజల్ డ్రాప్ అవుదామని ఫ్రాంక్‌గా ఏదీ దాచిపెట్టుకోకుండా చెప్పేసుకున్నాం" అన్నాడు.

నిజానికి డ్రాప్ అవుదామని శృతివైపు నుంచే ప్రపోజల్ రావడం వరుణ్‌కి చాలా రిలీఫ్‌గా అనిపించింది. దానితో ఆ పరిమళం తాలూకు రూపం గురించి మళ్ళీ ఆలోచనలో పడ్డాడు. నిజానికి ఎలా ఉంటుందో తెలియదు. అయినా ఎందుకో మనసులో గట్టిగా అనిపించింది, తప్పకుండా తనకి ఆమె కనిపిస్తుందని.

"సరే ఇంకా ఈ సంబంధం గురించి మరచిపోదాం. మరి రెండో సంబంధం వాళ్ళకి ఎప్పుడు వస్తామని చెబుదాం" వసుధ అడిగింది.

"అమ్మా ప్లీజ్! ఈ సంబంధాల విషయం వదిలెయ్. అందరం బైటకు వెళదాం" అంటూ వసుధ మీద విసుక్కున్నాడు వరుణ్. రవీంద్ర నెమ్మదిగా వసుధతో అన్నాడు "ఒక రెండు రోజులు వాణ్ణి వదిలేయ్" అని.

ఇంతలో నేహ వచ్చి "అన్నయ్యా మనం ఇనార్బిట్‌మాల్‌కు వెళదాం" అంది. ఓకే అయితే, మమ్మీని కూడా తీసుకువెళదాం, లేకపోతే ఇంట్లో కూర్చుని సెర్చ్‌ఇంజిన్‌లా అన్ని మాట్రిమోనీసైట్స్ వెదుకుతూ ఉంటుంది" అన్నాడు.

"వరుణ్ దిస్ ఈజ్ టూ మచ్" అంది వసుధ.

"మమ్మీ ఈ రోజు నాది! నేను ఎక్కడకు తీసుకువెళ్ళినా నన్ను అస్సలు క్వశ్చన్ చేయొద్దు" అని కండిషన్ పెట్టాడు. వరుణ్ మాటలకు "ఎస్ ఎస్" అంటూ వంత పాడింది నేహ.

"ఓకే బై. తల్లీ పిల్లలూ ఎంజాయ్ చెయ్యండి" అంటూ రవీంద్ర ఆఫీస్‌కు వెళ్ళిపోయాడు. వీళ్ళ ముగ్గురితోపాటు తేజ్ కూడా వచ్చాడు. అందరూ హైటెక్ సిటీలో ఉన్న ఇనార్బిట్‌మాల్‌కి వెళ్ళారు. "ఇదిగో ప్రోగ్రాం చెబుతున్నా. ముందు షాపింగ్, ఆ తర్వాత లంచ్, లాస్ట్‌లో సినిమా" అని లిస్ట్ చదివాడు వరుణ్. "చాలా! ఇంకా ఏమైనా ఉందా?" అని నవ్వింది వసుధ.

"ఆంటీ, మీరు మాతో కలిసిపోతారు అందుకే ఈ ప్రోగ్రాం" అన్నాడు తేజ్ వసుధతో. "బాబూ నన్ను మునగచెట్టు ఎక్కించకు. మావాళ్ళు చూస్తే ఇది పిల్లలతోపాటు అన్నిచోట్లకీ తిరిగేస్తోంది అనుకుంటారు" అంది. ఆ మాటకు ముగ్గురూ పడీపడీ నవ్వారు. అందరూ షాపింగ్ చేసుకుని లంచ్ కానిచ్చి ఇంకా మూవీ చూసేందుకు వెళుతున్నారు. ఇంతలో వరుణ్‌కి చిరపరిచితమైన పరిమళం మళ్ళీ అతని నాసికలను తాకింది. వెంటనే గిర్రున పక్కకు చూశాడు. ఇద్దరు ఆడపిల్లలు స్క్రీన్-1లోకి వెళుతున్నారు. గబగబా ముందుకు వెళ్ళబోతుంటే, వరుణ్ ఇలా రా అని పిలిచాడు తేజ్. మళ్ళీ ఇటు తిరిగి చూసేసరికి ఆ అమ్మాయి కనిపించలేదు. అబ్బ... మళ్ళీ మిస్ అయింది అని ఫీలైపోయాడు. అందరూ లోపలికివెళ్ళి కూర్చున్నారు.

ఇంతలో వెనుకలైనులో ఇద్దరు అమ్మాయిలు మాట్లాడుకుంటున్నారు. "ఏయ్ ఏమైందే, నీ మ్యాచ్ సంగతి" అని ఒక గొంతు ప్రశ్నిస్తే, "ఊ! వాళ్ళు రేపు వస్తున్నారట, మమ్మీ చెప్పింది" అంది మరో గొంతు. "ఫోటో చూశావా?" "ఆ చూశాను" "ఎలా ఉన్నాడు?" "బావున్నాడు రణబీర్‌లా" "అవునా, ఎంతమంది సిబ్లింగ్స్ ఉన్నారు?"

"ఆ ఆ ఒక సిస్టర్. తను కూడా ఇంజనీరింగ్ చేస్తోంది ఎంజిఐటిలో".

"పోనీలే కొన్ని ఫీలింగ్స్ సేం ఏజ్ వాళ్ళతోనే షేర్ చేసుకోగలం" "అవును, అదే అనుకున్నా ఈ సంబంధం కుదిరితే బావుండును. ఎందుకంటే, మా ఇంట్లో నేను ఒక్కదాన్నే కదా, చాలా లోన్లీగా ఫీల్ అయ్యేదాన్ని. అందుకే ఎక్కువగా కజిన్స్‌తో స్పెండ్ చేయడానికి ఇష్టపడేదాన్ని. నాకు బ్రదర్ గానీ, సిస్టర్‌గానీ ఉంటే ఎంత బాగుండేది అని పిస్తుంది ఒక్కోసారి. అందుకే ఎట్‌లీస్ట్ నా లైఫ్ పార్ట్‌నర్ అస్సలు సింగిల్ చైల్డ్ అయి ఉండకూడదు అనుకున్నా" అంది.

ఈ మాటలు ముందు వరుసలో కూర్చున్న నేహ, వరుణ్‌లతో పాటు వసుధ కూడా వింది. ముగ్గురూ ఒకళ్ళ మొహాలు ఒకళ్ళు చూసుకున్నారు. ఇంతలో మెయిన్ మూవీ స్టార్ట్ అవబోతున్నట్టు లైట్స్ ఆఫ్ అయ్యాయి. ముగ్గురికీ కూడా మూవీ కన్నా, వెనకాల కూర్చున్న అమ్మాయిని చూడాలని తొందరపడుతున్నారు. ఇంటర్వెల్ అవడమేంటి, ముందు నేహ వెనక్కి తిరిగిచూసి తల్లికి, అన్నగారికి కూడా అది మనం అనుకుంటున్న రెండో సంబంధం అమ్మాయి అనీక అని గుసగుసగా చెప్పింది. అప్పుడు వసుధ వెనక్కి తిరిగి చూసింది. ఇక వరుణ్ చూద్దామనుకునేసరికి ఆ అమ్మాయి అప్పుడే లేచి కిందకు వెళుతోంది. అప్పుడు వచ్చింది గుప్పున ఆ పర్‌ఫ్యూమ్. కుర్చీలో కిందకు వాలిపోయి చూస్తున్నవాడు సడన్‌గా "ఈ అమ్మాయిదే ఆ పరిమళం! అంటే నాకు ఎప్పుడూ కనిపించకుండా మాయమవుతున్న అదృశ్య సుందరి తానేనా? అంటే నేను వచ్చిన రోజునే తను కూడా ఇండియా వచ్చి ఉంటుంది. "రియల్లీ ఇట్స్ మోర్ దెన్ ఎ మియర్ కోఇన్సిడెన్స్" అనుకున్నాడు. కొంచెంసేపయ్యాక సీట్లో కూర్చోబోతున్న




## శ్రమ పూజారులు

మా ఊరి బస్టాండు కూడలిలో
మల్లెపువ్వులు అమ్మేవారు ఉంటారు
దారి పొడవునా బాటసారులకు
స్వాగతం పలుకుతున్నట్లుగా
పూలచెండ్లతో చాచిన వారి చేతులు
పూచిన కొమ్మల్లా ఉంటాయి

పక్కన సంచీలో
దారపుతీగ మొగ్గలు వేసినట్లుగా
బంతులుగా చుట్టబడిన సరాలు
దొంతరగా అమరి ఉంటాయి
ఆ ప్రాంతమంతా మల్లెతోటలా పరిమళిస్తుంది
ఎండలో గంటలకొద్దీ
అలా నిలబడే ఉంటారు
ముచ్చటగా పిలుస్తూ
మూరలు వేసి కొలుస్తూ ఉంటారు
కొలిచేకొద్దీ కాలం గడిచేకొద్దీ వారి ముఖాలు
మరుమల్లెల్లా వికసిస్తాయి చిరునవ్వులు చిగురిస్తాయి
ఎండ వారి ముందు దండగై పోతుంది
సిగ్గుపడి సూర్యుడు అస్తమిస్తాడు
పూల బంతులు ఒక్కొక్కటిగా మాయమవుతాయి



వారి శ్రమపూజను దేవత అనుగ్రహిస్తుంది
వారి సంచీలో లక్ష్మీదేవి ప్రత్యక్షమవుతుంది.

**-చిరమన వెంకట రమణయ్య**
**సెల్:94413 80336**

ఆమెని, తన కళ్ళ కెమేరాతో వరుణ్ చూసేశాడు. ఫోటోలోకన్నా బావుంది. కళ్ళు భలే ఉన్నాయి. ఆ అమ్మాయి చూపు ఇతనిమీద పడే సమయానికి లైట్లు ఆఫ్ అయ్యాయి. మూవీ స్టార్ట్ అయ్యింది. అమ్మయ్య బతికాను, లేకపోతే గుర్తుపట్టేసేది అనుకున్నాడు. "ఇప్పుడు ఎవరూ మాట్లాడవద్దు, తనను మనం సర్‌ప్రైజ్ చేద్దాం అన్నయ్యా" అంది నేహ. సరే అన్నాడు. ఈ హడావుడి గమనించి "ఏమైందిరా" అన్న తేజ్‌కి చెప్పాడు అనీక వెనకాలే ఉందని. వీళ్ళ మాటలకు పక్కవాళ్ళు డిస్ట్రబ్ అవుతున్నారని గమనించి మౌనంగా సినిమా చూడటంలో మునిగిపోయారు. సినిమా అయిపోయాక ఆ జనంలో అనీక, ఆమె ఫ్రెండ్ ఎటు మాయమైపోయారో కనిపించలేదు. నిజానికి వీళ్ళు కూడా చూడాలని అనుకోలేదు, తను ఇబ్బంది పడుతుందని.

ఇంటికి వెళ్ళిన వెంటనే వసుధ రవీంద్రకి ఆ అమ్మాయి కనిపించిన సంగతి, అనీక మాట్లాడిన




మాటలు గురించి చెప్పింది. ఇద్దరూ తల్లిదండ్రులకు ఒక్కరే సంతానం. అయినా ఇద్దరి మనస్తత్వాలు భిన్నంగా ఉన్నాయి. కాబోయే భర్త, అతని కాన్సంట్రేషన్ అంతా తన ఒక్కదానిమీదే చూపాలన్న చిన్నపిల్లలతత్వం శృతిదైతే, అదే విషయాన్ని నాణానికి అవతలివైపు తరహా అనీకది. తనకు ఏదైతే మిస్ అయిందో అది నేహ, వరుణ్‌ల మధ్య ఉండటం చూసి పెళ్ళైన తర్వాత తన ఇంపార్టెన్స్ ఉండదేమో, ఇగ్నోర్ చేస్తారేమో అనే భయంవల్ల శృతి ఇంట్రెస్ట్ చూపించలేదు.

అదే అనీక విషయంలో ప్లస్ పాయింట్ అయింది. తను ఏదైతే మిస్ అయ్యాను అనుకుంటోందో అది కాబోయే పార్ట్‌నర్ ద్వారా పొందుదాం అనుకుంది. ఇద్దరూ భిన్న దృక్పథం గలవాళ్ళు.

"ఇంత స్టడీ ఎప్పుడు చేశావోయ్" అన్నాడు రవీంద్ర.

"నేను ఒకప్పటి స్కూల్ టీచర్ అన్న సంగతి మరిచిపోతున్నారు. ఛైల్డ్ సైకాలజీ తెలిసిన దానిగా నాకు అర్థమైంది మొదటి అమ్మాయి ఫీలింగ్. తను అందులోంచి బైటకు రాలేకపోతోంది. ఈ రెండో అమ్మాయి అనీక ఆ సింగిల్ ఛైల్డ్ మెంటాలిటీ నుండి బైటపడటానికి ప్రయత్నం చేస్తోంది. అదీ వాళ్ళిద్దరి మధ్యా తేడా.

మరి వరుణ్‌కి ఆ అమ్మాయి నచ్చుతుందా?

"వాడికా? ఎప్పుడో ఫిదా అయిపోయాడు ఆ పిల్లకి. నేను గమనిస్తూనే ఉన్నాను" అంది.

"అమ్మ వసుధా! అత్తగారు అవుతున్నాకూడా నీలో చిలిపితనం పోలేదన్నమాట! సో అయితే అనీక కోడలి పోస్ట్‌కి సెలెక్టెడ్ అన్నమాట" సంతోషంగా అన్నాడు రవీంద్ర.

"అవును. నేహకన్నా కూడా నేను వచ్చే కోడల్ని ఎక్కువ ప్రేమించాలి. ఎందుకంటే రోజూ కలిసి ఉండేవాళ్ళం. మా ఇద్దరిమధ్య స్నేహం, ప్రేమ లేకపోతే పాతతరం వాళ్ళలాగే ఉంటాం. నాకేం తక్కువైందని ఆ అమ్మాయి స్పేస్‌ని లాక్కోవాలి. ఇలాంటివి ఫేస్ చేసే లైఫ్‌లో ఈ స్టేజ్‌కి వచ్చాను. మళ్ళీ నేను కూడా సేమ్ ఓల్డ్ అత్తగారిగా ఉండదల్చుకోలేదు. మన నేహతో సమానంగా కోడల్నీ చూస్తాను. అంటే తను డ్రెస్ వేసుకోవడం దగ్గర నుంచి మాట్లాడటం వరకు అన్ని కూడా, ఈ ఇల్లు తనది అనే కంఫర్ట్ ఇవ్వాలని నా ఫీలింగ్. సో అందుకు తగ్గట్టుగా నేను కూడా పిల్లలతో కలిసిపోతే వాళ్ళని వేరుగా చూస్తున్నామనే ఫీలింగ్ ఉండదు. ఇవన్నీ నేను వరుణ్‌కి సంబంధాలు చూడటం మొదలు పెట్టినప్పటినుంచీ ఆలోచిస్తున్నాను" అంది వసుధ.

"మమ్మీ హియర్, హియర్" వరుణ్, నేహ అనేసరికి "దొంగల్లాగా చాటుగా విన్నారా" అంటూ సిగ్గుగా నవ్వింది వసుధ. "మా మమ్మీ మంచిది" అంటూ ఇద్దరూ తల్లిని చుట్టేశారు.

సరే టైమ్ ఎంతైంది అని చూస్తే రాత్రి తొమ్మిది గంటలు. పర్వాలేదు ఫోన్ చెయ్యొచ్చు. అనుకుని వసుధ రవీంద్రని అనీక పేరెంట్స్‌కి ఫోన్ చెయ్యమంది. ముందు వద్దన్నా వెంటనే కమ్యూనికేట్ చేయడం మంచిదనిపించి చేశాడు. అవతల నుంచి భాస్కర్ హియర్ అని వినిపించగానే, రవీంద్ర మాట్లాడటం మొదలుపెట్టాడు. ఆ తరువాత వసుధకి ఇచ్చాడు. వసుధ అనీక అమ్మతో మాట్లాడింది. "మీ అమ్మాయిని ఇనార్బిట్‌మాల్ స్క్రీన్ వన్‌లో పెళ్ళిచూపులు చూసేశాం. మా అబ్బాయి ఫోటో నచ్చిందని మీ అమ్మాయి చెబుతోంది. ఇక అనీక నోట్లోంచి ఎస్ అనే మాట వస్తే మావైపు నుంచి అంతా ఓకే అని చెప్పింది. అవతలవాళ్ళు సంతోషంతో తబ్బిబ్బు అవుతూ, మరునాడు పొద్దున్నే ఇంటికివచ్చి అన్నీ వివరంగా మాట్లాడుకుంటాం అని చెప్పారు.

ఇదంతా వింటున్న వరుణ్‌కి తను ఇలా ఇండియా పెళ్ళికూతుర్ని సెలెక్ట్ చేసుకోవడానికి వెళుతున్నాను అని చెప్పగానే అక్కడ తన బెస్ట్ ఫ్రెండ్ కం కొలీగ్ విశాల్ చెప్పిన మాటలు గుర్తుకు వచ్చాయి. "దేనికీ టూ మచ్ ఎక్స్‌పెక్టేషన్స్ పెట్టుకోవద్దు. రియలిస్టిక్‌గా ఆలోచించు. అందం గురించి ఆలోచించుగానీ, మరీ అతిలోక సుందరి దిగిరావాలని అనుకోవద్దు. ఇంకో ముఖ్యమైన సంగతి ఈ అరేంజ్డ్ మ్యారేజ్‌లో అమ్మాయి గురించిగానీ, అబ్బాయి గురించి గానీ వివరంగా తెలుసుకోవాలి. హడావుడి పడొద్దు. లాస్ట్ సంగతి నీ మైండ్ ఆప్షన్స్ అన్నీ ఓపెన్‌గా ఫ్లెక్సిబుల్‌గా ఉంచుకుంటే ఫ్యూచర్‌లో ప్రోబ్లెమ్స్ రావు" అని చెప్పాడు.

•••

అన్ని విషయాలు మాట్లాడుకుని పెళ్ళి ముహూర్తాలు మూడునెలల తర్వాత పెట్టుకున్నారు.

అనీక, వరుణ్ ఒకరికొకరు తెగ నచ్చేశారు. నేహ, అనీక అయితే ఇంక జత విడవటం లేదు. వరుణ్ మొత్తుకుంటున్నాడు. అది చూసి వాళ్ళిద్దరూ ఏడిపిస్తున్నారు. అతన్ని, అనీకకి ఇలా అందరితో కలవడం, చాలా సరదాగా ఉంది. కాబోయే అత్తగారింటికి తన ఇంటికి తేడా లేదు. చాలా కంఫర్ట్‌గా ఫీల్ అవుతోంది. అనీక తల్లిదండ్రులు కూడా చాలా ఆనందంగా ఉన్నారు.

అనీక ముందురోజు డెట్రాయిట్‌కి వెళ్ళిపోయింది. ఇంక వరుణ్ బయలుదేరుతుంటే రవీంద్ర కొడుక్కి కొన్ని విషయాలు చెప్పాడు. "మనం తల్లిదండ్రులనుగానీ, తోబుట్టువులనుగానీ, పిల్లలనుగానీ దేశం, కులం, మతం వీటిలో దేన్నీ ఎంచుకోం. అయినా మనం వీటన్నింటినీ ఎంతగా ప్రేమిస్తామో కదా! అలా చూసుకున్నప్పుడు నీ జీవితంలోకి అప్పటివరకు తెలియని ఒక అమ్మాయిని స్నేహంతో ప్రేమతో ఆహ్వానించినప్పుడే నీ సెలక్షన్ అద్భుతంగా ఉంటుంది" అన్నాడు. అలాగే ఇంట్లోవాళ్ళం అందరం కూడా ఇంటికి వచ్చిన అమ్మాయికి ఇదీ తన ఇల్లే అనే భావన కలిగించాలి. అప్పుడు ఏ గొడవలు తలెత్తినా ఈ బాండింగ్ ఉండటంవల్ల అవి పెద్దవిగా కనిపించవు. హ్యాపీ మ్యారేజెస్ ఆర్ బేస్డ్ ఆన్ ఏ డీప్ ఫ్రెండ్‌షిప్" అని చెప్పాడు రవీంద్ర. ఇక తర్వాత వరుణ్ అందరికీ బై చెప్పి అమెరికా బయలుదేరాడు. ఫ్లయిట్‌లో కూర్చుని జరిగిన సంగతులన్నీ నెమరువేసుకుంటున్నాడు. అనీక ఇచ్చిన ఎంగేజ్‌మెంట్ రింగ్‌ను అభిమానంగా తడుముతూ ఎనీ వే, సెలక్షన్ నాకు చాలా శాటిస్ఫాక్షన్ ఇచ్చింది అని తృప్తిగా అనుకున్నాడు వరుణ్.

***సెల్: 09652 067891***

# హెపటైటిస్, హెర్పిస్‌ల కట్టడి

**హెపటైటిస్** వైరస్ శరీరంలోకి ప్రవేశించిన వెంటనే లక్షణాలు బయటపడవు. రోగలక్షణాలు కనిపించడానికి చాలా ఏళ్లు పడుతుంది. కొంతమందిలో వైరస్ సోకిన 4 వారాలు లేదా 12 వారాల తరువాత కొన్ని రోగలక్షణాలు బయటపడతాయి. వైరస్ ఎప్పుడైతే కాలేయంపై దాడి చేస్తుందో అప్పుడు లక్షణాలు బయటపడతాయి. అంతవరకు ఇది సోకిన విషయం తెలియదు. ఆకలి తగ్గిపోవడం, వాంతులు, మూత్రం పచ్చగా రావడం, కళ్లు పసుపుపచ్చగా మారడం, జ్వరం, ఒళ్లు నొప్పులు అధికంగా ఉండటం వంటి లక్షణాలు కనిపిస్తాయి. హెపటైటిస్-బి ఉన్న కొందరిలో లివర్ ఫెయిల్యూర్‌కు దారితీస్తుంది. కొన్ని ఏళ్ల నుంచి వైరస్ ఉన్నవారిలో కాలేయం క్రమంగా దెబ్బతింటూ లివర్ సిర్రోసిస్‌కు దారితీయవచ్చు లేక లివర్ క్యాన్సర్‌గా మారవచ్చు.

### హెర్పిస్ సింప్లెక్స్

పురుషాంగంపైన చెమట పొక్కుల మాదిరిగా నీటి పొక్కులు కనిపిస్తాయి. నీటిపొక్కులు ఎర్రగా ఉండి దురద ఉంటుంది. నీటిపొక్కులు పగిలిపుండు పడుతుంది. ఈసమయంలో చికిత్స తీసుకోకపోతే ఇతరులకు సోకే ప్రమాదం ఉంది. లైంగిక కలయిక ద్వారా సంక్రమించే ఈ వ్యాధిని హెర్పిస్ అని అంటారు. స్త్రీలలో కూడా యోని మీద చిన్న చిన్న పొక్కులలాగా వచ్చి ఎర్రగా మారి నొప్పిని కలిగిస్తాయి.

**హోమియో చికిత్స :** హెపటైటిస్, హెర్పిస్‌వ్యాధులను సమర్థవంతంగా అడ్డుకునే చికిత్స హోమియోలో ఉంది. వైరల్‌లోడ్‌ను పూర్తిగా తగ్గించడం ద్వారా ఆరోగ్యవంతమైన జీవనం గడిపే అవకాశం దక్కుతుంది. హోమియో చికిత్స అనంతరం వ్యాధి మళ్లీ తిరగబెట్టదు.

# సైనసైటిస్, టాన్సిల్స్‌కు శాశ్వత చికిత్స

**సైనసైటిస్, టానిల్స్..** రెండు వేరు వేరు వ్యాధులైనా రెండింటికి సంబంధం ఉంది. దీర్ఘకాలంగా సైనసైటిస్‌తో బాధపడుతున్నప్పుడు టాన్సిల్స్ సమస్య ఉత్పన్నమయ్యే అవకాశం ఉంటుంది. గొంతులో రక్షకభటుల్లాగా ఉండి బ్యాక్టీరియా, వైరస్, ఫంగస్ వంటి వ్యాధికారక క్రిములు శరీరంలోకి ప్రవేశించకుండా నిరోధిస్తూ దేహరక్షణకు తోడ్పడే లింఫ్ కణజాల సమూహమును టాన్సిల్స్ అంటారు. ముక్కుకు ఇరువైపులా ఉండే గదులను సైనస్‌లంటారు. టాన్సిల్స్ వాపు పిల్లల్లో సాధారణంగా కనిపించే సమస్య.

**లక్షణాలు :** తరచు జలుబు చేయడం, జలుబుతో ఎక్కువ రోజులు బాధపడటం అనేది సైనస్ వ్యాధి ప్రాథమిక లక్షణం. ఆ తరువాత దశలో జలుబు చేసినపుడు ముక్కులు బిగదీసుకుపోతాయి. తల అంతా బరువుగా ఉంటుంది. టాన్సిల్స్ వాపు ఉంటే గొంతునొప్పి, నోటి దుర్వాసన, గురక ఎక్కువగా పెట్టడం కనిపిస్తుంది. ప్రతి పది, పదిహేనురోజులకొకసారి దగ్గు, జలుబు లక్షణాలు కనిపిస్తాయి. వీటితోపాటు జ్వరం కూడా ఉంటుంది. గొంతునొప్పి ఉంటుంది. ఒక్కోసారి నొప్పి చెవి వరకు విస్తరిస్తుంది.నోటిలో దుర్వాసన వస్తూ ఉంటుంది. గురక, నిద్రలో నోటితో గాలిపీల్చుడం వంటి లక్షణాలు కనిపిస్తాయి. ఆహారం మింగడం కష్టమవడం వంటి లక్షణాలు ఉంటాయి

### హోమియోతో దూరం

మూలకారణాన్ని తొలగించే విధంగా హోమియో వైద్యం ఉంటుంది. హోమియో చికిత్స తరువాత వ్యాధి తిరిగి రావడం అంటూ జరగదు. హోమియో మందుల్లో ఎటువంటి దుష్ప్రభావాలు ఉండవు. హోమియోతో సైనసైటిస్, టాన్సిల్స్ శాశ్వతంగా తగ్గుతాయి.


**Dr. K Ravikirane**

M.D.,M.sc(psych), P.G(virology)LONDON

గోల్డ్‌మెడల్ ఫర్ ఎక్సలెన్సీ ఇన్ మెడిసిన్

మాస్టర్స్ హోమియోపతి

అమీర్‌పేట్, కూకట్‌పల్లి, దిల్‌సుఖ్‌నగర్, హైదరాబాద్, విజయవాడ, కరీంనగర్, విశాఖపట్నం,తిరుపతి

ఫోన్ : 7842 106 106, 9032 106 106




V6లో ప్రతి మంగళవారం మధ్యాహ్నం 2:30కి

సాక్షిలో ప్రతి శనివారం మధ్యాహ్నం 2:30కి

10టీవీలో ప్రతి ఆదివారం మధ్యాహ్నం 3:30కి డాక్టర్‌గారి లైవ్ కార్యక్రమం ఉంటుంది.

# హెచ్ఐవి సోకినా జీవితం ఉంది

**హెచ్ఐవికి** చికిత్స లేదా? హెచ్ఐవి సోకితే మరణమేనా! అంటే కానే కాదు. హెచ్ఐవి సోకినా అందరిలాగే సాధారణ జీవితం, ఆరోగ్యవంతమైన జీవితం గడపవచ్చు. ఎప్పటికీ ఎయిడ్స్‌గా మారకుండా చూసుకోవచ్చు. ఒక్కమాటలో చెప్పాలంటే హెచ్ఐవి వైరస్‌ను హోమియో మందులతో కట్టడి చేయవచ్చు.

### లక్షణాలు కనిపించడానికి....

హెచ్ఐవి శరీరంలోకి ప్రవేశించగానే ఎటువంటి మార్పులు కనిపించవు. కొన్ని సంవత్సరాల తరువాత వ్యాధికి సంబంధించిన లక్షణాలు ప్రారంభమవుతాయి. అంటే సీడీ 4 కణాల సంఖ్య తగ్గిపోయిన తరువాత వ్యాధి లక్షణాలు కనిపిస్తాయి. హెచ్ఐవి శరీరంలో ప్రవేశించిన తరువాత ఎన్ని రోజులకు బయటపడవచ్చని అనేది వారి ఆహారపు అలవాట్లు, ఆరోగ్యస్థితి, ఇతర వ్యాధులపై ఆధారపడి ఉంటుంది. కొందరిలో ఐదారేళ్లకే సీడీ 4 కణాలు బాగా తగ్గిపోయి ఇన్‌ఫెక్షన్లు మొదలవుతాయి. మరికొందరిలో పదేళ్లు పడుతుంది.

### హోమియో చికిత్స ఎలా పనిచేస్తుంది

హోమియో మందుల వల్ల సీడీ 4 కణాల సంఖ్య గణనీయంగా పెరుగుతుంది. అవకాశవాద ఇన్‌ఫెక్షన్లకు చోటు లేకుండా పోతుంది. ఆకలి బాగా పెరగడంతో బరువు పెరగడం ప్రారంభిస్తారు. హెచ్ఐవి అని తెలియగానే మరణం తప్పదనే భావనలో ఉంటారు. కానీ అది నిజం కాదు. హోమియో చికిత్స తీసుకోవడం ద్వారా అందరిలాగే సాధారణ జీవితం గడిపే అవకాశం లభిస్తుంది. హెచ్ఐవి ఎయిడ్స్‌గా మారకుండా నిరోధించవచ్చు.. ఒకసారి హెచ్ఐవి సోకాక దాన్ని పూర్తిగా తొలగించే మందులు లేవు. అయితే హోమియో మందులతో వైరస్‌ల సంఖ్య అతి తక్కువ స్థాయికి చేరుకునేలా చేయవచ్చు.

# నడుంనొప్పితో జీవితం నరకమేగా?

**నడుం** నొప్పి మూలంగా ఏ పనీ చేసుకోలేకపోతారు. ఉదయం వేళ నొప్పి తీవ్రంగా ఉంటుంది. నొప్పి క్రమంగా నడుము నుంచి కాళ్లలోకి విస్తరిస్తుంది. దీర్ఘకాలంగా బాధపడే వారిలో శృంగార సమస్యలు కూడా ఎదురవుతాయి. కొందరిలో నొప్పి నడుం నుంచి మోకాళ్లు, పిక్కల ద్వారా అరికాళ్లు, కాలివేళ్ల దాకా వ్యాపిస్తుంది. దీన్ని సయాటికా అంటారు. వెన్నులో ప్రతి రెండు వెన్నుపూసల మధ్య కొంత ఖాళీ ప్రదేశం, ఒక సయాటిక్ నరం, పూసలను బంధించి ఉంచే కొన్ని కండరాలు ఉంటాయి. మన దైనందిన పనుల్లోని కొన్ని లోపాల వల్ల కొందరిలో ఈ పూసలను బంధించి ఉంచే కండరాలు బలహీనమవుతాయి. ఫలితంగా పూసల మధ్య సహజంగా ఉండవలసిన ఖాళీ తగ్గిపోతుంది. దీనివల్ల పూసల మధ్య ఉండే సయాటికా నరం ఒత్తిడికి లోనవుతుంది. దీనివల్ల ఆ నరం శరీరంలో ఎంత దూరం వెళితే అంత దూరం నొప్పి వస్తూనే ఉంటుంది.

**లక్షణాలు :** చాలా మందిలో కుడి వైపు నొప్పి ఎక్కువగా వస్తుంది. నడుము నొప్పి రావడం, కొద్దిగా శారీరక శ్రమ చేయగానే నొప్పి తీవ్రత పెరగడం, మొదట నడుము భాగంలో మొదలై క్రమేణా తొడ వెనక భాగానికి పాకుతుంది. తరువాత మోకాళ్లు, పాదాల చివరకు, పిక్కలు, మడమలకు వ్యాపిస్తుంది. కరెంట్ షాక్ కొట్టినట్లు నొప్పి వస్తుంది. తిమ్మిర్లు, మంట వంటి లక్షణాలు ఉంటాయి. కొన్నిసార్లు నడవడానికి, కూర్చోవడానికి, పడుకోవడానికి చాలా ఇబ్బంది పడాల్సి వస్తుంది.

**హోమియో చికిత్స :** నొప్పి ఏదైనా సమూలంగా తగ్గాలంటే హోమియో చికిత్స ఒక్కటే మార్గం. లుంబార్ స్పాండిలోసిస్, సయాటికా సమస్యలకు హోమియోలో అద్భుతమైన చికిత్స అందుబాటులో ఉంది. హోమియో మందుల ద్వారా నడుము నొప్పి, సయాటికా సమస్యను పూర్తిగా దూరం చేయవచ్చు.



**అపరంజి ఆప్యాయతతో అందించిన వేడిపాలను తాగేసి, పానపాత్ర ఆమెకు ఇచ్చాడు నంది.**

**"రాత్రి చక్కగా నిద్ర పట్టిందా, నాయనా?" అపరంజి అడిగింది.**

**నంది చిరునవ్వు నవ్వాడు. "భోజనశాలలో చేసిన వ్యాయామంతో శరీరం కొద్దిగా అలిసింది. ఆ అలసటతోనే ఒళ్ళు తెలీకుండా నిద్రపోయాను.."**

"నా పెనిమిటి నిన్ను చూడాలంటున్నారు. ఒకసారి రా నాయనా.."

"నేను కూడా ఆయనను చూడాలనుకుంటున్నాను" నంది కూచున్న చోటు నుండి లేచాడు.

మెట్లు దిగి చాలా విశాలంగా ఉన్న పడసాలలోకి వచ్చాడు నంది. చతురస్రాకారంగా ఉన్న పడసాలలో రెండువైపులా చాలా గదులున్నాయి. దక్షిణం వైపు మూలలో ఉన్న గుమ్మం వంటశాలలోకి దారి తీస్తోంది. పడమర వైపున్న గుమ్మం లోంచి భోజనశాల కనిపిస్తోంది. గోడ మధ్య తూర్పు వైపున పెద్ద ద్వారబంధం, బలంగా కనిపిస్తున్న తలుపూ ఉన్నాయి. అపరంజి నందిని నైరుతి దిశలో ఉన్న గదిలోకి తీసుకెళ్ళింది. గది మధ్యలో మంచం. మంచంమీద ఒడ్డూ పొడుగూ ఉన్న వ్యక్తి వెల్లకిలా పడుకుని ఉన్నాడు. అతని గడ్డం మాసి ఉంది. తలగడకి ఆనుకుని పడుకున్న అతని కాలు ఎత్తుగా ఏటవాలుగా ఉంచబడింది. పాదం నుండి, మోకాలి దాకా ఉన్న కట్టులో కాలు ఏనుగు తొండంలా కనిపిస్తోంది. మంచం అటు వైపున అంచుమీద ఇద్దరు పిల్లలు, బాలుడూ, బాలికా కూర్చుని ఉన్నారు. మంచం మీద ఉన్న అపరంజి భర్త చూపులు నంది మీదే ఉన్నాయి. ముఖం మీద చిరునవ్వు మెరుస్తోంది.

"రా, నాయనా! ఇలా కూచో!" తన దగ్గరగా



మంచంమీద చేత్తో చరుస్తూ ఆహ్వానించాడతను.

"నా పేరు మోదకుడు. నీ పేరు నంది అని అపరంజి చెప్పింది" అన్నాడతను, తనను పరిచయం చేసుకుంటూ.

నంది చిరునవ్వుతో అతనికి మర్యాదపూర్వకంగా నమస్కరించాడు. "ఎలా ఉంది మీ కాలు?"

"ఆకు పసరులో ఔషధాలు రంగరించి కట్టు కట్టాడు వైద్యుడు. నొప్పి చాలా మటుకు తగ్గింది. కట్టు మరో రెండు మూడు వారాలు ఇలాగే ఉండాలన్నాడు. కాలికి మళ్ళీ నడక నేర్పాలిగా! మూడో కాలి సహాయం అవసరమవుతుందనుకుంటాను. కొన్నాళ్ళపాటు!" మోదకుడు నవ్వాడు.

"మీ రాజుగారి దృష్టికి తీసుకువెళ్ళారా?"

మోదకుడు చిన్నగా నవ్వాడు. "ఏం లాభం మనకు? మందలిస్తారు. వంద వరహాలు అపరాధం వడ్డించి కోశాగారానికి చేర్చుకుంటారు. విదారకుడిది పాము పగ. నిత్య నరకం చూపిస్తాడు, మనం రాజుగారిని ఆశ్రయిస్తే!"

నంది మంచం అంచుమీద కూర్చున్నాడు. "అడుగుతున్నందుకు ఏమీ అనుకోవద్దు. అతని వద్ద రుణంగా ఎంత పుచ్చుకున్నారు? ఎంత ఇచ్చుకున్నారు? ఇంకా ఎంత ఇచ్చుకోవాలి?"

"భోజనశాల స్థాపించినప్పుడు, ఏడేళ్ళ క్రితం అయిదునూర్ల వరహాలు తీసుకున్నాను నాయనా. ఇచ్చేటప్పుడు వడ్డీ మాత్రమే అన్నాడు.

తర్వాత్తర్వాత, కాలం గడిచేకొద్దీ చక్రవడ్డీ అన్నాడు. అదేమిటో కొన్నాళ్ళయ్యాక ద్విచక్ర వడ్డీ అన్నాడు. మరో ఏడాదికి త్రిచక్ర వడ్డీ అన్నాడు అలాంటి విపరీత చక్రవడ్డీలు ఉన్నాయా నాయనా?" అపరంజి అడ్డు తగుల్తూ అడిగింది.

నంది నవ్వాడు "మీలాంటి అమాయకులు దొరికితే అలాంటివెన్నో పుట్టుకొస్తాయి."

"పుచ్చుకున్నది అయిదు నూర్లే. రుణ పత్రమూ అంత మొత్తానికీ వ్రాయించాడు. నా లెక్క ప్రకారం పుచ్చుకున్నదంతా ఇచ్చేశాను. వడ్డీకి వడ్డీ, వడ్డీకి వడ్డీ లెక్క మీద ఎంత ఇచ్చుకున్నానో, ఇంకా ఎంత ఇచ్చుకోవాలో తెలీదు. ఎంత మొత్తుకుని అడిగినా చెప్పడు. 'తీరిపోయాక తీరికగా చెప్తాలే వోయ్' అంటాడు. భరించలేక తిరగబడ్డాను. కాలు విరగబడింది. ఆ దుర్మార్గుడి స్వార్థానికి నాలాంటి వాళ్ళు పదిమంది దాకా బలయిపోతున్నారు నాయనా..?" మోదకుడు నిట్టూరుస్తూ అన్నాడు.

నంది సాలోచనగా తల పంకించాడు.

"నిన్న నువ్వు వాడికీ, వాడి తొత్తులకీ బుద్ధి చెప్పి, గడ్డి కరిపించావని అపరంజి చెప్పింది. గవాక్షాల నుండి చూసిన పిల్లలు నిన్నటి నుండీ కథలు కథలుగా నాకు వర్ణించి చెప్తూనే ఉన్నారు. నవ్వుతూనే ఉన్నారు!" మోదకుడు అన్నాడు.

నంది పిల్లలవైపు చిరునవ్వుతో చూశాడు. తన వద్దకు రమ్మని సైగ చేశాడు. బాలుడూ, బాలికా లేచి నంది దగ్గరగా వచ్చారు. రెండు చేతుల్నీ ఇద్దరి చుట్టూ వేసి, దగ్గరకు తీసుకున్నాడు నంది.

"మీ పేర్లు చెప్పండి!"

"నా పేరు మోహనాంగి" అమ్మాయి అంది ఉత్సాహంగా.

"నా పేరు గదాధరుడు" అబ్బాయి అన్నాడు.

"ఓహ్! చక్కని పేర్లు. మనం ముగ్గురం ఒక చోట కూర్చుని హాయిగా మాట్లాడుకుందాం! ఏం? ఇప్పుడు వెళ్ళి ఆడుకోండి!" నంది అన్నాడు.

పిల్లలిద్దరూ గుమ్మం వైపు పరుగెత్తారు.

నంది మోదకుడినీ, అపరంజినీ కలియజూశాడు. "ఒక విషయం చెప్పండి. తన వద్ద అప్పు తీసుకున్న వాళ్ళందర్నీ ఇలాగే పీడిస్తూ ఉంటాడా విదారకుడు?"

"ఆహా! సందేహం లేదు. రక్తాలు పీల్చేస్తున్నాడు!" మోదకుడు అన్నాడు.

"మహారాజు వద్దకు..." నంది ఏదో చెప్పబోయాడు.

"మా కష్టాలు రాజోద్యోగుల స్థాయిలోనే ఆగిపోతాయి, నాయనా. మా నుండి పిండి గుంజుకునే సొమ్ముతో వాళ్ళను కట్టిపడేస్తున్నాడని మా అనుమానం. మహారాజుగారు మంచివారే! ఆయన చెవిలో పడాలి కదా!"

"విదారకుడి రుణగ్రస్థులెవరో మీకు తెలుసా?" నంది సాలోచనగా అడిగాడు.

"తెలీకేం నాయనా? పండుగకీ, పబ్బానికీ కలుసుకుని గోడు వెళ్ళబోసుకుంటుంటాం గద!" అపరంజి అంది.

"ఎందరుంటారు?"

"పరిసరాల్లో ఉన్న ఉపవీధులే వాడి సామ్రాజ్యం. నాకు తెలిసీ తొమ్మండుగురున్నారు" మోదకుడు అన్నాడు.

"అందర్నీ ఒకసారి పిలిపించండి" నంది అన్నాడు.

మోదకుడూ, అపరంజీ ముఖాలు చూసుకుని, ఆశ్చర్యంగా నంది వైపు చూశారు. "దేనికి నాయనా!" అపరంజి అడిగింది.

"పిలిపించండి... మీకే తెలుస్తుంది"

"అపరంజీ, మన ద్వారపాలకుడిని రమ్మను. వాడికి నేను చెప్తాను" మోదకుడు అన్నాడు.

•••

పొట్టి ద్వారపాలకుడు ఉత్సాహంగా ముందు నడుస్తున్నాడు, దారి చూపుతూ. కొంచెం దూరంలో నంది నడుస్తున్నాడు. అతని చేతిలో తలుపులో గుచ్చుకుపోయిన విదారకుడి కత్తి ఉంది. నంది వెనక ఎనమండుగురు పురుషులూ, వాళ్ళ భార్యలూ గుంపుగా, ఆవేశంగా నడుస్తున్నారు. అందరి ముఖాల్లోనూ ఏదో ఉద్రేకం. ఏదో ఉత్కంఠ. మోదకుడు ఏటవాలుగా పడుకున్న డోలీని అతని మిత్రులు ఇద్దరు మోస్తున్నారు. డోలీ దగ్గరగా

## జరిగిన కథ

కామరూపరాజ్య సర్వసైన్యాధ్యక్షుడు రుద్రాక్షుడు. మహారాజు న్యాయ విచారణ జరిపి అతణ్ణి రాజద్రోహిగా నిర్ధారించి యావజ్జీవ కారాగార శిక్ష విధించాడు. అతడి కుటుంబాన్ని కూడా రాజద్రోహ పరివారంగా ప్రకటించాడు. కుమార్తె దీపాంకురకు అంతఃపుర శౌచాలయాలు శుభ్రం చేసే శిక్ష, కొడుకు నందికి రాజ్యబహిష్కార శిక్ష విధిస్తాడు రాజు. పొరుగురాజ్య శ్రామికుడు భజరంగి ఇంట్లో ఆశ్రయం పొందుతాడు నంది. భజరంగి అల్లుడు నందిపై కక్షకట్టడంతో ఆ ఇల్లు వదిలి తన కర్తవ్యాన్వేషణలో ముందుకు సాగుతాడు. సత్రం నిర్వాహకురాలిపై జులుం చేయబోయిన దుర్మార్గులకు దేహశుద్ధిచేసి ఆమె ఆశ్రయం పొందుతాడు.

ఆ తర్వాత......

# మహానంది (7)

-వక్కంతం సూర్యనారాయణరావ్, సెల్:98662 67287

అపరంజి నడుస్తోంది.

ప్రధాన వీధికి దగ్గరగా, ఉపవీధిలో విశాలంగా, ఎత్తుగా ఉన్న ఒక భవనం ముందు ఆగాడు ద్వారపాలకుడు. ప్రాంగణ ద్వారంగా ఉన్న కటకటాల అడ్డుకు లోపల తాళం బిగించి ఉంది. కొయ్యముక్కలతో రూపొందిన కటకాలవి. ఎదురుగా ఉన్న భవన ద్వారం ముందు బాగా బలిసిన బుర్రమీసాల సేవకుడు కాపలా కాస్తున్నట్టు, అప్రమత్తంగా ఉన్నాడు.

"గండయ్యా! కటకటాలు తెరు" అపరంజి బిగ్గరగా అరిచింది.

సేవకుడు గండయ్య కోపంగా చూస్తూ ముందుకు వచ్చాడు. అందర్నీ నిర్లక్ష్యంగా చూశాడు. "అయ్యగారు ఎవర్నీ చూడరు! వెళ్ళండవతలకి! పైగా ఇవాళ అమావాస్య, అప్పు ఇవ్వరు!"

లింది. బంగారు రేకు తొడిగిన పిడి గునపంలాగా గండయ్య పొట్టలో గుచ్చుకుంది. 'ఉస్' అంటూ గండయ్య సగానికి వంగిపోయాడు. దుడ్డుకర్రను పట్టుకున్న అతని చేతులు దాన్ని వదిలేసి పొట్టను అదిమి పట్టుకున్నాయి. ముందుకు వంగి, తన దగ్గరగా ఉన్న అతని తలను తన తలతో బలంగా ఢీకొట్టాడు నంది. రాతిమీద కొబ్బరికాయ పగిలినట్టు చప్పుడైంది. నంది ఎడమ చేత్తో గండయ్యను బలంగా తోశాడు. గండయ్య నేలమీద వెల్లకిలా పడిపోయాడు.

నంది ప్రధానద్వారం వైపు నడిచాడు. అందరూ అతడిని అనుసరించారు. అందరి ముఖాల మీదా ఆశ్చర్యం, ఆనందం తాండవిస్తున్నాయి. మెట్లెక్కి నంది తల వాకిలిని లోపలికి తోశాడు. లోపల గొళ్ళెం పెట్టి ఉంది. నంది వెనక్కి జరిగాడు. అతని కాలు ముందుకు దూసుకెళ్ళింది. మూడో దెబ్బకు




ఏ కొంచెం కదలని ఓ మంచుకొండలా
మృతినైనా స్వాగతించు పూలదండలా
మాతృభూమి రక్షణలో కంచుకోట అతడు
కాపలాను నిర్వచించు కంటి రెప్ప అతడు

## జయహో జవాను

ప్రాంతమని బాషలని ఏ రేఖలు గీసినా
మతం పేర మనుషులలో విభజనలే చేసినా
భరత జాతి మనుగడలో కల్లోలం కలిగిస్తే
శతఘ్నిలా భగ్గుమనే అగ్నిగోళమతడు

సరిహద్దున నీవుంటే ధైర్యంగా నిదరోతాం
ప్రతి పొద్దున నీ కదలిక కథలో కథలుగా వింటాం
సమరానికి తరలినపుడు జైజవాను పలుకుతాం
విజయుడవై రావాలని దేవుళ్ళకు మొక్కుతాం

ఏ కడుపున పుట్టి నీవు ఇంతటి ఘనుడయ్యావో
ఆ అమ్మకు ఋణం తీర్చు బహుమతి ఏమివ్వాలో



కారుతున్న కన్నీటిని ఏ పతకం తుడుస్తుంది
చరిత్రలో నీ త్యాగం శ్లోకంలా ధ్వనిస్తుంది

*-డా. వోలేటి పార్వతీశం*
*సెల్:944003 31213*

"కటకటాలు తెరుస్తావా లేదా?" నంది సూటిగా చూస్తూ ప్రశ్నించాడు. "అప్పు తీసుకోవడానికి కాదు; తీర్చడానికి వచ్చాం!"

"ఏంటీ? తెలీదా? ఎప్పుడు పడితే అప్పుడు అప్పులు తీర్చే వీలులేదు. ఏడాదికి ఒకసారే! ఉగాది రావాలి! వెళ్ళండి!"

"అయితే కటకటాలు..." నంది అన్నాడు.

"తెరవను! తలవాకిలీ తెరవను! ఎల్లెహె!" గండయ్య గద్దింపుగా అని, పక్కకి తిరిగి ఎంగిలి ఉమ్మేశాడు.

"ఏం చేద్దాం నాయనా?" అపరంజి అంది నంది వైపు చూస్తూ.

నంది కుడికాలు ముందుకు దూసుకు వెళ్ళింది. కటకటాలు భళ్ళున శబ్దం చేస్తూ ఎగిరి లోగిల్లోకి పడ్డాయి. ఉలిక్కిపడి, సర్దుకున్న గండయ్య చేతిలోని పొడుగాటి దుడ్డుకర్ర అడ్డుగా చూపుతూ, అడ్డంగా వచ్చాడు. నంది ఒక్క అంగలో అతన్ని సమీపించాడు. అతని కుడిచేతిలోని కత్తి కది

గొళ్ళెం విరుగుతూ చప్పుడు చేసింది. నాలుగో తన్ను అర అడుగు మందంతో ఉన్న బరువైన తలుపును లోపలికి విసురుగా నెట్టింది. గోడకు కొట్టుకున్న తలుపు చెవులు పగిలేలా చప్పుడు చేసింది.

నంది గుమ్మం దాటి లోపలికి ప్రవేశించాడు. పురుషులూ, స్త్రీలూ అతని వెనక గోడలా నిలబడ్డారు. నంది ప్రధాన గృహాన్ని కలియ జూశాడు. ఎత్తుగా, అందంగా ఉన్న స్తంభాలూ, ఉలి మలిచిన అలంకారాలతో ఆకర్షణీయంగా ఉన్న ద్వారబంధాలూ, తలుపులూ, ఇనుప గొలుసులకు వేళ్ళాడుతున్న దీపాలూ. విదారకుడి భవనంలో లక్ష్మి మూలుగుతోంది. ప్రధాన గృహభాగమైన పడసాల మధ్యలో నాలుగు స్తంభాల మధ్య ఇత్తడి గొలుసుల ఆధారంతో ఉన్న ఊయల మంచం. ఊయల మంచం మీద, ఎత్తుగా ఉన్న తలగడలకు ఆనుకుని ఏటవాలుగా పడుకున్న విదారకుడు...

విదారకుడి తల గుమ్మం వైపు తిరిగి ఉంది. ఊయల మీద అతను అర్ధనగ్నంగా ఉన్నాడు. నడుము నుండీ పైకి అతని శరీరం అనాచ్ఛాదితంగా ఉంది. విశాలంగా ఉన్న వక్షభాగం గుబురు వెంట్రుకలతో కంబళిలా ఉంది. భుజాల నుండి మణికట్ల దాకా ఏదో ఎర్రటి ఔషధం పట్టు వేసి విదారకుడి ముఖంలో బాధ, ఆగ్రహం రెండు రంగుల్లా కనిపిస్తున్నాయి. నంది చిరునవ్వుతో ఊయల మంచం దగ్గరగా నడిచాడు.

"నా ఇంట్లోకి ఎవరు రానిచ్చారు నిన్ను? వెళ్ళు అవతలకి! పో!" విదారకుడు గర్జించాడు.

"అరవకు, అలసిపోతావ్!" నంది నవ్వాడు. "నీ రుణగ్రస్థులు భార్యలతో కలిసి వచ్చారు; రుణ విముక్తులు కావడానికి..."

"ఇప్పుడు లెక్కలు చూడను. లెక్క చేయను. ఉగాది తర్వాత..."

"నువ్వు లెక్కలు చూసే అవసరం లేదు. లెక్క పెట్టే అవసరం రాదు! వడ్డీ, చక్రవడ్డీ, ద్వివక్రవడ్డీ, త్రిచక్రవడ్డీ ఇలా చిత్ర విచిత్రమైన వివిధ చక్ర వడ్డీల కింద అడిగినప్పుడు అడిగినంత సమర్పించుకున్నారు. రుణ పత్రాలు తీసుకుని వెళ్ళిపోతారు."

"చచ్చినా ఇవ్వను! నువ్వెవడివిరా నన్ను ఆజ్ఞాపించడానికి?" విదారకుడు హూంకరించాడు. పగిలిన పెదవుల్లోంచీ ముద్దగా వెలువడింది అతని మాట.

నంది మాట్లాడకుండా ఊయల దగ్గరగా నడిచాడు. ఊయల అంచు మీద పాదం మోపి, బలంగా తోశాడు. కిర్రు చప్పుడు చేస్తూ ఊయల దూరంగా వెళ్ళింది. నంది చేతిలోని కత్తిమొన ఊయలవైపు ఉండేలా పట్టుకున్నాడు. దూరంగా వెళ్ళిన ఊయల తిరిగి వస్తోంది.

"నేను నిన్ను పొడవను. నీ ఊయల నీ కత్తిని నీ గుండెలోకి గుచ్చేస్తుంది. నీ ఇల్లు ధ్వంసం అవుతుంది. రుణ పత్రాలను కాల్చడం కోసం నీ భవనానికి నిప్పు పెట్టేస్తారు" నంది గంభీరంగా అన్నాడు.

విదారకుడు కంగారుగా చూశాడు. భయంతో అతని దవడలు అదురుతున్నాయి. "వ...వ..వద్దు!" బిగ్గరగా, బొంగురుగా అరిచాడతను.

"కత్తిని దూరంగా తీసుకో!" నందికి కుడివైపు నుండీ ఏదో కంఠం హెచ్చరించింది.

నంది కత్తిని కిందకి వాల్చి, తలతిప్పి చూశాడు. సన్నగా, పొడవుగా ఉన్న ఒక స్త్రీ గది గుమ్మం ముందు నిలబడి ఉంది. అందరూ ఆమెనే చూస్తున్నారు. ఆమె ఒంటిమీద నగలు ఏమీ లేవు. నంది ఆమెవైపు ప్రశ్నార్థకంగా చూశాడు.

"నేను ఈ ధనపిశాచి ఇల్లాలిని" ఊయలకు దగ్గరగా వస్తూ అంది ఆమె. పతిదేవుడి ధన దాహాన్ని మౌనంగా భరిస్తూ వచ్చాను. ఎందుకో తెలుసా? ఆయన ధనాశతో కష్టనష్టాలు అనుభవించేది నేను కాదు; మీరు! చేతులు జాచి అప్పు తీసుకున్న వాళ్ళు! ఆయన అక్రమాన్ని ఎదిరించాల్సింది మీరు! ఆయన ధన కాంక్ష అనే అగ్నికి ఆహుతి అయిపోతున్న మీరు. ఎప్పుడు మేలు కుంటారా అని చూస్తున్నాను. ఇప్పుడు నేను కల్పించుకుంటున్నాను. ఎందుకో తెలుసా? నిన్న విదారకులుగారి చేతులు విరిగాయి. పతనం ప్రారంభమైంది. రేపు కాళ్ళు విరుగుతాయి. ఆ

తరువాత తల తెగిపోతుంది! అది జరగడం నాకు ఇష్టం లేదు. పెళ్ళిళ్ళు కావాల్సిన నా పిల్లలు తండ్రి లేని వాళ్ళు కాకూడదు! రుణపత్రాల కోసం మీరు మా కొంపకు నిప్పు పెట్టాల్సిన అవసరం లేదు. అందరి రుణపత్రాలూ నేను ఇచ్చేస్తాను! నా ఇంట్లో రుణపత్రం అనేది లేకుండా చేస్తాను.."

"అంబికా!" విదారకుడు ముద్దగా, బొంగురుగా అరిచాడు.

"అరవకండి. పెదవులు మళ్ళీ నెత్తురోడుతున్నాయి. వీళ్ళందర్నీ రుణ విముక్తుల్ని చేసి, మీరు చేసిన పాపాలన్నీ కడిగేస్తాను. ఇవాళ్టి నుండీ నా భర్త వడ్డీ వ్యాపారం చేయకూడదు. చేస్తానంటే, నా కూతుళ్ళను తీసుకుని నా పుట్టింటికి వెళ్ళిపోతాను..."

"అంబికా..."

"అంబిక కావాలో, వడ్డీ వ్యాపారంతో వచ్చే



## రష్మీ క్రేజ్ తగ్గిందా?

*'గుంటూరు టాకీస్' తరువాత రష్మీకి అవకాశాలు బాగానే వచ్చాయి. డిమాండ్ పెరగడంతో రష్మీ రెమ్యునరేషన్ కూడా అమాంతం పెంచేసింది. చిన్న సినిమాలకు అనువుగా ఉంటుందని నిర్మాతలు ఆమెను సంప్రదిస్తే కళ్ళు తిరిగే ఫిగర్ చెప్పిందట! దాంతో చాలా అవకాశాలు వచ్చినట్టే వచ్చి వెనక్కి వెళ్ళిపోతున్నాయట! తాజాగా 'గుంటూరు' సీక్వెల్ సినిమాకు కూడా అలాగే ప్రవర్తించడంతో ఆ నిర్మాతలు రష్మీకి ఒక నమస్కారం పెట్టేసి నికీషా పటేల్‌ని తీసుకున్నారట! ఇప్పటికైనా రష్మీ కళ్ళు తెరవకపోతే తెరమరుగు కావడం ఖాయం అంటున్నారు సినీ జనాలు.*

అంబిక అతన్ని ఒకసారి హీనంగా చూసి, అందరి వైపూ తిరిగింది. "వడ్డీ, చక్రవడ్డీ, ద్వీచక్ర వడ్డీ, త్రిచక్రవడ్డీ అనే విధ్వార వడ్డీల రూపంలో ఎంతెంత సమర్పించుకున్నారో నాకు తెలీదు. మీరు ఆ విధంగా నైవేద్యం పెట్టిన సొమ్ము ఇవ్వలేను. సొమ్ము స్థానంలో మీరు చాలామంది సొమ్ములు ఇచ్చారు. అన్యాయంగా ఆర్జించిన సొమ్ములవి. అలంకరించుకొమ్మని నా భర్త బలవంతం చేసినా నేను ఆ నగల్ని పెట్టుకోలేదు. నా పిల్లల్నీ అలంకరించుకోనివ్వలేదు..." అంబిక ఆగి చూపుల్ని ఒకసారి భర్త వైపు మళ్ళించింది.

"అంబికా...తొందరపడుతున్నావు..నామాట..." విదారకుడు బొంగురుగా అన్నాడు.

"వ్యాపారం చేసుకుంటాను. మీనాన్నను అడిగి పెట్టుబడి తీసుకురా అంటే, నాన్నను అడిగి మూలధనం సమకూర్చాను. వడ్డీ, చక్రవడ్డీ వ్యాపారం అని తెలిస్తే తెచ్చేదాన్ని కాదు. మూలధనం మూలంగా మీ పాపంలో నాకూ భాగం ఉంది. మీరు ఏం చెప్పినా వినను!" అంటూ అంబిక నంది వైపు తిరిగింది.

**సత్రం యజమానురాలు అపరంజి సహా విదారకుడి బాధితులు తొమ్మండుగురు. వారందరినీ తోడ్కొని విదారకుడి ఇంటికి చేరుకుంటాడు నంది. తామందరం ఋణవిముక్తమయ్యేందుకు వచ్చామని చెబుతాడు. అయినా ద్వారం వద్ద కాపలాగాఉన్న దృఢకాయుడు వారిని లోనికి అనుమతించేందుకు నిరాకరిస్తాడు. దాంతో నంది తలుపులు ధ్వంసం చేసి లోనికి ప్రవేశిస్తాడు. ఆ తర్వాత ఏం జరిగింది?**

"నాయనా, రుణపత్రాల దస్త్రం ఇచ్చేస్తాను. ఈ ముత్తైదువుల నుండీ నా భర్త గుంజుకున్న ఆభరణాలనూ ఇచ్చేస్తాను. ఎవరివి వాళ్ళు తీసుకోండి."

"అంబికా!" విదారకుడు అరిచాడు. అతని అరుపు బోదురు కప్ప అరుపులా ఉంది. "పిచ్చి పట్టిందా నీకు?"

అమాయకుల రక్తం కావాలో తేల్చుకోండి" అంబిక నిబ్బరంగా అంది. వడ్డీవ్యాపారమే కావాలంటే చేసుకోండి. పాడు వడ్డీతో పాటు పాపం కూడా మూటకట్టుకోండి. అయితే ఇప్పటిదాకా ఉన్న రుణపత్రాల్ని ఇచ్చి వేస్తాను!"

విదారకుడు బలహీనంగా తల వాల్చేశాడు. అంబిక లోపల గదిలోకి వెళ్ళి తిరిగి వచ్చింది. ఆమె చేతుల్లో రుణపత్రాల దొంతర ఉన్న దస్త్రం ఉంది. ఆమె నంది దగ్గరగా వచ్చింది.

"నాయనా, నువ్వెవరో నాకు తెలీదు. నా భర్తనూ, ఆయన తొత్తులైన రాక్షసుల్నీ చితక బాదింది నువ్వే అనుకుంటాను. ఇవిగో రుణ పత్రాలు. భోషాణంలో దాచినవన్నీ ఇవే. పేరు పేరునా చూసి, అందరికీ ఇచ్చివేయి. ఈలోగా ఈ సోదరీమణుల నుండీ నా పెనిమిటిగారు గుంజి తెచ్చిన నగలు తీసుకువస్తాను."

గదిలోకి వెళ్తున్న అంబికను కాసేపు చూసి నంది తన చూపుల్ని విదారకుడి వైపు మళ్ళించాడు. "విదారకా, దయ్యానికి దేవత లభించినట్టు నీకు ఆ ఇల్లాలు లభించింది. ఆమెను మించిన లక్ష్మి నీకు అవసరం లేదు! ఆ గృహలక్ష్మినే ఆస్తిగా, సర్వస్వంగా భావించు!"

విదారకుడు ఎర్రగా చూస్తూ, తల దించుకున్నాడు. అంబిక వెడల్పాటి పళ్ళెంతో గదిలోంచి వచ్చింది. అందులో రకరకాల ఆభరణాలు కుప్పగా పోసి ఉన్నాయి. అంతసేపూ పురుషుల వెనుక నిలుచున్న మహిళలు ముందుకు వచ్చారు. అంబిక పళ్ళెరాన్ని వాళ్ళ ముందు పెట్టి, తీసుకోమన్నట్టు చేతులు చాపింది. మహిళలు నవ్వు ముఖాలతో ఆమెకు చేతులు జోడించారు.

"అమ్మా...ఇది మీ ఆయన ఖడ్గం..." నంది కత్తిని రెండు చేతుల్తో పట్టుకుని అంబిక వైపు చూపాడు.

"నా పతి దేవుడు ఖడ్గవీరుడు కాదు. ఆ కత్తిని విరిచి పారేయ్ నాయనా!" అంబిక అంది.

నంది మోకాలి మీద కత్తిని నొక్కి, రెండు ముక్కలుగా విరిచి, గోడవారగా విసిరాడు.

•••

"నాయనా నందీ, నువ్వు చేసిన కార్యాలు రెండూ సాహసాలే; అద్భుతాలే!" మోదకుడు మెప్పుగా అన్నాడు. "నిన్న విదారకుడి బృందానికి నువ్వు ధైర్యంగా దేహశుద్ధి చేసింది ఒక అద్భుతం. నేడు ధైర్యంగా వాళ్ళ ఇంటికి రుణగ్రస్థుల్ని తీసుకెళ్ళి చేసిన సాహసం మహాద్భుతం!"

"అధర్మాన్నీ, అన్యాయాన్నీ ఎదిరించాలి. అది మా నాన్నగారు రంగరించిన విద్య.." నంది అన్నాడు.

"నందీ ఇక నుండీ నువ్వు మాలో ఒకడివి. నీకు ఎవ్వరూ లేరని చెప్పావు. ఈ క్షణం నుంచీ నేనూ, నా భర్తా, నా పిల్లలూ నీ వాళ్ళమే అనుకో. మాకు చేదోడు వాదోడుగా, మా వెన్నుకాపుగా ఇక్కడే ఉండిపో..."

"ఉండలేను. శాశ్వతంగా.." నంది మెల్లగా అన్నాడు.

"ఉండగలిగినంత కాలం ఉండు. నువ్వు ఒక ఇంటివాడయ్యాక మా ఇంట్లో ఉండలేవుగా నాయనా..." అపరంజి అంది.

"నాకు ఏదో పని కల్పించాలి. మీకు భారంగా ఉండలేను.."

"అలాగే...ప్రవాసయాత్రికుల విడిది గది వద్దు నీకు. తోటలో విడిగా ఉన్న ఇల్లు ఉంది. దానిని శుభ్రం చేసి, సిద్ధం చేయిస్తాను. అందులో హాయిగా ఉండు. వంటశాలలకు అవసరమైన సామగ్రి అంగడి వీధి నుండి తీసుకువస్తూ ఉంటే చాలు. అదే నీకు చేతినిండా పని!" అపరంజి అంది.

"అంతే కాదు అపరంజీ, నేను బాగా నడవ



## ఎవరు పెద్ద? ఎవరు చిన్న?

*ప్రియాంక, దీపిక ఇద్దరూ సమవయస్కులు అనుకుంటారు కానీ దీపిక కన్నా ప్రియాంక పెద్దదట! ఈ మాటలు దీపికే చెప్పింది. అయితే నేరుగా కాకుండా తామిద్దరం ఎన్నో సంవత్సరాల నుంచి స్నేహితులమని చెప్పుకొచ్చింది. ప్రియాంక మిస్ వరల్డ్ టైటిల్ గెలుచుకున్నపుడు దీపిక హైస్కూలులో చదువుతోందట! అంటే కచ్చితంగా దీపిక కంటే ప్రియాంకనే పెద్దది అన్న చర్చ ఇప్పుడు బాలీవుడ్‌లో తెగ జరుగుతోంది. ఇప్పటి వరకూ ఈ ఇద్దరూ సమవయస్కులు అని భావించిన వారికి దీపిక మాటలు షాక్‌ని ఇచ్చాయట!*

గలిగే దాకా, అందరి మీదా నంది పర్యవేక్షణ సాగిస్తాడు!" మోదకుడు అన్నాడు.

•••

భోజనగృహం వెనుక భాగంలో విశాలంగా ఉన్న తోటలో నంది నడుస్తున్నాడు. పూల మొక్కలూ, వాటి వరుసలో ఆకుకూరలు కనువిందు చేస్తున్నాయి. కాయగూరల మొక్కలు కాయల బరువుతో వినయంగా వంగి ఉన్నాయి. అక్కడక్కడా పందిళ్ళు. పందిళ్ళ కింద సొరపాదులూ, బీరపాదులూ, పొట్లపాదులూ, దొండపాదులూ ఉన్నాయి. పందిళ్ళ సందుల్లోంచీ సొరకాయలూ, బీరకాయలూ, పొట్లకాయలూ వేళ్ళాడుతున్నాయి. అపరంజి కాయగూరల కోసం హరిత విపణికి వెళ్ళాల్సిన అవసరం లేదు.

వండే వాళ్ళమీదా, వడ్డించే వాళ్ళమీదా నిరంతర పర్యవేక్షణ అవసరం లేదు. తను తోట పనిలో నిమగ్నమైపోవచ్చు. పాదులు సర్దడం, నీళ్ళు పారించడం, కలుపు మొక్కల్ని ఏరివేయడం...శరీరానికి చక్కటి పరిశ్రమ!

తన కోసం ఆనాడే శుభ్రం చేయించిన ఇంటి వైపు అడుగులు వేస్తున్నాడు నంది. ఇంటిని నివాస యోగ్యంగా తీర్చిదిద్దే పనిలో తానూ పాలు పంచుకున్నాడు. చిన్నపాటి కుటుంబం సుఖంగా కాపురం చేయడానికి తగిన ఇల్లు. అపరంజి స్వయంగా పర్యవేక్షిస్తూ ఇంటిని అద్దంలా చేయించింది. వెల్ల వేయించింది. ఇంటి ముందూ, వెనుకా ఉదయించే సూర్యుడి కాంతీ, అస్తమించే సూర్యుడి కాంతీ ధారాళంగా ప్రసరిస్తాయి. గాలీ, వెల్తురూ కలిసి కాపురం చేస్తున్న గృహం అది. నందికి ఎంతగానో నచ్చింది.

నంది శయ్యాగారంలోకి వెళ్ళి నడుం వాల్చాడు. రాత్రి భోజనాల కార్యక్రమం ప్రారంభం కావడానికి గంటకుపైగా సమయం ఉంది. అపరంజీ, ఆమె భర్త మోదకుడూ తనకు అందించిన అవకాశాన్ని కాదనలేకపోయాడు. తనకో లక్ష్యం ఉంది. ఆ లక్ష్యాన్ని సాధించాలంటే తను కష్టాలకూ, కన్నీళ్ళకూ దూరంగా జీవించాలి. అవకాశాన్ని అన్వేషించాలి. పథక రచన చేయాలి. తను జీవించాలంటే అన్న వస్త్రాలు కావాలి. తల దాచుకోడానికి నీడ కావాలి. అపరంజి దంపతుల ఆహ్వానాన్ని తిరస్కరించి, మరెక్కడో ఆశ్రయం కోసం అన్వేషించడం మూర్ఖత్వం. తనకు అవసరమైన అన్నవస్త్రాలతో పాటు, నీడతోబాటు ఇక్కడ తనకు ఆప్యాయతా, అనురాగం, ప్రేమా అన్నీ లభిస్తాయి. తను వాళ్ళకు చేసిన సహాయం వడ్డీతో, చక్రవడ్డీతో, ద్విచక్రవడ్డీతో, త్రిచక్రవడ్డీతో తనకు తిరిగి వస్తుంది అనుకున్నాడు, తనలో తను నవ్వుకుంటూ!

అదే జరుగుతోందిప్పుడు! తనను ఆ దంపతులు జ్యేష్ఠ పుత్రుడిలా చూసుకుంటున్నారు. భయంలేదు. తన ఆత్మగౌరవానికి భంగం కలిగించని ఆశ్రయం దొరికింది. లక్ష్య సాధన దిశగా తను సాగాలి. శారీరకంగా కాదు; మానసికంగా! శారీరకంగా ఎంత దూరం సాగినా, తను కామరూప రాజ్య పొలిమేరలో పాదం మోపలేడు. తన లక్ష్యం జన్మస్థానంలో తండ్రికి జరిగిన అన్యాయం. ఆలోచనల భారం నంది రెప్పలను అరమూసింది. ఏదో పథక రచన జరిగింది. నాన్న వ్రాయించిన లేఖాంశాలు మారిపోయాయి. రాత మారింది. తండ్రి తలరాతను మార్చివేసింది. తన తలరాతను మార్చివేసింది.

రాతను మార్పించిన వ్యక్తి ఎవరు? పథక రచన చేసిన వ్యక్తి ఎవరు? ఆ రహస్య పథకం వల్ల తమ కుటుంబానికి, ముఖ్యంగా వీరాధి వీరుడూ, రాజభక్తి తత్పరుడూ అయిన రుద్రాక్ష సర్వసైన్యాధ్యక్షుడికి నష్టం కలిగింది. ఆయన నష్టం మరొకరికి లాభంగా పరిణమించి ఉండాలి; ఉంటుంది. కారాగారవాసం ఒక పక్కన పెడితే, మౌలికంగా, ప్రాథమికంగా సర్వసైన్యాధ్యక్షుడి పదవిపోయి, ఆ విధంగా నష్టం చేకూరింది. ఆ పదవి వెను వెంటనే మరో వ్యక్తిని వరిస్తుంది. అది ఆనవాయితీ.

తన తండ్రి పదవిని భవిష్యత్తులో అందుకోగలిగిన రాజోద్యోగులు చాలామందే ఉన్నారు. పదాతిదళ సేనాధిపతి, అశ్వికదళ సేనాధిపతి, గజదళ సేనాధిపతి, రథబల సేనాధిపతి! ఆ నలుగురే కాకుండా సహాయ సేనాపతులూ; ఉప సేనాపతులూ ఉన్నారు. ముఖ్యంగా, చాలా ముఖ్యంగా చతురంగబలాలకు సంబంధించిన నలుగురు వ్యూహకర్తలున్నారు. యుద్ధ సమయంలో శత్రువులను ఉక్కిరిబిక్కిరి చేసే వ్యూహాలు రచించగలిగిన మహామేధావులు వాళ్ళు! ఇలా కామరూప చక్రవర్తి కుబేరవర్మ ఆస్థానంలో సర్వోన్నత సైనిక పదవి అయిన పదవిని అలంకరించగలిగే వాళ్ళు లెక్కకుమించి ఉన్నారు. ఆశించేవాళ్ళూ ఉంటారు; అర్రులు చాచేవాళ్ళూ ఉంటారు!

ఇప్పటికే ఎవరో ఒకరిని మహారాజు సర్వసైన్యాధ్యక్షుడిగా ఎన్నిక చేసి నియమించి ఉంటాడు. తన తండ్రి మీద ఆ 'లేఖాస్త్రం' ప్రయోగించిన వ్యక్తి అతనే కావచ్చు. మరొకరో! మరొకరో కావచ్చు! తనకు తెలిసీ తండ్రికి రాజోద్యోగులలో శత్రువులు ఎవ్వరూ లేరు. తనకు శత్రువులే లేరు అనేవాడు నాన్న. ఆయన దృష్టిలో, ప్రవర్తనలో తన తండ్రి అజాత శత్రువు కావచ్చు. అయితే, అజాత శత్రువుకి అజ్ఞాత శత్రువులు ఉండొచ్చు! తన తండ్రికి ఉన్నారని తెలిపోయింది! ఒకరికన్నా ఎక్కువే ఉన్నారు. ఒక అజ్ఞాత శత్రువు కాదు; జ్ఞాత శత్రువే - తెలిసిన శత్రువే ఉన్నాడు.

అతను ఎవరో కాదు, నందకుడు. ఆస్థాన లేఖకుడు! చెల్లి వివాహ విషయంగా లేఖ లిఖించమన్నాడు తన తండ్రి. ఆ అవకాశాన్ని అందిపుచ్చుకుని కృత్రిమ లేఖను సృష్టించాడు. అసత్యాలైన అక్షరాలతో తమ తలరాతల్ని మార్చివేశాడు! నందకుడి స్వార్థ హస్తం ముగ్గురి నుదుట వ్రాతలను చెరిపి వేసింది. నందకుడు ఒక లేఖిని! ఒక ఆయుధం! ఆ లేఖినిని, ఆ ఆయుధాన్ని ఒక అదృశ్య హస్తం పట్టుకుంది. తమ జీవితాలను బలి తీసుకుంది! ఆ అదృశ్య హస్తాన్ని పట్టుకోవాలి, నందకుడి హస్తం ద్వారా... నంది నిట్టూర్పు విడిచి, పైకి లేచాడు.

**(ఇంకావుంది)**



# సురభి



## బామ్మా మజాకా!

ఆరు పదుల వయస్సు వస్తే చాలు... ఇక జీవితం అయిపోయింది అనుకునేవాళ్ళు ఎందరో. ఒకవైపు మీద పడిన వయసు, మరోవైపు వెంటాడే వ్యాధులు.. దీంతో ఓల్డేజ్‌లో పడే అవస్థలు అన్నీ ఇన్నీ కావు. అయితే అందరూ ఒకేలా ఉండరు కదా!

చిలీకి చెందిన ఎలీనా గాల్వేజ్ అనే 90 ఏళ్ళ బామ్మగారిని చూస్తే ఎవరైనా నోరు వెళ్ళబెట్టాల్సిందే! ఎందుకంటే 90 ఏళ్ళ వయసులోనూ ఆ బామ్మ సైకిల్ తొక్కుతుంది. సైకిల్‌పై ప్రతిరోజూ ఏకధాటిగా 30 కిలోమీటర్లు ప్రయాణిస్తుంది. పాలు, గుడ్లు స్వయంగా అమ్ముకుని, వచ్చిన ఆదాయంతో తాను జీవనాన్ని కొనసాగిస్తున్నట్లు చెబుతోంది. వయసనేది కేవలం నెంబర్లలో మాత్రమే ఉంటుందని అంటోందీ బామ్మగారు. పాతికేళ్ళు దాటినా ఏ పనీ చేయకుండా సోమరుల్లా ఇతరులపై ఆధారపడేవారు ఈ బామ్మగారిని చూసి బుద్ధి తెచ్చుకోవాల్సిందేనంటారు ఆమె గురించి తెలిసినవాళ్ళు.



## ప్రత్యేక అతిథి

కొంతకాలంగా ప్రేమలో ఉన్న డెనిస్, నెల్యాలు కాస్త కొత్తగా వివాహం చేసుకోవాలనుకున్నారు. అందరిలాగా సంప్రదాయ బద్ధంగా వివాహం చేసుకుంటే అందులో మజా ఏముంది అనుకొని, ఏకంగా స్టీఫెన్ అనే ఎలుగుబంటిని తెప్పించుకుని దాని ముందు పెళ్ళి చేసుకున్నారు. పైగా ఆ ఎలుగుబంటికి నల్ల టై కూడా కట్టారు. ప్రేమ జంట ఉంగరాలు మార్చుకుంటుండగా ఎలుగుబంటి ఇద్దరి చేతులూ పట్టుకుని దగ్గరుండి ఈ వేడుక జరిపించింది.

అంత పెద్ద జంతువుని చూసి ముందు భయపడినా అది మాత్రం పెంపుడు జంతువులా ఎంతో ప్రేమగా ఉందని డెనిస్ చెప్పాడు. వివాహ వేడుక ముగిశాక, స్టీఫెన్ ఇద్దరికీ బొకేలు ఇచ్చి వారిద్దరితో ఫోటోలు కూడా తీయించుకుంది. మొత్తానికి జంతువులను కూడా పెళ్ళిపెద్దలుగా మార్చేస్తున్నారు!



## పుర్రెకో బుద్ధి

జర్మనీలో ఓ కారు హాట్ టాపిక్‌గా మారింది. ఆ వీధిలో వెళ్ళేవారిని ఆ కారు ఇట్టే ఎట్రాక్ట్ చేస్తోందట. అక్కడందరూ ఆ కారు గురించే చర్చించుకుంటున్నారు. ఏముందా కారులో అంతలా చర్చించుకోవడానికి? అనుకుంటున్నారా? అయితే జిగేల్‌మని మెరుపులు, ధగధగలు కురిపిస్తున్న ఆ కారు గురించి తెలుసుకోవాల్సిందే!

సాధారణంగా బాగా వాడేసిన పాతకారుని మూలన పడేస్తారు. లేదంటే సెకండ్‌సేల్ పెట్టేస్తారు. కాని జర్మనీకి చెందిన ఓ వ్యక్తి మాత్రం కాస్త డిఫరెంట్‌గా ఆలోచించి పాతకారుకి మరిన్ని సొబగులు అద్దాడు. దాన్ని కొత్తదానిలా అలంకరించాడు. అలంకరించడం అంటే రంగులు వేసి కాదండోయ్. కారు మొత్తాన్ని వజ్ర వైఢూర్యాలతో నింపేశాడు. 24 క్యారెట్ల బంగారంతో డెకరేట్ చేశాడు. ఇందుకోసం ఏకంగా 3 లక్షల డైమండ్స్ వాడాడట. కారు లోపల, బయట ఎక్కడ చూసినా బంగారం, వజ్రాల ధగధగలే, పుర్రెకో బుద్ధి జిహ్వకో రుచి అంటే ఇదే కాబోలు!



## హ్యాంగోవర్ బార్

వీకెండ్ వస్తే మందుబాబులకు పండగే పండగ. పీకల్లోతు తాగి మత్తులో మునిగి తూలుతుంటారు. తెల్లారేసరికి హ్యాంగోవర్‌తో సతమతమవుతుంటారు. మరి ఆ మత్తు దిగాలంటే... మిగతాచోట్ల ఏమోగాని నెదర్లాండ్స్‌లో అయితే హ్యాంగోవర్ బార్‌కే వెళతారట!

నెదర్లాండ్స్ రాజధాని ఆమ్‌స్టర్‌డ్యామ్‌లో ఈ హ్యాంగోవర్ బార్‌ని ప్రారంభించారు. నగరం నడిబొడ్డున మొక్కలు, చెట్లతో బార్ ప్రశాంతంగా ఉంటుంది. ఇందులోకి వెళ్ళాలంటే ముందుగా వారి రక్తనమూనాలోని ఆల్కహాల్ మోతాదుని పరీక్ష చేసి, ఫలితాలను బట్టి ప్రవేశానికి అనుమతిస్తారు. లోనికి వెళ్ళాక ఒక బెడ్‌తో కూడిన గదిని కేటాయించి, స్వచ్ఛమైన ఆక్సిజన్‌ని అందిస్తారు. ఒళ్ళునొప్పులు తగ్గేలా మసాజ్ చేస్తారు. మత్తు దిగడానికి, ఆకలి పెరగడానికి మంచి ఫలహారం అందిస్తారు. దీంతోపాటు తలనొప్పి, నిద్రలేమి సమస్య పోవడానికి వైద్యం చేస్తారు. బాగుంది కదూ!



## నీటి అడుగున ఫొటోలు

జీవితంలో ఒక మధురమైన ఘట్టంగా పెళ్ళిని అభివర్ణిస్తారు. దాన్ని చిరకాల జ్ఞాపకంగా మలచుకోవాలని తాపత్రయపడేవారి కోసం తన క్రియేటివిటీకి పదునుపెట్టాడు ఒక ఫోటోగ్రాఫర్. క్రియేటివిటీకి కాదేదీ అనర్హం అని నిరూపించాడు.

అమెరికాకి చెందిన ఫోటోగ్రాఫర్ ఆడమ్ ఓప్రిన్! నాలుగేళ్ళుగా ఆడమ్ తీస్తున్న అండర్‌వాటర్ మ్యారేజ్ ఫోటోషూట్ కోసం కొత్తగా పెళ్ళయిన జంటలు క్యూ కడుతున్నారు. పెళ్ళి చేసుకోబోయే జంట చక్కగా ముస్తాబై స్టిల్స్ ఇస్తుంటే చకచకా ఫోటోషూట్ చేసేస్తాడు ఆడమ్. నీటిలో వారి భద్రత కోసం ఈతగాళ్ళు కూడా ఉంటారు. ఇంత అద్భుతంగా నీటి అడుగున ఫోటోలు తీస్తున్న ఆడమ్ ఒక్కో ఫోటోషూట్‌కి 3వేల నుంచి 5 వేల డాలర్ల వరకు తీసుకుంటాడట.

-నర్మద వాసిరెడ్డి



# అసలు శత్రువు చైనాయే!

**కొద్ది కాలం పాటు పాకిస్థాన్ సమస్యను పక్కన పెట్టి చైనా మీద దృష్టి కేంద్రీకరించాల్సిన అవసరం కనిపిస్తోంది.**

అభివృద్ధి, సంస్కరణలు వంటి అంశాల్లో దూసుకుపోతోంది. అగ్రరాజ్యంగా, అణ్వస్త్రదేశంగా ఎదగడానికి భారత్‌కు ఎంతో కాలం పట్టకపోవచ్చు. అయితే, ఇది ఒకటి రెండు పొరుగు దేశాలకు నచ్చని విషయం. ప్రభుత్వం అభివృద్ధి పథంలో ప్రయాణించడం కాక, ఇంటా బయటా సమస్యలతో సతమతం కావాలన్నది పొరుగున ఉన్న శత్రు దేశాల ఉద్దేశం. భారతదేశం ఎప్పుడూ ముప్పులు, ప్రమాదాల్లో మనుగడ సాగించాలి తప్ప, అభివృద్ధి మీద దృష్టి కేంద్రీకరించకూడదు. భారత దేశానికి ఎటువంటి ప్రాధాన్యం, ఎటువంటి ప్రాముఖ్యం ఉండకూడదు. ఇదీ పాకిస్థాన్ వంటి కొన్ని శత్రుదేశాల ఆలోచన. దేశంలో ఆశావహ పరిస్థితి ఏర్పడినప్పుడల్లా భారతీయులను భయాందోళనల్లో ముంచెత్తే కార్యకలాపాలు సరిహద్దుకు అవతలివైపు నుంచి ఊపందుకుంటాయి. ముఖ్యంగా పాకిస్థాన్ ఇదే వ్యూహాన్ని చాలా కాలంగా అనుసరిస్తోంది. దీన్ని దృష్టిలో పెట్టుకునే ఇటీవల సర్జికల్ దాడులు జరిగాయి. సర్జికల్ దాడులకు ముందు, ఆ తరువాత భారతీయులు స్పందించిన తీరు వారికి పాకిస్థాన్ పట్ల ఉన్న ద్వేష భావానికి అద్దం పట్టింది.

చైనా మాదిరిగా కాకుండా పాకిస్థాన్ మొదటి నుంచీ భారత్‌కు ప్రత్యక్ష శత్రువే. వాఘా సరిహద్దుల దగ్గర దాదాపు ప్రతి రోజూ భారత, పాకిస్థాన్‌ల మధ్య ఉద్రిక్త పరిస్థితి నెలకొనే ఉంటుంది. భారతదేశం అభివృద్ధి చెందుతున్న కొద్దీ ఈ రెండు దేశాల మధ్య శత్రుత్వాలు పెరుగుతూనే ఉన్నాయి. నిజానికి భారతదేశం సునాయాసంగా పాకిస్థాన్‌ను పరాజయం పాలు చేయగలదని ప్రతి భారతీయుడికీ గట్టి నమ్మకం. అయితే చైనా విషయంలో అటువంటి నమ్మకం ఎవరికీ లేదు. 1962లో చైనా ఒకసారి భారత్‌ను పరాజయం పాలు చేసింది. ఉగ్రవాదం మినహా దాదాపు పాకిస్థాన్‌కు సమానంగా భారత్‌కు సమస్యలు తెచ్చి పెడుతున్న చైనాను కాకుండా పాకిస్థాన్‌ను మాత్రమే పాలకులు, ప్రజలు బద్ధ శత్రువుగా భావించడం విచిత్రమే. వాస్తవానికి, చైనా మద్దతు కారణంగానే పాకిస్థాన్ ఓ ఉగ్రవాద దేశంగా కొనసాగగలుగుతోంది.

నిజానికి, పాకిస్థాన్ విషయంలో కంటే, చైనా విషయంలోనే భారత్ అప్రమత్తంగా ఉండాల్సి ఉంది. ఇటీవలి కాలంలో భారత్-చైనాల సంబంధాలు మారుతున్న తీరును దృష్టిలో పెట్టుకుని ఆలోచిస్తే, భారత్‌కు ప్రధాన శత్రువు చైనాయేనని కచ్చితంగా నిర్ధారణ అవుతుంది. పాక్ ఆక్రమిత కశ్మీర్ ద్వారా, బంగ్లాదేశ్ ద్వారా భారత్‌ను చుట్టుముట్టడానికి చైనా ప్రయత్నాలు సాగిస్తోంది. అరుణాచల్ ప్రదేశ్‌పై తరచూ ఆకస్మిక దాడులు కొనసాగిస్తుంటుంది. భారత్ అణు సరఫరాదార్ల గ్రూప్‌లో చేరకుండా మోకాలు అడ్డుతుంటుంది. ఉగ్రవాదం మినహా అనేక కొత్త ఎత్తుల ద్వారా భారత్‌ను వేధించడం చైనాకు పరిపాటి అయిపోయింది. చైనా ఎన్ని రకాలుగా వేధిస్తున్నా భారత్ నిస్సహాయంగా ఉండిపోవాల్సి వస్తోంది. చైనాను ఎదుర్కోవడం భారత్‌కు అంత తేలికైన విషయం కాదు. చైనాను ఎదుర్కోవడానికి భారత్ తప్పనిసరిగా దౌత్యపరమైన మార్గాలనే ఎంచుకోవాల్సి ఉంటుంది.

### ఆధిపత్య కాంక్ష ఎక్కువ

వాస్తవమేమిటంటే, సరిహద్దు సమస్యను పరిష్కరించుకోవడం ఎన్నటికీ జరగకపోవచ్చు. యథాతథ పరిస్థితితో శాంతిని కొనసాగించాలన్న ఉద్దేశం చైనాకు ఏ కోశానా లేదన్నది కాదనలేని సత్యం. పరిష్కారం విషయంలో ఈ దేశాలకు భిన్నాభిప్రాయాలున్నాయి. చైనాకు బలం, బలగం కాస్తంత ఎక్కువ. ఈ రెండు దేశాల మధ్యా యుద్ధమంటూ జరిగితే, 1962 నాటి కంటే ఇప్పుడు భారత్ కాస్తంత మెరుగైన స్థితిలో ఉంటే ఉండొచ్చు. అయితే, చైనాను నిరోధించడంలో దీర్ఘకాలిక వ్యూహమంటూ భారత్‌కు ఏమీ లేదు. అంటే, చైనాతో తలపడటమంటే, భారత్‌కు చైనా ఏం కోరుకుంటున్నదీ తెలియాలి. భారత్‌కు ఏం అవసరమో తెలియాలి. వచ్చే కొన్ని దశాబ్దాల కాలంలో భారత, చైనా అధికార సమీకరణాలు ఏ విధంగా ఉండబోతోన్నాయో కూడా అంచనా వేయాలి.




అసలు చైనా ఇలా ఎందుకు చేస్తుందో కూడా ఓ మారు సింహావలోకనం చేయాలి.

చైనాకు ఇంకా అనేక కోరికలున్నాయి. ఆసియాలో తమ పెత్తనమే సాగాలని చైనా ఉద్దేశం, లక్ష్యం. ఆసియాలో తామే పెద్ద దిక్కుగా ఉండాలని, మిగిలిన దేశాలన్నీ తమకు అణగిమణిగి ఉండాలని కూడా చైనా భావిస్తోంది. చైనా ఆధిపత్యాన్ని అంగీకరించే దేశాల మీద అది వరాల వర్షం కురిపిస్తోంది. దక్షిణ చైనా సముద్రం మీదే కాక, అక్కడి అన్ని సముద్ర మార్గాలూ తమ అధీనంలోనే ఉండాలని, చైనా తీరంలోని సముద్ర గర్భ వనరులన్నీ తమకే చెందాలని కూడా అది ఆశిస్తోంది. ఇటువంటి కోరికలు ఉంటే మిగిలిన ఆసియా దేశాలతో కూడా వివాదాలు తలెత్తవచ్చు. కానీ, మొత్తం ప్రపంచం తమకు శత్రువుగా మారినా, తమకు కావాల్సిందాన్ని చేజిక్కించుకోవడమే చైనా లక్ష్యం. తమకు కావాల్సింది సాధించుకోగలమనే నిశ్చితాభిప్రాయం ఆ దేశానికి ఉంది. అందుకనే అది జపాన్-వియత్నాం- భారత్‌లు ఒక్క తాటి మీదకు రాకుండా చేయగల ప్రయత్నమంతా చేస్తోంది.

ఇది ఆసియాలో ఆ దేశ రాజకీయ లక్ష్యం. కానీ,




**అగ్రరాజ్యంగా, అణ్వస్త్రదేశంగా ఎదగడానికి భారత్‌కు ఎంతోకాలం పట్టకపోవచ్చు. అయితే భారత్ ఇలా అభివృద్ధి పథంలో పయనించటం ఒకటి రెండు పొరుగుదేశాలకు కంటగింపే! భారత్ ఎప్పుడూ సమస్యల్లో, ప్రమాదాల్లో మనుగడ సాగించేలా చేయడమే వాటి లక్ష్యం. మరి వాటిని కట్టడి చేయాలంటే భారత్ అనుసరించాల్సిన వ్యూహం ఏమిటి?**

భారత ఉపఖండంలో మాత్రం అది మూడు లక్ష్యాల కోసం ప్రయత్నిస్తోంది. లడఖ్‌లో మరిన్ని ప్రాంతాలు దాని అధీనంలోకి రావాలి. పాక్ ఆక్రమిత కాశ్మీర్ గుండా వెళ్లి, హిందూమహా సముద్రంలో నౌకాయానం సాగించుకోవడానికి, త్వరగా టిబెట్‌కు చేరడానికి ఓ అవకాశం కోసం అది ఎదురు చూస్తోంది. అందుకనే అది సియాచిన్ నుంచి భారత్ తప్పుకోవాలని కోరుకుంటోంది. సియాచిన్‌ను రక్షణ దళాల నుంచి విముక్తం చేయాలని పాకిస్థాన్ ద్వారా ప్రయత్నాలు సాగిస్తోంది. టిబెట్ తరువాత అతి పెద్ద ఆరామాలు కలిగి ఉన్న తవాంగ్‌ను తమ అధీనంలోకి తెచ్చుకోవాలి. అలాగే అరుణాచల్ ప్రదేశ్ మొత్తాన్నీ తమ అధీనంలోకి తీసుకురావాలి. అంటే చైనా నిబంధనలకన్నిటికీ భారత్ ఒడంబడిక ఉండాలి. సరిహద్దు సమస్యను తమకు అనుగుణంగా పరిష్కరించుకోవడానికి చైనా చాలా కాలంగా ఒత్తిడి తెస్తోంది. భారత్ సరిహద్దులోని నేపాల్, శ్రీలంక, బంగ్లాదేశ్, మయన్మార్, మాల్దీవుల్లో అది భారీ యెత్తున నిర్మాణాలు, ఆర్థికాభివృద్ధి కార్యక్రమాలు చేపట్టడానికి ఇదే కారణం.

### పాకిస్థాన్ పాత్ర ఏమిటి?

భారత, చైనా సంబంధాల్లో పాకిస్థాన్ పాత్ర ఏమిటి? భారత ఉపఖండంలోని చిన్నా చితకా దేశాలను 'ముత్యాల సరం' పేరుతో తమ వైపుకు తిప్పుకుంటున్న చైనా పాకిస్థాన్‌ను కూడా తమ ఆయుధంగా ఉపయోగించుకుంటోంది. భారత్ నుంచి దేన్ని సాధించుకోవాలన్నా పాకిస్థాన్‌ను ప్రేరేపించడం చైనాకు మొదటి నుంచీ అలవాటు. దానివల్ల చైనా నుంచి పాకిస్థాన్ కొన్ని ప్రయోజనాలు పొందుతుంటుంది. అంతమాత్రాన పాకిస్థాన్ చైనాకు మిత్రదేశం కాదు. పాకిస్థాన్ అంటే చైనాకు ఏమాత్రం గౌరవం లేదు. పాకిస్థాన్‌తో ఎప్పటికైనా తమకు ప్రమాదమేనని చైనా అధినేతలు తరచూ చెబుతుంటారు. భారత్‌ను చెప్పు చేతల్లో ఉంచుకోవడానికి మాత్రమే ఆ దేశం పాకిస్థాన్‌ను ఉపయోగించుకుంటుంటుంది. భారత్ విషయంలో తమ లక్ష్యం నెరవేరాక, ఆ తరువాత పాకిస్థాన్‌ను లొంగదీసుకోవడం తేలిక. దాని స్థితిగతుల్ని తేలికగా మార్చేయొచ్చు. పాకిస్థాన్ కూడా కొన్ని ప్రయోజనాల కోసం చైనా మీద ఆధారపడి, అది చెప్పినట్టు ఆడుతోంది. పాకిస్థాన్ ఉగ్రవాదులకు నిలయం అని ప్రపంచ దేశాలకన్నిటికీ తెలుసు. అది ఏదో ఒక రోజున పాకిస్థాన్‌కు ముప్పు తెస్తుంది. ఆ ముప్పును తప్పించుకోవడానికి పాకిస్థాన్ చైనాను ఆశ్రయిస్తుంటుంది. ఇక్కడ సమస్యేమిటంటే, చైనా దేశానికి పాకిస్థాన్ ఇలా తొత్తుగా ఉన్నంత కాలం పాకిస్థాన్ భారత్‌కు శత్రు దేశంగానే కొనసాగుతుంది.

చైనా ఎంత వేధించినా భారత్ తన అభివృద్ధి కార్యక్రమాల మీదే దృష్టి కేంద్రీకరించడం అవసరం. చైనాను భారత్ ఎదుర్కోవాలంటే చైనా స్థాయిలో అభివృద్ధి చెందడమే సరైన మార్గం. అరుణాచల్ ప్రదేశ్‌లోని తవాంగ్‌పై చైనా ఎన్నిసార్లు దాడులు చేసినా భారత్ తన దృష్టిని అభివృద్ధి నుంచి మళ్లించకూడదు. మాటలు తక్కువ చేతలు ఎక్కువ అన్నట్టుగా ఉండాలి. అగ్ర రాజ్యమనో, అణ్వస్త్ర దేశమనో ఊరికే గొప్పలు చెప్పడం వల్ల చైనా అహాన్ని రెచ్చగొట్టడం తప్ప ఉపయోగం ఉండదు. అగ్ర రాజ్యంగానో, అణ్వస్త్ర దేశంగానో భారత్ ఎదిగితే, ప్రపంచం భారత్ చెప్పకుండానే గుర్తిస్తుంది. భారత్‌కు మళ్లీ చైనాతో యుద్ధం వస్తుందా? రాకపోవచ్చు. భారత్ బలహీన దేశమని చైనా దృఢ నిశ్చయానికి వచ్చినప్పుడే ఆ దేశం భారత్‌పై దాడి చేస్తుంది. అధికారం, శక్తి ఉన్న దేశాన్ని మాత్రమే చైనా గౌరవిస్తుంది. భారత్ నిలకడగా తన ఆర్థిక, సైనిక సత్తాను పెంచుకుంటూ పోతేనే చైనా తన హద్దుల్లో తానుంటుంది.

భారతీయులు చైనాతో పాటు జపాన్, దక్షిణ కొరియా, జర్మనీ, అమెరికా వంటి దేశాలను చూసి నేర్చుకోవాల్సింది ఎంతైనా ఉంది. భారత్ ఉక్కు రంగంలో అంతర్జాతీయ స్థాయికి ఎదుగుతోందనే వాస్తవాన్ని చైనా గుర్తించింది. తన ఉక్కు ఎగుమతులు తగ్గే ప్రమాదం ఉందని అది తరచూ ఆందోళన చెందుతోంది. అంతేకాదు, స్మార్ట్ ఫోన్లు, ఆట వస్తువుల ఉత్పత్తిలో భారత్ కూడా చైనా స్థాయిలో ముందుకు దూసుకుపోతోంది. భారత్ తన వ్యూహాన్ని మరికాస్త పకడ్బందీగా ముందుకు తీసుకువెడితే, ఈ రంగాల్లో కూడా భారత్ అపార విజయం సాధించగల స్థాయిలో ఉంది. వివిధ దేశాలు తమమీద ఆధారపడి ఉండేందుకే చైనా అంతర్జాతీయ మార్కెట్లను తన గుప్పిట్లో బంధించే ప్రయత్నం చేస్తోంది. వివిధ రంగాల్లో చైనాతో సమానంగా భారత్‌కూ సహజ వనరులు, వసతులు, సౌకర్యాలు అసంఖ్యాకంగా ఉన్నాయి. చైనాతో సరిహద్దుల్లో ఉన్న లడఖ్, అరుణాచల్ ప్రదేశ్‌లో జీవన ప్రమాణాలను మెరుగుపరచడానికి భారత్ కృషి చేయగలిగితే, చైనా దూకుడును కొంత వరకూ అరికట్టవచ్చు.



# అందమైన అనుభవం

-సోమవర్ఘుల నాగేంద్రప్రసాద్

**'ఏరా తమ్ముడూ ట్రైను బయలుదేరిందా?' ఫోనుచేసి అడిగింది అక్క సుమతి. 'ఇప్పుడే బయలుదేరింది. ఈ వర్షాలవల్ల దార్లో ఎంత ఇబ్బంది అయ్యిందో తెలుసా!' అన్నాడు తుషార్. 'అవునూ, నేనంత కష్టపడి టిఫిన్ చేసిస్తే నువ్వు కారులోనే మర్చిపోయి వెళ్ళిపోయావు. సర్లే, జాగ్రత్త. ట్రైన్‌లో అడ్డమైనచెత్తా తినకు. వెళ్ళగానే ఫోన్ చెయ్యి' అని సుమతి ఫోను పెట్టేసింది. మెల్లిగా సీట్లో వెనక్కు వాలాడు తుషార్. ఏసీ బోగీ కిటికీలోనుండి బయట పడుతున్న వానను చూస్తుండగానే, ట్రైను క్రమేపీ స్పీడు అందుకుని గమ్యం వైపు పరుగులు తీసింది.**

కాజీపేట స్టేషన్లో ఆగింది ట్రైన్. తుషార్ కిందకుదిగి రెండు ఇంగ్లీష్ నవల్స్, ఓ వాటర్ బాటిల్ కొనుక్కుని సీటు దగ్గర కొచ్చాడు. తన సీట్లో అందమైన అమ్మాయి! నోటమాట రానివాడిలా ఉండిపోయాడు.

'అమ్మా అమూల్యా జాగ్రత్త. మధ్య మధ్యలో ఫోను చేస్తూ ఉండు. ఉంటాను' అంటూ తండ్రి జాగ్రత్తలు చెప్పడంతో 'సరే నాన్నా, మీరు దిగండి. ట్రైను కదులుతోంది' అంది ఆమె. ఆ మాటలతో ఈ లోకంలోకి వచ్చిన తుషార్ 'మేడమ్ ఈ కింది బెర్త్ మీదా' అడిగాడు నవ్వుతూ.

'ఔనండీ, అందుకేగా కూర్చున్నాను' చిన్నగా నవ్వుతూ అంది అమూల్య.

చంద్రోదయంలా ఎంతో హాయిగా ఉంది ఆమె నవ్వు. అందమైన పలువరస, విరిసీ విరియని ఎర్రగులాబీ మొగ్గల్లాంటి పల్చటి లేలేత అధరాలు. నిర్మలమైన ప్రేమను కురిపిస్తున్న చిలిపి నీలి కళ్ళు, జీన్స్‌మీద బ్లూ టీ షర్టు వేసుకుని కురులను లూజుగా గాలికి వదిలేసింది. అందమైన కోలముఖం, చుబుకం కింద నల్లటి చిన్న పుట్టుమచ్చ, చెవులకు వేలాడుతున్న పింక్ కలర్ డేంగిల్స్. మెడలో 'ఎ' అక్షరం ఉన్న చిన్న లాకెట్. అబ్బా! చూపులకు ఎంత

అందంగా ఉంది' అనుకున్నాడు తుషార్. తననే తేరిపారచూస్తుండటంతో, అమూల్య కాస్త గర్వపడింది. సిగ్గుతో వెనక్కు జరిగి, 'మీది పైబెర్తా, పర్వాలేదు కూర్చోండి' అంది సీటు చూపిస్తూ. 'థాంక్యూ' అంటూ ఆమె ఎదురుగా కూర్చున్నాడు పుస్తకాలను ప్రక్కకు పెడుతూ. మెల్లగా కిటికీ లోంచి బైటకు చూస్తున్నాడేగానీ ఆమెను క్రీగంట గమనిస్తూనే ఉన్నాడు. అమూల్య కూడా చాటుగా అతన్ని చూస్తూ 'అబ్బా ఎంత బాగున్నాడు. అచ్చు హీమాన్‌లా, హాండ్సమ్‌గా, మగసిరిగల మగాడిలా ఉన్నాడు' అనుకుంది.

'మేడమ్! ఎంతవరకు ప్రయాణం' మెల్లిగా మాట కలిపాడు తుషార్.

'కాశీకి, మరిమీరు?' చిన్నగా నవ్వుతూ అడిగింది అమూల్య.

'అరె నేనూ అక్కడికే. వర్షాల వల్ల, ఫ్లైట్లన్నీ క్యాన్సిల్ కావడంతో, ఇలా బయలుదేరాల్సి వచ్చింది. అవునూ, మీరు అక్కడ చదువుతున్నారా?' తుషార్ అడిగాడు. 'అబ్బే లేదండీ! బెనారస్ యూనివర్సిటీ సెమినార్లో పోస్టర్ ప్రెజెంటేషన్‌కి వెళుతున్నాను' అంది ఆమె.

'నేను కూడా అక్కడికే. పేపరు ప్రెజెంటు చెయ్యడానికే! వాటే కో ఇన్సిడెన్స్' తుషార్ నవ్వుతూ అన్నాడు. 'అబ్బా నవ్వితే ఇంకా అందంగా ఉన్నాడు' అనుకున్న అమూల్య మౌనంగా కిటికీవైపు తల తిప్పింది.

•••

తుషార్ చెబుతున్న మాటల్ని ఆసక్తిగా వింటోంది అమూల్య. మధ్యమధ్యలో చిరునవ్వులు చిందిస్తోంది. అతడిలో ఏదో ఆకర్షణ. తెలియకుండానే ఆమెలో ఓ రకమైన ఇష్టం ఏర్పడసాగింది. 'లవ్ ఎట్ ఫస్ట్ సైట్ అంటే ఇదేనేమో' అనుకుని నవ్వుకుంది అమూల్య. అతని కంపెనీ క్రమేపీ ఆనందాన్నివ్వసాగింది. అంతలోనే రాత్రి తొమ్మిదైపోయింది.

'తినడానికి ఏమైనా తెచ్చుకున్నారా' నవ్వుతూ అడిగింది.

హడావిడిలో అక్క ఇచ్చిన టిఫిన్ కార్లోనే మరచిపోయాను. పేన్ట్రీలో ఏమీ రావని తెలిసింది. ఈ రాత్రికిక ఉపవాసమే' అంటూ వాటర్ బాటిల్ అందుకున్నాడు తుషార్.

'నా టిఫిన్ ఉంది. షేర్ చేసుకుందాం' అంది అమూల్య చొరవగా.

'సరే అయితే చెరిసగం పంచుకుందాం' అన్నాడు కొంటెగా. ఇద్దరూ హాయిగా నవ్వుకుని, కబుర్లుతింటూ టిఫిన్ పూర్తిచేసారు. తొలి పరిచయంలోనే తుషార్, అమూల్య బాగా కనెక్టైపోయారు. 'తొలిప్రేమ' అంటే ఇదేనేమో!

•••

'అమ్మయ్య, మీ దయవల్ల కడుపు నిండింది. ఇంక ఆ పడక సంగతి కూడా చూస్తే ఓ పనైపోతుంది' అన్నాడు తుషార్.

'మాటలు కోటలు దాటుతున్నాయి. ఏంటి సంగతి' అమూల్య చురక వేసింది నవ్వుతూ.




'సరే, సరే ఇంతకీ నన్ను ఎక్కడ పడుకోమంటారు, పైనా, కిందా' మళ్ళీ కొంటెగా అడిగాడు తుషార్. ఆ కొంటెతనాన్ని ఆమె ఎంజాయ్ చేస్తోందిగానీ, ఆ స్పీడుకు బ్రేకులు వేస్తూ, 'ఆ డైలాగులే వద్దన్నది, తిన్నగా మాట్లాడండి' అంది గంభీరంగా. 'సారీ! పైన నాకు చోటు సరిపోదు, అభ్యంతరం లేకపోతే నేను కింద పడుకుంటా. అయినా మీరు ఒప్పుకుంటారు లెండి, మీది అసలే జాలిగుండె' అన్నాడు ఆమె బాడీ లాంగ్వేజ్‌ను అబ్జర్వ్‌చేస్తూ. పై బెర్తుమీద నీట్‌గా ఆమెకు పక్క వేసి, ఓకే మేడమ్, గుడ్‌నైట్ ఎండ్ స్వీట్ డ్రీమ్స్' ఆమె వంక అదోలా చూసి కింద బెర్తు మీద నడుం వాల్చాడు.

•••

ఏదో పెద్ద స్టేషన్‌లో ఆగింది రైలు. 'ఏవండీ పైన నిద్ర పట్టడం లేదు. అభ్యంతరం లేకపోతే కాసేపు కింద కూర్చోనా' కిందికి దిగుతున్న

తుషార్‌ను అడిగింది అమూల్య. 'అయ్యయ్యో ఈ బెర్తు మీది, కొంచెం సేపేంకర్మ, తెల్లవార్లూ కూర్చోండి' అంటూ కిందకు దిగి ఇద్దరికీ వేడివేడి కాఫీ తెచ్చాడు.

'అబ్బా అర్ధరాత్రి, చల్లని వాతావరణంలో ఇలా వేడివేడి కాఫీ తాగుతుంటే భలే మజాగా ఉంటుంది' అని మెల్లిగా వణుకుతున్న స్వరంతో అమూల్య అంది.

'ఏంటండి! ఈ మాత్రం చలికే తట్టుకోలేకపోతున్నారు. ఇక కాశీలో చలి ఇంకేంతట్టుకుంటారు?' నవ్వుతూ అడిగాడు తుషార్.

'భలేవారే పక్కన మీరుండగా నాకు చలేంటి' అనబోయి, 'మీరసలు ఏమాటా తిన్నగా మాట్లాడరా' చిన్నగా కోపంతో ప్రశ్నించింది అమూల్య.

'అయ్యయ్యో నేనిప్పుడు ఏమన్నానని అందమైన ముక్కుని అలా ఎర్రగా చేసుకున్నారు! అయినా కోపంలో కూడా మీరు అప్పుడే వెలిగించిన దీపంలా, మా ఊరి కొలనులో ఎర్రకలువలా ఎంతో అందంగా ఉన్నారు' అన్నాడు తుషార్. అతడి కవిత్వానికి మనసులోనే పొంగిపోయింది అమూల్య. కోపం నటిస్తూ, 'ఏంటండి వచ్చిన దగ్గరనుండి చూస్తున్నాను. నన్ను పొగడ్డమే పనిగా పెట్టుకున్నారు, ఏంటి సంగతి?' అమూల్య.

'మీరే చెప్పండి. మీరు అందంగా ఉంటారు కదా! మరి నేనూ అదే కదా చెప్పాను. ఏం తప్పు చేశానంటారా' అమాయకంగా అడిగాడు తుషార్. ఆ మాటకు ఫక్కున నవ్వింది.

కిందకు వంగి ఏదో ఏరుకోవడం మొదలెట్టాడు తుషార్. 'ఏంటండీ, చీకట్లో ఏమిటి ఏరుకుంటున్నారు, చిల్లర డబ్బులుగానీ పడిపోయాయా' అడిగింది నవ్వుతూ. 'అబ్బేలేదండి, ముత్యాలు ఏరుతున్నాను' అన్నాడు. 'ట్రైన్‌లో ముత్యాలా? కాస్త అర్థమయ్యేలా చెప్పండి మహానుభావా!' అంది అమూల్య.

'ఏం లేదండీ, మీరు నవ్వినప్పుడు రాలిన ముత్యాలు ఏరుకుంటున్నా' అన్నాడు.

'కుర్రాడు బాగా లైన్లో పడ్డాడే!' మనసులోనే అనుకుంటూ, 'మీరు భలే జోకులేస్తారు. అవునా' అంది. 'నిజం చెప్పమంటారా, మీరు నవ్వుతుంటే, అప్పుడే విరిసిన ముద్దమందారంలా ఉంటుంది, కంగ్రాట్స్' అంటూ ఆమె చేతిని మెత్తగా నొక్కి వదిలాడు.

'ఊహూ...! మీరు అమాయకులనుకున్నాను. చాలా తెలివైన వారే! సరే,

ఓకే తుషార్ గారూ ఇంక పడుకోండి. మిగతా సంగతులు రేపు తీరిగ్గా మాట్లాడుకుందాం' అంటూ పై బెర్తుమీదకి వెళ్ళింది అమూల్య. ఆమె మనసంతా తుషార్ ఆలోచనలతో ఎప్పటికోగానీ నిద్రపోలేకపోయింది.

●●●

మర్నాడు ఉదయం ట్రైను నాగపూర్ చేరుకుంది. అమూల్య ప్రమేయం లేకుండానే కిందకు దిగి ఇద్దరికీ టిఫిన్లు తెచ్చాడు తుషార్. ఇంకా నిద్రలోనే ఉంది అమూల్య.

పై బెర్తు రాడ్‌మీద చేతులువేసి మెల్లిగా ఆమెను తట్టిలేపాడు తుషార్. ఊ... అంటూ బద్ధకంగా ఇటు తిరిగింది అమూల్య. అసంకల్పితంగా ఆమె ఎదఎత్తులు తుషార్ వేళ్ళను స్పృశించాయి. అతడి నరాలు జివ్వుమన్నాయి. వెంటనే లేచికూర్చుని బద్ధకంగా ఒళ్ళు విరుచుకుంటున్న అమూల్యను, ఆమె ఎద సంపదను చూసి ముగ్ధుడైపోయాడు. రెప్పవాల్చకుండా అతను చూస్తున్నదేమిటో గమనించిన అమూల్య సిగ్గులమొగ్గైపోయింది. దుప్పటి మీదకు లాక్కుని అతడివైపు చూస్తూ చిరుకోపం ప్రదర్శించింది. ఆమె చూపులకు తడబడి స్పృహలో కొచ్చిన తుషార్ ఆమెకి చేయి అందించి మెల్లగా కిందకు దించాడు. ఆమెను దించుతున్నప్పుడు అతడి వేళ్ళ ఆమె అందమైన నడుముపై సరిగమలు పలికాయి. ఆమె దిగి అటుతిరుగుతున్నప్పుడు ఆమె జఘనాలను స్పృశించి ఆ ఆ హాయిని అనుభవించాడు తుషార్. ఉద్దేశపూర్వకంగా అతడు చేసే చేష్టలకు ఫిదా అయిపోయింది అమూల్య. అతణ్ణి చూసి కొంటెగా నవ్వింది.

●●●

కాళ్ళు జాపి సీటు వెనక్కు ఆనుకుని కూర్చుంది అమూల్య. తమలపాకుల్లాంటి తెల్లని ఆమె అరిపాదాలను తన వేళ్ళతో సుతిమెత్తగా రాశాడు తుషార్. అరికాళ్ళలో కితకితలనిపించింది అమూల్యకు. 'ఏయ్ ఏంటా కోతిపని' అంది కాళ్ళు వెనక్కు లాక్కుంటూ. 'మీ చేతులు తిన్నగా ఉండవా?' అంది నవ్వుతూ. 'ఏమిటోనండీ, అందమైన మీ పాదాలు చూసి ఉండబట్టలేకపోయాను. ఐయామ్‌సారీ' అన్నాడు నవ్వుతూ తుషార్. 'ఓ పని చెయ్యండి నా పాదాలు నొప్పిగా ఉన్నాయి కాస్త నొక్కిపెట్టండి' అంది తన కాళ్ళను కాస్త ముందుకు జాపి.

'ఆహా ఆ భగవంతుడు నాకు ఎంతటి భాగ్యాన్ని ప్రసాదించాడు' అంటూ నొక్కడం ప్రారంభించాడు. 'ఏంటీ కాకా పడుతున్నారా' అంది అమూల్య. 'కాకానా' దేనికి? అర్థం కానట్లుగా అడిగాడు.

'మళ్ళా నన్ను రాత్రి కూడా మీద పడుకోమనడం కోసం..అదే పై బెర్తుమీద...' అంది అమూల్య.

'ఏంటీ ఇంకా ట్రైనులోనే ఉందామనుకుంటున్నారా? రాత్రి పది గంటలలోపు మనం కాశీ చేరుకుంటాం' అన్నాడు తుషార్.

'ఆ అన్నట్లు మీ ఎకామిడేషన్ గురించి ఆర్గనైజర్స్‌తో మాట్లాడారా?'

'థాంక్సండీ! భలే గుర్తుచేశారు' అని వెంటనే ఆర్గ

## పూజాకి జ్ఞానోదయం!

*'మొహెంజోదారో' ఫ్లాపుతో పూజాహెగ్డేకి జ్ఞానోదయం అయినట్టుంది అంటున్నారు సినీ జనాలు. ఈ సినిమా ముందు వరకూ పూజా కాస్త పద్ధతిగానే కనిపించేది. మితిమీరిన గ్లామర్ షో, బికినీలు వంటి వాటికి కాస్త దూరంగా ఉండేది ఈ అమ్మడు. అలాంటిది ఉన్నట్టుండి ఒక్కసారిగా పూజా బికినీ ఫోటోలు బయటకు వచ్చేశాయి వీటిని చూసి అందరూ ఒక్కసారి షాకయ్యారట! తెలుగులో తాజాగా బన్నీతో సినిమా చేస్తోంది పూజా! మొదటి సినిమాతో సక్సెస్ కాలేకపోయిన పూజా ఈసారి ఎలాగైనా టాలీవుడ్‌లో జెండా పాతాలని ఫిక్స్ అయిపోయింది అంటున్నారు సినీ జనాలు.*

నైజర్‌తో మాట్లాడి, 'అయ్యో! ఇప్పుడెలా? స్పాట్ రిజిస్ట్రేషన్ వాళ్ళకి ఎకామొడేషన్ ఉండదట. ఊరు కాని ఊళ్ళో ఇప్పుడెలా?' కంగారు పడింది అమూల్య.

'ఊరుకోండీ, నన్ను నమ్ముకున్నారు కదా! మిమ్మల్ని ఈ నడిరేయి గంగలో ముంచను లెండి' నవ్వుతూ అన్నాడు తుషార్.

●●●

'వెల్‌కమ్ సార్, మీ రూము కీస్ తీసుకోండి' ఫార్మాలిటీస్ పూర్తిచేసి తుషార్ చేతికి తాళాలిచ్చాడు గంగా గెస్టుహౌస్ మేనేజర్.

'థాంక్యూ' అంటూ, 'ఓ సింగిల్ రూము ఏదైనా ఉందా' అడిగాడు తుషార్.

'సారీసార్, సీజనుకదా' చెప్పాడు మేనేజర్.

'ఇక్కడేమీ రూములు లేవట. అభ్యంతరం లేకపోతే ఈ రాత్రి నాతో ఉండండి. రేపు ఎక్కడైనా ట్రై చేద్దాం' అన్నాడు అమూల్యతో తుషార్. అతనివంక అనుమానంగా చూసింది.

'చూడండి, ఇద్దరం ఒకే రాష్ట్రంవాళ్ళం. పైగా ఒకే బెర్తుమీద కలిసి ప్రయాణించి వచ్చాము. అంచేత మీరింకేం ఆలోచించకండి. అయినా నేను అలాంటివాణ్ణి కాదు, నా మాట నమ్మాలి మీరు' భరోసా ఇచ్చాడు తుషార్.

'సరే కానివ్వండి. మీమీద నమ్మకం ఉంది' అంటూ అతడి రూములోకి వచ్చింది అమూల్య.

●●●

అర్ధరాత్రి వేళ.. గెస్టుహౌస్ బాల్కనీలో నిలబడ్డారు తుషార్, అమూల్య. ఎదురుగా పున్నమి చంద్రుని కిరణాల కాంతిలో మిలమిల మెరుస్తూ, ప్రశాంతంగా ప్రవహిస్తున్న గంగానది!

'అహా ఎంతో అందంగా, నవకన్యలా మెరిసిపోతోంది కదూ గంగానది' అమూల్యతో అన్నాడు తుషార్. గాలికి ఆమె కురులు ఎగురుతూ తుషార్ ముఖానికి తగిలి అతడికి గిలిగింతలు పెడుతున్నాయి. ఆమె పర్‌ఫ్యూమ్ పరిమళం అతడికి ఏదో సరికొత్తమత్తునిస్తోంది.

'నిజమే, మీరన్నట్లు గంగానది చూడ్డానికి ఎంత బావుందో' అంది అమూల్య.

బైట బాగా చలిగా ఉంది. చూడండి నా బుగ్గలు, చేతులు ఎంత చల్లబడిపోయాయో' అన్నది. ఆమె బుగ్గల మీద చేతులు వేసి, ఆమె చేతిని చొరవగా పట్టుకున్నాడు తుషార్. నిజమే మీరు చాలా చల్లగా అయిపోయారు. పదండి లోపలికి. రేపు మీ పోస్టర్ ప్రెజెంటేషన్ కూడా ఉంది. పైగా మీకేమైనా అయితే నేను తట్టుకోలేను' నవ్వుతూ అన్నాడు తుషార్. ఆ అభిమానం, ప్రేమకు పొంగిపోయింది అమూల్య. సడన్‌గా అతణ్ణి వాటేసుకుంటూ అతని గుండెల మీద ముద్దుల వర్షం కురిపించింది. అనుకోని సంఘటనకు ఆశ్చర్యపోయాడు తుషార్. ఆమెను గట్టిగా పొదివి పట్టుకుని నుదుటన పెదవులతో స్పృశించాడు. 'అమూల్యా నువ్వు నా దానివి' అన్నాడు. ఆమె ఇంకాగట్టిగా వాటేసుకోవడంతో పరవశమైపోయాడు తుషార్. అతడి వెచ్చని కౌగిలిలో గువ్వపిట్టలా ఒదిగి పోయింది. ఆ మధుర క్షణాలు అనుభవించిన కొద్దిసేపటికి వారిద్దరూ సడనుగా ఏదో తప్పు చేసినవారిలా విడివడ్డారు. సిగ్గుతో ఒకర్ని చూసి మరొకరు నవ్వుకుని 'గుడ్‌నైట్' చెప్పుకున్నారు.

●●●

మర్నాడు ఉదయం బెనారస్ హిందూ యూనివర్సిటీ క్యాంపస్‌లోకి అడుగుపెట్టిన వారిద్దరిలో ఏదో తెలియని అనిర్వచనీయమైన ఆనందం, ఉద్వేగం!

పచ్చనిచెట్లతో హరితవనంలా, విశాలమైన భవంతులున్న క్యాంపస్ ముగ్ధుల్ని చేసింది వారిని. 'ఆహా ఇక్కడ చదువుకుంటున్న విద్యార్థులు ఎంత అదృష్టవంతులో' అనుకున్నారు. క్యాంపస్ దారుల్లో అందమైన యువతులు, రంగురంగుల సీతాకోకచిలకల్లా తిరుగుతూ యూనివర్సిటీకి మరింత అందం తెస్తున్నారు.

మధ్యాహ్నం పేపరు ప్రెజెంటు చేశాడు తుషార్. 'ఆ... అమూల్యా నీ పోస్టర్ ప్రెజెంటేషన్ కూడా అయిపోయింది కదా, ఇక పద సరదాగా అలా గంగలో షికారుకి వెళ్ళి, ఆ తర్వాత గంగా హారతి చూద్దాం' అన్నాడు. ఆనందంగా అతడి వెంట వెళ్ళింది అమూల్య.

●●●

సాయంత్రంవేళ చల్లగాలిలో మనసుకు నచ్చినవాడితో గంగానదిపై పడవప్రయాణం. ఎంతో హాయి అనిపించింది అమూల్యకు. 'అబ్బా ఎంత బావుందోకదా ఈ అనుభవం. కానీ ఈ చలిగాలే ఇబ్బంది పెడుతోంది' అంటూ పడవలో తుషార్ పక్కన కూర్చుంది అమూల్య.

వచ్చీరాని తెలుగు, హిందీలో ఘాట్ల విశేషాలు చెబుతున్నాడు పడవవాడు. సాబ్ మీకు తెలుసోలేదో మీ మద్రాసి హీరో చిరంజీవి అదిగో కనిపిస్తోందే ఆ ఇంటిని ఈ మధ్యనే కొన్నారు అని చెప్పడంతో 'ఏమిటో వీళ్ళకు తెలియని విషయాలు లేవనుకుంటాను' అనుకుని నవ్వుకున్నారు. పడవవాడు తన ధోరణిలో ఏదో చెప్పుకుపోతున్నాడు. కానీ అమూల్య దృష్టంతా తుషార్ పైనే. దానికి తోడు చలిగాలి పెరిగింది. అతనికి ఇంకా దగ్గరగా జరుగుతూ 'అబ్బా ఏమిటి బాబూ, వాడి నస. ఇప్పుడు మనం ఈ ఘాట్ల గురించి తెల్సుకోకపోతే వచ్చే నష్టం ఏమిటి? వాణ్ణి కాస్త ఆపమను' అంది. 'అది వాడి వృత్తి. ఇంక చలి అంటావా నాకు దగ్గరగా కూర్చో, అప్పుడు చలీగిలీ అన్నీపోతాయి' అంటూ రెండు చేతులూ ఆమెచుట్టూ వేశాడు తుషార్. 'ఏమిటో తుషార్, మీ పరిచయం ఓ కలలాగా ఉంది. నిజంగా మీరు తోడు లేకపోతే ఈ ఊళ్ళో నేనెలా ఉండేదాన్నో, ఎక్కడ ఉండేదాన్నో తల్చుకుంటుంటే, గమ్మత్తుగానూ, భయంగానూ ఉంది. థాంక్స్ ఎలాట్! నా కోసం చాలా శ్రమ తీసుకుంటున్నారు' అతని కళ్ళల్లోకి ఆరాధనగా, అంతకు మించి ప్రేమగా చూస్తూ అంది అమూల్య.

"అదేం కాదు, నీతో పరిచయం నిజంగా నా అదృష్టం' అని, పడవవాడితో 'చూడు బాబూ




మన దేశంలోని కుటుంబ వ్యవస్థ విలక్షణమైనది. భార్యాభర్తలు నలభై యాభై సంవత్సరాలు ఎంతో అన్యోన్యంగా కలసిమెలసి జీవించే సంప్రదాయం ఉన్న దేశం. మరి ఇంతటి దేశంలో భార్యాభర్తలు ఆరోగ్యవంతమైన సెక్స్ జీవితం గడుపుతున్నారా? అనే అంశంపై ప్రశ్నలు సంధించి సర్వే

## హెల్తీ సెక్స్ లైఫ్!

చేశారు. పగలంతా హాయిగా సామాజిక బాధ్యతలు నిర్వహించేందుకు హెల్తీ సెక్స్ లైఫ్ సంబంధాలు భార్యాభర్తల మధ్య చాలా అవసరం అని ఈ సర్వేలో 93 శాతం కపుల్స్ అంగీకరించారు.

సగంమందికి పైగా పురుషులైతే హెల్తీ సెక్స్ లైఫ్ 'ఇంపార్టెంట్' అని చెబితే, 40 శాతం స్త్రీలు 'వెరీ ఇంపార్టెంట్' అని చెప్పారు. 60 శాతం మహిళలైతే సంతోషంగా లేరు. కానీ 80 శాతం పురుషులు మాత్రం 'వెరీ హ్యాపీ' అనీ లేదా 'హ్యాపీ' అనీ వెల్లడించారు. పిల్లలు పుట్టిన తర్వాత కూడా సెక్స్ జీవితంలో ఎలాంటి మార్పూ లేదని ప్రతి ముగ్గురిలో ఒకరు చెప్పగా, పిల్లలు పుట్టిన తర్వాతే తమ సెక్స్ జీవితం ఇంకా బెటర్‌గా ఉందని 8 శాతం మహిళలూ, 22 శాతం పురుషులూ వెల్లడించారు.



35 శాతం మగవారైతే, 'అవును! నాకు ఇప్పటికిప్పుడే సెక్స్ కావాలి' అని కోరుకుంటారట. ఈ ధోరణి స్త్రీలలో కంటే పురుషుల్లో 11 శాతం ఎక్కువగా ఉందని తేలింది. 55 శాతం మంది పురుషులు వారంలో ఏడు రోజులూ సెక్స్ మూడ్‌లోనే ఉంటారట.

ఇక వివాహితులైన ప్రతి పదిమంది మగవారిలోనూ ముగ్గురు మాత్రం సెక్స్ సంబంధమైన ఈ-మెయిల్స్, మెసేజ్‌లు లేదా ఆన్‌లైన్ పోర్న్ వీడియోలు చూస్తారట. 27 శాతం మంది భర్తలు ఫోర్‌ప్లే చేసేందుకు ఎక్కువ ఇష్టపడితే, 41 శాతం మంది ఓరల్ సెక్స్ చేసేందుకు, 30 శాతం మంది అనల్ సెక్స్ చేసేందుకు ఇష్టపడతారట!

ఇక స్త్రీలైతే 35 శాతం మంది ఫోర్‌ప్లేకు ఇష్టపడతారు. తమ భర్తలు సెక్స్ విషయాలు, ప్రేమకు సంబంధించిన విషయాలు ఎక్కువగా చెప్పాలని 32 శాతం మంది కోరుకుంటారు.

జీవితంలో ఒత్తిడి కారణంగా సెక్స్ కోరికను కోల్పోతున్నామని 37 శాతం మంది భర్తలు, 49 శాతం మంది భార్యలు సర్వేలో వెల్లడించారు.

రేపు ఉదయం మమ్మల్ని గంగ అవతలి ఒడ్డుకు తీసుకు వెళ్తావా' హిందీలో అడిగాడు తుషార్. 'ఠీక్ హై సాబ్, ఐదు గంటలకువచ్చి తీసుకెళ్ళి సూర్యోదయం చూపిస్తాను' అంటూ తుషార్ ఇచ్చిన ఐదువందల నోటుని తీసుకుని వెళ్ళిపోయాడు.

●●●

అమూల్యా సాయంత్రం మనం గంగలో షికారు కెళ్ళినప్పుడు నువ్వో విషయం గమనించావా. దూరం నుండి చూస్తే ఆ గంగ వంపు అచ్చు ఓ కన్నెపిల్ల సన్నని నడుంలా ఎంతో అందంగా ఉంది. ఇంకా చెప్పాలంటే మన్మథుడు ఎక్కుపెట్టిన విల్లులా, శివుని శిరస్సుపై నెలవంకలా ఎంత బావుందో కదా?' అమూల్యా నడుం వంక చూస్తూ అన్నాడు తుషార్.

'ఓహో... అన్నీ బాగానే అబ్జర్వ్ చేశావే. సరే అయితే నా ఒంట్లో భాగాలు ఎలా ఉంటాయో చెప్పండి చూద్దాం' కవ్విస్తూ బెడ్డుమీద అతని పక్కనే కూర్చుంటూ అంది అమూల్య.

అన్నీఅంటే... ఊ.... ఎక్కడ నుండి మొదలు పెట్టను, పైనుండా, కింద నుండా' అని నవ్వుతూ ఆమె గుండెల కేసి ఆశగా చూస్తున్న తుషార్ పెదాలను మరోసారి తన అధరాలతో మూస్తూ 'ఏమో నాకేం తెలుసు, అన్నీ ఆటోమేటిక్‌గా నా ప్రమేయం ఏమీ లేకుండా వాటంతటవే జరిగిపోతున్నాయి' అంటూ అతన్ని తన మీదకు లాక్కుంది అమూల్య. ఆ రాత్రి తెల్లవార్లూ అతన్ని ముద్దులతో ముంచెత్తుతూనే ఉంది.

●●●

చెప్పిన ప్రకారమే మర్నాడు ఉదయం పడవవాడు వాళ్ళను తీసుకుని గంగ ఆవలి ఒడ్డుకు బయలుదేరాడు. పడవ గంగ నడిమధ్యకు చేరుకుంది. పూలవానలా కురుస్తోంది మంచు. గంగ ఒడ్డున స్నానం చేసిన భక్తులు దీపాలు వెలిగించి గంగలో వదులుతున్నారు. ఆ దీపాలు నదిమీద తేలుతూ వెళుతుంటే ఆ దృశ్యం ఎంతో అందంగా ఉంది. ఆ వాతావరణం చూసి పరవశించిపోయాడు తుషార్! చలిగాలికి వణుకుతున్న అమూల్యను చూసి 'ఏంటి అమూల్య, చలిగా ఉందా? పోనీ వెనక్కు వెళ్ళిపోదామా అన్నాడు ప్రేమగా. 'వద్దు తుషార్, ఇటువంటి అనుభవం మళ్ళీ జీవితంలో దొరకదు. నీతో ఇలా పవిత్ర గంగానదిపై పడవ ప్రయాణం 'అందమైన అనుభవం'. దీని కోసం ఒక్క చలిగాలేంటి దేన్నీ లెక్కచెయ్యను' తుషార్ భుజంపై తలవాల్చి అతని చెవిలో మెల్లగా అంది. 'మన ప్రేమకు ఈ గంగమ్మతల్లే సాక్షి... ఐ లవ్యూ తుషార్' కళ్ళుమూసి తన్మయత్వంతో చెప్పింది. పడవవాడు తనలోనే నవ్వుకున్నాడు. వాళ్ళను గంగ ఒడ్డున వదిలి, 'సాబ్ నేనో గంటలో వస్తాను. ఈలోగా మీరు...' అంటూ నవ్వుతూ హిందీలో ఏదో అని వాళ్ళకు ఏకాంతం కలిగించి వెళ్ళిపోయాడు.

'ఇంత అందమైన ప్రదేశంలో మెత్తని ఇసుకపై నీ పక్కనే నడుస్తూంటే, ఏదో చెప్పలేని ఆనందం, 'అందమైన అనుభవం' మాటల్లో చెప్పలేను. అందమైన అమ్మాయితో ఇటువంటి రమణీయ ప్రదేశంలో గడపడం నిజంగా నా అదృష్టం. కల్లోకూడా ఊహించలేదు.'

'ఆ మాట నేనే అనాలి. పరిచయమైనప్పటి నుండీ మీతో గడిపిన ప్రతి క్షణం, నా జీవితంలో ఓ అందమైన అనుభవంలా మిగిలిపోతుంది. ఇక్కడికి రాకముందు ఎంతో భయపడ్డాను. కానీ ఇలా మీ పక్కనే ఉంటే, భయమన్నదేలేదు' అంది అమూల్య. అక్కడ ఇసుకలో కూరుకుపోయిన ఓ పడవ పక్కనే నడుస్తున్న అమూల్య తుషార్ భుజంమీద చెయ్యి వేయబోయి తూలిపడబోయింది. ఒడుపుగా ఆమెను పట్టుకున్న తుషార్‌తో సహా ఇద్దరూ సైకత తల్పం లాంటి ఇసుకపాన్పుమీద వెల్లకిలా పడిపోయాడు. అలా పడ్డప్పుడు ఆమె పయ్యెద మాటున పదిలంగా దాగిన సంపద మెత్తగా అతని గుండెల్ని ముద్దాడింది. అమూల్య ఎంతో హాయిని అనుభవిస్తూ అతన్ని ఇంకా గట్టిగా వాటేసుకుని తన గుండెలకు బలంగా హత్తుకుంది.

చుట్టూ ఏకాంతం, మనసుని తొందరపెడుతున్న వయసు ప్రభావం..

తనువు, మనసు ముడివేసుకున్న ఆ జంట సరస సల్లాపాలను చూసి ప్రకృతి పులకించిపోయింది.

వారి ప్రేమకు సాక్షిగా అప్పుడే ఉదయించిన బాలభానుడు తన నులివెచ్చని లేత కిరణాలతో వాళ్ళను ఏకంకమ్మని ఆశీర్వదించాడు. అలా వారిద్దరూ ఆ ఏకాంతాన్ని ఆనందిస్తుండగా అంతలో పడవవాడు తమకేసి రావడం చూసి సిగ్గుతో పైకిలేచి ఇసుక దులుపుకుని ముసిముసిగా నవ్వుకుంటూ పడవలో తిరిగి ప్రయాణమయ్యారు.

కొద్దిసేపటిక్రితం 'అనుభవం' పడవలో కూర్చున్న అమూల్యకు గుర్తొచ్చి ఆమె ముఖం సిగ్గుతో ఎరుపెక్కింది. ఆమె బుగ్గలు సింధూరవర్ణం దాల్చాయి. సూర్యుని లేతకిరణాలు ఆ నదిమీద నుండి పరావర్తనం చెంది, అమూల్య మీదపడి ఆమె మోము సప్తవర్ణాల ఇంద్ర ధనస్సులా మారింది. ఆమె అందాలను మైమరచి చూస్తున్న తుషార్‌తో 'దిగండి సాబ్...!' అన్నాడు పడవవాడు నవ్వుతూ. ఈ లోకంలోకి వచ్చిన తుషార్ వాడి చేతిలో వెయ్యిరూపాయల నోటు పెట్టి 'షుక్రియా' అంటూ పడవదిగి, అమూల్యకు చెయ్యి అందించాడు.

●●●

'నాలుగు రోజులు నాలుగుక్షణాల్లా గడిచిపోయాయి. నిన్ను వదిలి ఒంటరిగా వెళ్ళాలంటే భయంగాను, బాధగాను ఉంది' ట్రాలీబ్యాగులో బట్టలు సర్దుతూ అంది అమూల్య.

'బాధ ఎందుకు? నేను పక్కనుండగా నువ్వెప్పుడూ బాధపడకూడదు. నేను తట్టుకోలేను' ఆమెకు బట్టలు అందిస్తూ నవ్వుతూ అన్నాడు తుషార్.

'నీకంతా నవ్వులాటే. నేను ఒంటరిగానే వెళ్ళాలి కదా' బ్యాగ్‌జిప్ వేస్తూ కన్నీటిని దాచుకుంటూ అంది అమూల్య.

'అమూల్యా! నేనూ నీతోపాటే వస్తున్నాను' అన్నాడు తుషార్.

'వ్యాట్! ఏం మాట్లాడుతున్నావు' నమ్మశక్యం కానట్లుగా అడిగింది.

'ఎస్, నేనూ నీతో పాటే ట్రైనులో వస్తున్నాను. అందుకే నా ఫ్లైటు టిక్కెట్టు క్యాన్సిల్ చేశా. నీకు సర్‌ప్రైజ్ ఇద్దామని చెప్పలేదు. సో నీతో మరో ఇరవై నాలుగు గంటలు ఒకే బెర్తుమీద... ఏదో చిలిపిగా నవ్వుతూ తుషార్ చెప్పబోతుండగా 'థాంక్యూ' అంటూ తుషార్ వంక ప్రేమగా చూసి, 'నీతో కొన్నిగంటలు కాదు, కొన్ని సంవత్సరాలు ప్రయాణం చెయ్యాలని ఉంది' మనసులోనే అనుకుని అతన్ని మరోసారి అల్లుకుపోయింది. ఆమె పాలబుగ్గల మీద ముద్దుపెడుతూ 'అమూల్య, మనిద్దరం ఎన్నో మరపురాని అనుభవాలతోను, అనుభూతులతోను ఈ కాశీ నగరం వదులుతున్నాం" అంటూ ఆమె నుదుటి మీద గాఢంగా చుంబించి, 'ఈసారి 'జంట'గా ఇక్కడికి వద్దాం' అన్నాడు నవ్వుతూ.

సెల్ 09415368475

## కాజల్ కూడా వేసేసిందిగా!

ప్రస్తుతం చాలా మంది హీరోయిన్లు బికినీ వేయడానికి ఏ మాత్రం అభ్యంతరం కానీ, సిగ్గుగానీ పడడం లేదు. అదేంటంటే...సీన్ డిమాండ్ చేసిందంటూ అందమైన సాకు చెప్పి తప్పించుకుంటున్నారు. వీరికి కొద్దిగా భిన్నం కాజల్. ఇన్ని సంవత్సరాలుగా సినీ పరిశ్రమలో ఉంటున్నా, పరిమితికి మించి అందాల ఆరబోత కానీ, బికినీ కానీ వేయలేదు. ఇప్పుడున్న పోటీ ప్రపంచంలో ఇవి తప్పనిసరి అనుకుందేమో తను కూడా వాటికి రెడీ అయిపోయింది. కోలీవుడ్‌లో జీవాతో చేస్తున్న ఓ సినిమాలో బికినీ వేయడంతో పాటు అందాల ఆరబోత కూడా చేసేసిందట!

# హోమియోకేర్ ఇంటర్‌నేషనల్‌లో 'సంతానలేమి'కి సరైన వైద్యం

డా. శ్రీకాంత్ మోర్లావర్
CMD
హోమియోకేర్ ఇంటర్‌నేషనల్



నేటితరంలో 'సంతానలేమి' సమస్య నానాటికీ పెరిగిపోతోంది. ప్రస్తుతం వివాహమైన జంటలలో సుమారు 7–8 శాతం మందిలో 'సంతానలేమి' సమస్యను గమనించవచ్చు. మారుతున్న మానవుని జీవనశైలి, ఆహారపు అలవాట్లు, అధిక మానసిక ఒత్తిడి మరియు కొన్ని జన్యుపరమైన అంశాల వల్ల ఈ సమస్య ఎక్కువగా తలెత్తుతోంది. 'సంతానలేమి' అనగానే స్త్రీలను మాత్రమే నిందించడం మనం చూస్తూనే ఉన్నాము. కానీ 'సంతానలేమి' సమస్య తలెత్తేందుకు గల కారణాలు స్త్రీ–పురుషులలో సమాన స్థాయిలో ఉండేందుకు అవకాశం ఉంది. ఎలాంటి లోపాలు లేకుండా కూడా సంతానలేమి ఉత్పన్నం కావచ్చు. ఇలా ఏర్పడే 'సంతానలేమి'ని వైద్యపరిభాషలో 'ఇడియోపతిక్ ఇన్‌ఫెర్టిలిటీ' అని పిలుస్తారు. **సంతానలేమి:** ఆరోగ్యవంతమైన దంపతులు ఒక ఏడాది పాటు, ఏ విధమైన గర్భనిరోధక చర్యలు చేపట్టకుండా సాధారణ శృంగార జీవితం గడిపినా పిల్లలు కలగకపోవటాన్ని 'సంతానలేమి' అంటారు. **సంతానలేమి 2 రకాలు: 1. ప్రైమరీ ఇన్‌ఫెర్టిలిటీ:** స్త్రీలు, తమ వివాహానంతరం ఒక సంవత్సర కాలం సాధారణ లైంగిక జీవితం గడిపినా గర్భం ధరించకపోవటం. **2. సెకండరీ ఇన్‌ఫెర్టిలిటీ:** ఒకసారి గర్భధారణ జరిగి పిల్లలు కలగటం లేదా గర్భస్రావం జరగటంతో 2వ సారి సంతానం కలగక పోవడం.

## పురుషులలో 'సంతానలేమి'కి కారణాలు:



- **అజూస్పెర్మియా:** శుక్రకణాలు పూర్తి స్థాయిలో ఉత్పత్తి కాకపోవడం
- **ఒలిగోస్పెర్మియా:** శుక్రకణాలు తక్కువగా ఉత్పత్తి కావడం
- **అస్తినోస్పెర్మియా:** శుక్రకణాలు ఉత్పత్తి అయినప్పటికీ వాటి కదలికలు సాధారణంగా లేకపోవడం
- **టెరటోస్పెర్మియా:** శుక్రకణాల నిర్మాణంలో తేడాలు ఉండటం
- **వెరికోసిల్:** వృషణాలలో ఉండే రక్తనాళాలు వాపునకు గురి కావడం
- **హైడ్రోసిల్:** వృషణాలు ఉండే తిత్తిలో నీరు చేరడం, వృషణాలు శోథమునకు గురికావటం లేదా అధిక వేడి తగలడం, అంగస్థంభన లోపం, శీఘ్రస్కలనం మొ॥ లైంగిక సమస్యలు
- పిట్యుటరీ, థైరాయిడ్, టెస్టోస్టిరాన్ హార్మోన్‌ల అసమతుల్యత
- అధిక బరువు, మధుమేహం, పొగత్రాగటం మరియు జన్యుపరమైన అంశాలు మొ॥వి 'సంతానలేమి'కి కారణమవుతాయి.

## స్త్రీలలో 'సంతానలేమి'కి కారణాలు:



- గర్భసంచి చిన్నదిగా ఉండటం లేదా గర్భసంచి లేకపోవడం
- గర్భసంచి నిర్మాణంలో లోపాలు ఉండటం, గర్భసంచిలో కణితులు ఏర్పడటం, ఎండోమెట్రియోసిస్
- ఫెలోపియన్ ట్యూబ్స్ లేకపోవడం, ట్యూబ్స్ మూసుకుపోవడం
- అండాశయ నిర్మాణ లోపాలు, అండాశయంలో సరైన ఎదుగుదల లేకపోవడం
- యోని చిన్నదిగా ఉండటం, యోని మార్గం మూసుకుపోవడం
- శుక్రకణాలు ఈదటానికి యోని మార్గంలోని మ్యూకస్ పొర అనువుగా లేకపోవటం
- యోని అధిక ఆమ్లగుణం కలిగి ఉండటం వలన శుక్రకణాలు చనిపోవటం
- **హార్మోన్ సమస్యలు:** హైపోథైరాయిడ్ మరియు హైపర్‌థైరాయిడిజమ్ సమస్యలు, PCOD, FSH, LH, ప్రొలాక్టిన్ హార్మోన్‌ల అసమతుల్యత వంటి అంశాలన్నీ 'సంతానలేమి'కి కారణమవుతాయి.

**'సంతానలేమి'ని నిర్ధారించే పరీక్షలు: పురుషులలో:** కంప్లీట్ సెమెన్ ఎనాలిసిస్, యూ.ఎస్.జి. అబ్డమిన్, మరియు స్క్రోటమ్, సీరమ్ టెస్టోస్టిరాన్, థైరాయిడ్ ప్రొఫైల్, ఎఫ్.ఎస్.హెచ్., ఎల్.హెచ్., టెస్టిక్యులార్ బయాప్సీ, సీ.బీ.పి., ఇ.ఎస్.ఆర్., సీ.యూ.ఇ. మొ॥వి.
**స్త్రీలలో:** ఎఫ్.ఎస్.హెచ్., ఎల్.హెచ్., సీరమ్ ప్రొలాక్టిన్, థైరాయిడ్ ప్రొఫైల్, యూ.ఎస్.జి. అబ్డమిన్,. హెచ్.ఎస్.జి., లాప్రోస్కోపీ, ఫాలిక్యులార్ స్టడీ, సీ.బీ.పి., ఇ.ఎస్.ఆర్., సీ.యూ.ఇ. మొదలైన పరీక్షల ద్వారా సంతానలేమి లోపాలను నిర్ధారించటం జరుగుతుంది.

**హోమియోకేర్ ఇంటర్‌నేషనల్ వైద్యం:** జెనెటిక్ కాన్స్‌టిట్యూషనల్ వైద్యవిధానంలో జరిగే 'హోమియోకేర్ ఇంటర్‌నేషనల్' చికిత్సలో భాగంగా స్త్రీ–పురుషుల సంతానలేమి లోపాలను సరిచేయటం ద్వారా శాశ్వత పరిష్కారం అందించటంతో పాటు రెండవ, మూడవ సంతానానికి మార్గం సుగమం చేయటం జరుగుతుంది. అనేక ఆరోగ్య సమస్యలతో బాధపడేవారికి హోమియోపతి ద్వారా ఆరోగ్యకరమైన జీవితం అందించాలన్నదే 'హోమియోకేర్' దృఢసంకల్పం. ఈ సంకల్పసాధనకు తగినట్లు, సమర్థవంతమైన చికిత్సలతో 'సంతానలేమి'ని శాశ్వతంగా నయం చేయటం జరుగుతుంది. ఇటీవలి కాలంలో దక్షిణాది రాష్ట్రాలలో ఘనంగా జరుపుకున్న 'హోమియోకేర్ బేబీ షో' కార్యక్రమాలలో భాగంగా కాన్స్‌టిట్యూషనల్ చికిత్సల సహాయంతో పండంటి సంతానం పొంది – తల్లిదండ్రులుగా మారిన దంపతులందరినీ సాదరంగా ఆహ్వానించి, వారి కుటుంబ సంతోషాలను హోమియోకేర్ ఇంటర్‌నేషనల్ స్వయంగా పంచుకుంది. ఇక సంతానలేమి బాధితులెవరైనా సరే! మీకు దగ్గరలోని హోమియోకేర్ ఇంటర్‌నేషనల్ క్లినిక్‌ను సంప్రదించి, సరైన వైద్యంతో సులభంగా మీ 'సంతానలేమి'ని నయం చేసుకోవటం ద్వారా సంతానం కలగాలన్న మీ 'కల'ను సాధ్యమైనంత త్వరలో 'నిజం' చేసుకోమని మా సలహా! ఇక ఆలస్యం మీదే!!

**టోల్ ఫ్రీ 1800 108 1212** | **కన్సల్టేషన్ ఉచితం 955 000 1199** | **www.homeocare.in**





# మహిళా నీకు వందనం!

**సాయం సమయంలో చల్లచల్లగా తాగే బీరు, రాత్రి సమయంలో నిద్రించే బెడ్, హాస్పిటల్‌లో నిత్యం ఉపయోగించే సిరంజి ఇవన్నీ కనుక్కున్నది ఎవరో తెలిస్తే ఆశ్చర్యం కలగక తప్పదు. వీటినీ, వీటితో పాటు మానవులకు అత్యవసరమయ్యే మరికొన్ని వస్తువులనూ కనుక్కున్నది మహిళలే! సుమారు వందల సంవత్సరాలకు పూర్వమే వీటికి వారు రూపకల్పన చేసి విని యోగంలోకి తీసుకువచ్చారు. ఆ నారీమణుల వివరాలతో పాటు వారు రూపకల్పన చేసిన వినిమయ వస్తువుల వివరాలు....**

## బీర్

చిన్నవారి నుంచి పెద్దవారి వరకూ ఈ పదం విననివారూ, తెలియనివారంటూ ఉండరంటే అతిశయోక్తి కాదు. ఆధునిక యుగంలో బీరు కూడా ఒక అత్యవసర వస్తువుగా మారిపోయింది. ఇప్పుడంటే దీన్ని ఫ్యాక్టరీలలో తయారు చేస్తున్నారు కానీ ఏడువేల సంవత్సరాలకి పూర్వం దీన్ని మహిళలు ఇళ్ళల్లోనే తయారు చేసేవారు. బీరు తయారీకి మహిళలే ఆద్యులుగా చెప్పుకోవచ్చు. మెసపొటేమియా మహిళలు దీన్ని ఓ ఉపాధిగా మార్చుకున్నారట! గుమ్మడిపండు, చెరకు పిప్పి, అడవి తేనె తదితర వస్తువులతో దీన్ని ఇంట్లోనే తయారు చేసేవారు. ఆ కాలంలో బీరును దేవత ప్రసాదంగా భావించి తీసుకునేవారు. అప్పటి మహిళలు దీన్ని తయారు చేయడంతోనే ఆగిపోకుండా దీన్ని విక్రయించే బాధ్యత తను కూడా తీసుకునేవారు. ఆ సొమ్ముతో ఇంటిని నడపడం, కావలసిన వస్తువులు కొనుగోలు చేయడం చేసేవారు. 18వ శతాబ్దంలో పారిశ్రామిక విప్లవం తరువాత బీరు తయారీలో పలు మార్పులతో పాటు, దీని తయారీ కోసం ఫ్యాక్టరీలను కూడా ఏర్పాటు చేశారు.

## కేబినెట్ బెడ్

వినడానికి కొద్దిగా ఆశ్చర్యంగా ఉంది కదూ! రాత్రిపూట బెడ్‌గా, పగటిపూట డెస్క్‌గా ఉపయోగపడే ఈ కేబినెట్ బెడ్‌ను కనుక్కొన్నది సారా ఇ. గూడె(Sarah E. Goode). 1850లో స్లావెరీ (slavery )లో జన్మించిన సారా 1885లో ఈ కేబినెట్ బెడ్‌కి రూపకల్పన చేసింది. ఓ కార్పెంటర్‌ని వివాహమాడిన సారా భర్తతో సహా చికాగోకి వెళ్ళి అక్కడ ఫర్నీచర్ షాపును ప్రారంభించింది. భర్త బయటకు వెళ్ళిన సమయంలో షాపును తను చూసుకుంటూ ఉండేది. తమ షాపుకి వచ్చే వినియోగదారులందరూ మధ్యతరగతివారు. వారిలో చాలామంది తమకు ఎక్కువ ఫర్నీచర్ కొనుక్కునే స్తోమత లేదనీ ఒక వేళ కొనుక్కున్నా, వాటిని భద్రపరుచుకునే స్థలం లేదనీ తరచూ సారా వద్ద వాపోతుండేవారు. వారి బాధనూ, ఫర్నీచర్ పట్ల వారికున్న మమకారమే ఈ కేబినెట్ బెడ్ రూపకల్పనకు కారణమయింది. రాత్రి సమయంలో బెడ్‌గానూ, పగటిపూట డెస్క్‌గానూ దీన్ని ఉపయోగించుకోవచ్చు. ఈ డెస్క్‌లో రాయడానికి అనువైన వస్తువులు, పుస్తకాలు భద్రపరుచుకునే అవకాశం ఉంది. ఇలా రెండు రకాలుగా ఉపయోగపడే ఈ బెడ్‌కి అమెరికా ప్రభుత్వం పేటెంట్ ఇచ్చింది. ఈ విధమైన పేటెంట్‌ను పొందిన మొట్టమొదటి ఆఫ్రికన్-అమెరికా మహిళగా ఆమె పేరు చిరస్థాయిగా నిలిచిపోయింది. ఓ విధంగా సోఫా కమ్ బెడ్ రూపకల్పనకు సారానే స్ఫూర్తి అని కొందరు అంటూంటారు. మధ్యతరగతి వారికి ఎంతో అనువైన బెడ్‌ని రూపొందించిన సారా 1905లో మరణించింది.

## కారు హీటర్

మహిళలను అణచివేతకు గురిచేస్తున్నారు, వారిలోని సృజనాత్మకతకు అడ్డుకట్ట వేస్తున్నారు అన్న మాటలు మార్గరెట్ ఎ విల్కాక్స్(Margaret A Wilcox)ను చూస్తే అబద్ధమనిపించక మానదు.















సుమారు 250 సంవత్సరాలకి పూర్వమే ఇంజనీరింగ్ విద్యను అభ్యసించడమే కాకుండా కారు హీటర్‌ని రూపొందించిన ఘనత ఆమెది. ఆ కాలంలో అతి తక్కువమంది ఇంజనీరింగ్ విద్యను అభ్యసించినవారు ఉండేవారు. వారిలో మహిళల సంఖ్య చాలాచాలా తక్కువ. ఆ కాలంలో మెకానికల్ ఇంజనీరింగ్‌లో గ్రాడ్యుయేట్ పట్టా పొందింది మార్గరెట్. 1938లో చికాగోలో జన్మించిన మార్గరెట్‌కు చదువుతో పాటు కొత్త వస్తువులను కనుక్కోవాలనే కోరిక ఎక్కువగా ఉండేదట. ఆ కాలంలో కార్లు చాలా త్వరగా వేడెక్కి యజమానులకు పలు సమస్యలను సృష్టించేవి. వాటిని చాలా దగ్గర నుంచి చూసిన మార్గరెట్ కారు హీటర్‌కు రూపకల్పన చేసింది. 60వ సంవత్సరంలో ఆమెకు కారు హీటర్‌కి పేటెంట్ హక్కు ఇచ్చింది అమెరికా. మార్గరెట్ కారు హీటర్ రూపకల్పనతోనే ఆగిపోలేదు. ఆ తరువాత డిష్ వాషర్, వాషింగ్‌మెషీన్ మరికొన్ని వస్తువులకు రూపకల్పన చేసింది. ఆమె రూపొందించిన వాషింగ్‌మెషీన్ పలు రకాల మార్పులకు చేర్పులకు గురై ఇప్పుడు చాలా మంది ఇళ్ళల్లో దర్శనమిస్తూ నిత్య వస్తువుగా మారింది.

## ఐస్‌క్రీమ్ మేకర్

దీని పేరు వింటేనే అందరి నోళ్లల్లో నీళ్ళూరతాయి. నోట్లో వేసుకున్న వెంటనే కరిగిపోయే ఐస్‌క్రీమ్ ప్రియులు ప్రపంచవ్యాప్తంగా ఉన్నారు. మొట్టమొదట ఐస్‌క్రీం మేకర్‌ని రూపొందించింది ఓ మహిళ. ఆమె పేరు నాన్సీ జాన్సన్. ఇంగ్లాండుకి చెందిన నాన్సీ ఓ సాధారణ గృహిణి మాత్రమే. పిల్లల కోసమని 1843లో హ్యాండ్ ఐస్‌క్రీం మేకర్‌ని రూపొందించింది. అదే సంవత్సరం సెప్టెంబరులో తన మేకర్‌కి పేటెంట్‌ని పొందింది. ఆర్థిక ఇబ్బందుల దృష్ట్యా తన ఐస్‌క్రీం మేకర్‌ని అభివృద్ధి చేయలేకపోయింది. చివరికి ఓ కిచెన్ వ్యాపారికి రెండువందల డాలర్లకు తన ఐస్‌క్రీం మేకర్‌ని పేటెంట్ హక్కులతో సహా విక్రయించేసింది. ఆ తరువాత ఈ ఐస్‌క్రీం మేకర్‌లో ఎన్నో మార్పులు చేర్పులు చోటు చేసుకున్నాయి.

## మెడికల్ సిరంజి

హాస్పిటల్స్‌లో ఇది లేనిదే ఒక్క క్షణం కూడా గడవదు. చిన్న జ్వరానికి కూడా ఇంజెక్షన్ చేయడం అన్నది సర్వసాధారణమైపోయింది. ఓ విధంగా చెప్పాలంటే మనుషుల జీవితంలో సిరంజి ఒక అత్యవసర వస్తువైపోయింది. ఇంత అత్యవసరంగా మారిన సిరంజిని రూపొందించింది కూడా ఓ మహిళే. 1899లో న్యూయార్క్‌కు చెందిన లెటిటియా గీర్ (Letitia Geer) అనే మహిళ సిరంజిని రూపొందించింది. ఆ తరువాత 'ఇన్ ఎ హ్యాండ్ సిరంజి' పేరిట పేటెంట్ హక్కును పొందింది. చిన్న సిలిండర్‌లాంటి గాజు గొట్టం, నీళ్ళు చిమ్మడానికి అనువైన పరికరం (piston), ఆపరేటింగ్ రాడ్ లాంటి వస్తువులతో సిరంజ్‌ను తయారు చేసింది. ఆ తరువాత సిరంజి తయారీలో పలు మార్పులు చేర్పులు చోటుచేసుకున్నాయి.

## వైర్‌లెస్ ట్రాన్స్‌మిషన్ టెక్నాలజీ

ఆధునిక వైఫై, జీపీఎస్, బ్లూటూత్ టెక్నాలజీకి ఆద్యురాలు హెడీ లామర్ (Hedy Lamarr) అనే నటి. ఆస్ట్రేలియన్, అమెరికా ఫిలిం యాక్ట్రెస్ అయిన హెడీ లామర్ వైర్‌లెస్ ట్రాన్స్‌మిషన్ టెక్నాలజీని రూపొందించింది. లామర్‌లో ఓ మంచి నటే కాకుండా ఓ శాస్త్రవేత్త కూడా దాగి ఉంది. 1942లో తన స్నేహితుడితో కలిసి 'సీక్రెట్ కమ్యూనికేషన్ సిస్టమ్'ను రూపొందించింది. లామర్ రూపొందించిన ఈ సిస్టం మిలట్రీకి చాలా ఉపయోగపడింది. అంతే కాకుండా సెల్యూలార్ ఫోన్లకు కూడా ఉపయుక్తమైంది. ఐదు దశాబ్దాల వరకూ ఆమె కమ్యూనికేషన్ కల్పనకు గుర్తింపు లభించలేదు. చివరికి 1997లో ఆమె కృషికి గుర్తింపు లభించింది. ఆ సంవత్సరం ఆమెకు 'ఎలక్ట్రానిక్ ఫ్రంటైర్ ఫౌండేషన్ పయనీర్ అవార్డు లభించింది. ఎలక్ట్రానిక్ రంగం అభివృద్ధికి ఎంతో మేలు చేసిన లామర్ జనవరి, 2000 సంవత్సరంలో మరణించింది.

## సీసీ టీవి, సెక్యూరిటీ సిస్టమ్

ఎన్నో నేరాలు, ఘోరాలను సమర్థవంతంగా కనుక్కోవడానికి ఉపయోగపడే సీసీటీవి రూపొందించిందీ ఓ మహిళనే. ఆఫీసుల్లోనూ, అపార్ట్‌మెంట్లు, గృహాల్లో కనిపిస్తున్న సీసీ టీవి, కెమెరాలకు ఆద్యురాలు మేరీ వాన్ బ్రిట్టన్ బ్రౌన్ (Marie Van Brittan Brown). మేరీ వృత్తిరీత్యా నర్సు. ఆమె భర్త అల్బర్ట్ ఎలక్ట్రీషియన్. ఆమె నివసించే ప్రాంతంలో రాత్రి సమయంలో నేరాలు ఎక్కువగా జరుగుతుండేవి. వాటినుంచి తప్పించుకోవడానికే మేరీ ఆమె భర్త కలిసి సీసీ టీవి సెక్యూరిటీ సిస్టమ్‌ను రూపొందించారు. మూడు అంచెలలో దీన్ని రూపొందించారు. దీన్ని ఎలా రూపొందించాలి? ఎలా ఉండాలి? అన్న ఆలోచన మేరీదే! 1966లో వారు రూపొందించిన సీసీటీవి సెక్యూరిటీ సిస్టమ్‌కు పేటెంట్ లభించింది.

## ఫైర్ స్టేర్‌కేస్

అమెరికాకు చెందిన అన్నా కెనిల్లి రూపొందించిన ఫైర్ స్టేర్‌కేస్ ఆధునిక స్టేర్‌కేస్‌లకు ఆధారమైంది. ఈమె రూపొందించిన స్టేర్‌కేస్ బహుళ అంతస్తులలో నివసించే వారికి చాలా ఉపయోగపడింది. అత్యవసర సమయాల్లో భవనాల్లోని వారిని రక్షించడానికి పనికి వచ్చింది. భవంతిలో ఎలాంటి మార్పులు చేయకుండానే ఏర్పాటు చేసుకునే అవకాశం అన్నా రూపొందించిన స్టేర్‌కేస్‌కి ఉంది.

**-భారతీదేవి**










**తలుపు తట్టాను.**

**కానీ, గుండెలు పీచుపీచుమంటున్నాయి. మేడమ్ నన్ను ఎంటెక్ చదువుతూ, సినిమా మీదున్న పాషన్‌తో, చదువు మధ్యలో ఆపేసి, మంచి సినిమాలు తీసే అభిరుచి ఉన్న దర్శకుణ్ణని మాత్రమే అనుకుంటోంది. ఇప్పుడు, మేడమ్... మా ఆఫీసు నుండి తెప్పించిన సీసీటీవి ఫుటేజ్‌లో జలజతో నా శృంగార కలాపం చూసి, నా మీద చెడ్డ అభిప్రాయం ఏర్పరచుకుంటుందేమోనని నాకు భయమేస్తోంది. మేడమ్‌కి నా మీద చులకన భావం ఏర్పడితే, నన్ను ఆ దేవుడు కూడా రక్షించలేడు. అందుకే లోపలికి వెళ్తే ఏమవుతుందోనన్న ఆలోచనే నాకు వణుకు పుట్టిస్తోంది.**

"కమిన్!" అనగానే లోపలికి అడుగుపెట్టాను.

విశాలమైన హాల్లో, మేడమ్ సోఫాలో కూర్చొని ఫోన్‌లో ఎవరితోనో మాట్లాడుతోంది. ఆమె ముఖం చాలా సీరియస్‌గా ఉంది.

నేను కనపడగానే కుర్చీలో కూర్చోమని సైగ చేసింది.

'సారీ సర్! నేనా పని చేయలేను." ఫోన్లో ఎవరితోనో కోపంగా అంటోంది.

".... ... ..."

"ప్లీజ్! లెట్‌మీ డూ మై జాబ్!... అది కాదు సార్! మీరు వినండి సార్ నేను చెప్పేది. మీరు మంత్రిగారే, నేను కాదనటం లేదు. కానీ ఈ విషయంలో దయచేసి నన్ను ఫోర్స్ చేయొద్దు సార్! నా దగ్గర ఎటువంటి వీడియో రికార్డింగ్స్ లేవు సార్! నా మాట నమ్మకపోతే నేనేం చేయాలి సార్!"

".... ...."

"ఆహాc... ఏం చేస్తారు సార్! మాఫియా వాళ్ళైతే మాత్రం చంపేస్తారా? ఐ విల్ ఫేస్ యిట్!"

"నేను కూడా అదే అంటున్నాను సార్! ఇది పక్కా ప్రొఫెషనల్ కిల్లర్స్ పనే! నాకే గనుక ఎవిడెన్స్ దొరికి ఉంటే... నా కొడుకుల్ని ఈ పాటికి ఎన్‌కౌంటర్లో లేపేసేదాన్ని!"

'ఎవిడెన్స్' అన్న మాట వినగానే నా గుండె జారిపోయింది.

"... ... ..."

"ప్లీజ్! ఇది మర్డర్ కేస్ సార్! నాట్ ఏన్ ఆర్డినరీ మర్డర్. బ్రూటల్, బార్బారిక్ మర్డర్!... ఓకేసార్! నాకేం భయం లేదు. మీరు అంతకన్నా ఏం చేయగలరు. ట్రాన్స్ఫర్ చేస్తారు. నేను ఎక్కడికి పోయినా, ఐపీయస్ ఆఫీసర్‌నే గానీ, హోం గార్డును కాను కదా సార్!"

మేడమ్ ముక్కుపుటాలు అదురుతున్నాయి. కళ్ళు ఎర్రబడ్డాయి. ఆవేశంగా లేచి నిలబడి,

"చూస్కుందాం సార్! బట్‌సర్! ఒక్క విషయం. నాకు గనుక కరెక్ట్ ఎవిడెన్స్ దొరికిన మరుక్షణం నేనేం చేస్తానో నాకేతెలియదు? ఆ ఎవిడెన్స్‌కు తోడు ఇప్పుడు మీరు మాట్లాడిందంతా రికార్డు చేశాను సార్! రేపు నాకేదైనా అయితే ముందు మీ పేరే బైటకొస్తుంది. అట్లాంటి ఏర్పాట్లన్నీ చేసిపెట్టాను.

### జరిగిన కథ

ఆస్కార్ అవార్డులపోటీల్లో అన్యభాషా చిత్రాల జాబితాలో అతడి చిత్రం ఎంపికైన సందర్భంగా ఆమెరికా వెళుతున్నాడతను. విమానంలో కూర్చుని గతం గుర్తుచేసుకున్నాడు. అతడో తెలుగు దర్శకుడు. హైద్రాబాద్‌లో జూనియర్ ఆర్టిస్ట్‌పై జరిగిన హత్యాయత్న దృశ్యాలను సెల్‌ఫోన్లో క్యాచ్ చేసిన పాపానికి అతడే నేరస్థుడవుతాడు. డీసీపీ పుష్పాకిరణ్ మధ్యవర్తిత్వంతో నిర్మాత లొంగి వస్తాడు. పూటకు టికాణా లేని దర్శకుడి దశతిరుగుతుంది. దేశం గర్వించదగ్గ గొప్ప సినిమా నిర్మించేందుకు కథాన్వేషణలో పడతాడతను. అంతలోనే నటి జలజ హత్యకు గురవుతుంది. ఆ హత్యానేరం మీద పడకుండా డీసీపీ సలహాతో సురక్షిత ప్రాంతానికి వెళ్ళిపోతాడతడు. ఆ తర్వాత.....

ఉంటాను సార్! నమస్కారం సార్!" అని ఫోన్ సోఫాలోకి విసిరి కొట్టింది.

మేడమ్ లేచి నిలబడగానే, నేనూ వణుకుతూ లేచి నిలబడ్డాను. మేడమ్ రెస్ట్‌లెస్‌గా అటూ యిటూ తిరగసాగింది. ఆమె అలా తిరుగుతుంటే, నేనేం చేయాలో, నాకేం అర్థం కాలేదు. బహుశా, ఆమె ఏదో స్ట్రాటజీ ప్లాన్ చేసుకుంటున్నట్టు అని పించింది. ఇటువంటి టైంలో, డిస్టర్బ్ చేయకుండా ఉండడమే మంచిది.

ఐదు నిమిషాల తరువాత మేడమ్ స్థిమితపడి సోఫోలా కూర్చుంది.

"కమాన్! టేక్ యువర్ సీట్! బాగా టైర్డ్ అయినట్టుంది?" అవునంటూ తలూపి, నేను కూర్చున్నాను.

"అర్థమైందా?"

నేను మాట్లాడలేదు.

"ఇదంతా జలజ మర్డర్ గురించే....! దీంట్లో పెద్ద పెద్ద రాజకీయనాయ కులు, గూండాలు ఇన్వాల్వ్ అయ్యారని నా డౌట్? నాకిక్కడ ఉండడం కూడా సేఫ్ అనిపించటం లేదు" అంది కొంచెం గాభరాగా.

నేను విస్తుపోయాను.

"మేడమ్! పోలీస్ క్వార్టర్లలో ఐపీ యస్ ఆఫీసరైన మీకు సేఫ్టీ లేదా?" అన్నాను ఆశ్చర్యంగా.

"పోలీసు వ్యవస్థలో ఎన్నో చీడ పురుగులున్నాయి. వీటికితోడు రాజకీయ రాబం దులు తోడయ్యారు. న్యాయం, ధర్మం, చట్టం అన్నీ మాయమాటలే. ఎవడి స్వార్థం వాడిదే. ఈ వెధ వలకు వేల కోట్లు సంపాదించినా చాలదు. వందల ఎకరాల భూములున్నా సరిపోవు. అసలు జలజని ఎందుకు హత్యచేశారో తెల్సా?" అని ఒక్క క్షణం ఆగింది.

'జలజని ఎందుకు చంపారు మేడమ్?' ఆవేద నగా అడిగాను.

'ఆగు, ఒక్క క్షణం!' అంటూ ట్రౌజర్స్‌కు ఉన్న హోల్డర్‌లో నుంచి రివాల్వర్ తీసి చేతిలో పట్టుకుని తలుపు దగ్గరకు వెళ్ళి దఢాలున తెరిచింది.

దూరంగా ఒక వ్యక్తి కనిపించాడు.

"ఎవరూ?" అని అడిగింది మేడమ్ కోపంగా.

"మేడమ్! ఆన్‌డ్యూటీ ఎస్.ఐ. రాజీవ్‌ని మేడమ్"

"ఇక్కడేం చేస్తున్నావ్?"

"రొటీన్ రౌండ్స్ మేడమ్! నథింగ్ స్పెషల్ మేడమ్!" అని అటెన్షన్‌లో నిలబడి అన్నాడు.

"గెట్‌లాస్ట్! నీ పోస్ట్‌కు వెళ్ళి డ్యూటీ చెయ్, చెంచాగిరి చెయ్యకు. బ్లడీఫూల్!" అని గట్టిగట్టిగా అరిచింది.

"యస్ మేడమ్!" అంటూ అతను వెళ్ళడం, నేను కిటికీలో నుండి చూశాను.

"బ్లడీషిట్!" అంటూ మేడమ్ సోఫాలో కూల బడిపోయింది.

టైం రాత్రి పది దాటింది.

"తిన్నావా?"

"లేదు, మేడమ్!"

"ఊ.... " అంటూ ఆలోచనల్లో మునిగిపోయింది. ఐదు నిమిషాల తర్వాత ఒక నిర్ణయానికొచ్చి నట్టు నిలబడింది.



"డూ యూ డ్రైవ్?" అని అడిగింది.

'కారు నడుపుతాను మేడమ్!" అన్నాను.

"గుడ్! యూహావ్ టు హెల్ప్ మీ ఔట్. నేను డీల్ చేస్తున్న జలజ కేసు చాలా డేంజరస్‌గా మారింది. కేసు డ్రాప్ చేయమని నా మీద చాలా ఒత్తిళ్ళు వస్తున్నాయ్! పొద్దుటి నుంచి ప్రెస్ వాళ్ళేమో డెవలప్మెంట్స్ చెప్పమనీ, మా బాస్ ఏమో ఏమైనా ప్రోగ్రెస్ ఉందా అనీ, పొలిటికల్ లీడర్సేమో నోరు విప్పొద్దనీ, మంత్రులేమో ఉద్యోగం ఊడుతుందనీ, ట్రాన్ఫర్ అవుతుందనీ నానా విధా లుగా ప్రశ్నిస్తున్నారు... బెదిరిస్తున్నారు. ఐ యామ్ టైర్డ్ ఆఫ్ ఆల్ దీజ్ డెవలప్మెంట్స్. ఫోన్‌లో పని కాలేదని, డైరెక్టుగా ఇంటికే వస్తారు. నేనుండే ప్లేస్ వాళ్ళకి తెలుసు. ఇంటికొచ్చి బ్రతిమిలాడతారు. వినకపోతే బెదిరిస్తారు.

కానీ, నేను ఈ కేసు అంతుచూడనిదే వదలదల్చు కోలేదు. ఈ మర్డర్ వెనుక ఎవ్వరున్నా నేను వద లను. ఒక స్త్రీని ఘోరాతిఘోరంగా మానభంగం చేసి ముక్కలుముక్కలుగా నరికి చంపడం ఎంత హేయమైన చర్య. దీని వెనుక ఎవరున్నారో నేను

పట్టిస్తాను. అందుకే, థ్రెటెనింగ్ కాల్స్ మొదలయ్యాయి. కానీ, నాక్కూడా ఏంచేయాలో తెలుసు. బట్, ఐ నీడ్ సమ్ పీస్‌ఫుల్ టైం! ఐ నీడ్ మై స్పేస్! ఐ నీడ్ సమ్ అన్ ఇంటరప్టెడ్ స్లీప్! అందుకే, నాక్కొంచెం ప్రశాంతంగా ఆలోచించుకోవడానికి, ఈ రాత్రి గడపడానికి ప్లేస్ కావాలి.

నీకో ఫ్లాట్ ఉంది కదా? కెన్ ఐ స్పెండ్ టునైట్ దేర్! రేప్పొద్దుటికల్లా ఏదో ఒకటి చేస్తాను".

"అయ్యో! మేడమ్, మీరడగాలా? రండి మేడమ్ వెళ్దాం!" అన్నాను ఉత్సాహంగా.

మేడమ్ నా హెల్ప్ కోరడమంటే నా గురించి మంచి అభిప్రాయం ఉన్నట్టే. నాకెంతో సహాయం చేసిన మేడమ్‌కి ఎంతో ఋణపడి ఉన్నాను. ఆమె కోసం ఏం చేయడానికైనా నేను సిద్ధమే. నా మాటల్లో ఆ గ్రాటిట్యూడ్ కనిపించిందేమో,

"ఓకే! లెటజ్‌ప్లాన్! ఇక్కడి నుండి సీసీటీవి కళ్ళు గప్పి బైటపడడం అంత ఈజీకాదు. ఎందుకంటే, నువ్వొచ్చినప్పటి దృశ్యాలు కూడా రికార్డు అయి ఉంటాయి. కాబట్టి నువ్వు వెళ్ళిపోవాలి. సీసీటీవీల్లో పడకుండా మళ్ళీ రావాలి. అలా చేయగలవా?" అని ప్రశ్నించింది.

నేను ఆలోచించి, 'సరే' అన్నాను.

నేను బైటకు వెళ్ళి, కొంచెం దూరం నడిచి, ఆటో తీసుకుని, ముఖానికి కర్చీఫ్‌తో ముసుగు కట్టుకుని డైరెక్ట్‌గా క్వార్టర్స్‌లోకి ప్రవేశించాను.

"గుడ్! ఇప్పుడు మనం ఎలా బైటపడాలో చెప్తాను. జనరల్‌గా మేం ఎప్పుడు అవసరం పడితే అప్పుడు బైటికెళ్ళడానికి వెహికల్, డ్రైవర్, మా డిస్పోజల్‌లో ఉంటారు. ఇప్పుడు నువ్వే డ్రైవర్‌గా నటించాలి. క్యాంప్‌రూంలో మా స్టాఫ్, డ్రైవర్ ఉంటారు. నేను ఏదో ఒకటి చెప్పి, వెహికల్ కీస్ తెప్పిస్తాను. నువ్వెళ్ళి గ్యారేజ్‌లో నుంచి కారు తీసుకుని, మెట్లదగ్గరకు రా. సీసీటీవీల్లో పడకుండా ఇందాకటి మాదిరిగానే ముఖానికి, కర్చీఫ్‌కట్టుకో".

"గేట్ దగ్గర ఆపితే 'మేడమ్ బాహర్ జా రహేహై' అని కొంచెం కరుకుగా అను. ఇంకేమైనా ప్రశ్నలు అడిగితే నేను సమాధానం చెబుతాను. నేను ఫైవ్ మినిట్స్‌లో వచ్చేస్తాను" అంటూ లోపలికి వెళ్ళింది.

నాకు చాలా ఎక్సైటింగ్‌గా ఉంది. ఒక ఇంగ్లీష్ స్పై సినిమాలో రోల్ పోషిస్తున్నంత ఉద్వేగంగా ఉంది.

పది నిమిషాల్లో, ఐపీయస్ ఆఫీసర్స్ క్వార్టర్స్ ప్రాంగణం నుంచి బయటపడ్డాం. మేడమ్ ఎన్నో ముందుజాగ్రత్తలు తీసుకుంది గానీ, తీరాచూస్తే, గేటు బార్లా తీసి ఉంది. ఒక్క కానిస్టేబుల్ కూడా లేడు.

"చూశావా? ఇదీ మాకున్న సెక్యూరిటీ!" అంటూ మేడమ్ నవ్వింది.

కారు రెండు ఫర్లాంగులు ప్రయాణించగానే, ఒక జంక్షన్ దగ్గర కారు వెనక్కు తిప్పమంది. నేను ఆశ్చర్యపోయినా, అలాగే చేశాను. కొంచెం దూరం పోయిన తర్వాత, ఒక ఖాళీ కాంపౌండ్ కనిపిస్తే, అందులోకి కారు పోనిమ్మంది. కాంపౌండ్‌లోకి వెళ్ళగానే, కారు దిగింది. ఆమెను చూసి, వాచ్‌మన్ పరుగెత్తుకుంటూ వచ్చి నమస్కారం చేశాడు.

"క్యా యూసుఫ్? కైసే హై? రహీం కిదర్ హై" అంటూ పలకరించింది.

"నమస్తే అమ్మా! రహీం కోదాడలోనే ఉన్నాడమ్మా. ఇప్పుడు ఫైనల్ ఇయర్ అమ్మా! మీరే కదమ్మా సీట్ ఇప్పించింది.

"సరే! యూసుఫ్. కారు లోపలపెట్టు. ఎవ్వరికీ తెల్వ కూడదు. పోయి ఒక ఆటో పట్టుకుని రా ఫో!" అంది.

యూసుఫ్ పరుగు పరుగున వెళ్ళి ఆటో తీసుకు వచ్చాడు. ఆటో వచ్చేసరికి మేడమ్ మేలి ముసుగు ధరించింది. నేను ఆల్రెడీ ముసుగులోనే ఉన్నాను.

అరగంటలో ఆటో మా అపార్ట్‌మెంట్ ముందు ఆగింది. ఆటో దిగి "నీ ఫ్లాట్ నంబర్ ఎంత?"

నేను చెప్పాను.

"నువ్వు ముందు వెళ్ళు. నేను పది నిమిషాలు ఆగి వస్తాను. కజిన్ వస్తుంది, వదలమని సెక్యూరిటీకి చెప్పి వెళ్ళు" అని కొంచెం ముందుకు నడిచింది.

పది నిమిషాల్లో మేడమ్ నా ఫ్లాట్‌లోకి వచ్చి నిలబడింది.

"హమ్మయ్య!" అంటూ స్కార్ఫ్‌తీసి విసిరేసి, స్వేచ్ఛా విహంగంలా రెండు చేతులూ చాచి నిట్టూర్పు విడిచింది.

ఆమెను ఎవరైనా ఇప్పుడు చూస్తే డీసీపీ అనుకోలేరు. జీన్స్ ప్యాంట్, ఎల్లోటాప్‌తో కాలేజ్ గర్ల్‌లా, కుసుమ కోమలమైన తాజా పుష్పంలా ఉంది.

"థాంక్యూ!" అంటూ నన్ను దగ్గరకు లాక్కొని చెంప మీద కిస్ చేసింది.

"హమ్మయ్య!" అని మళ్ళీ అంటూ రిలాక్స్‌డ్‌గా సోఫాలో కూలబడి పోయింది.

ఐదు నిమిషాలు కళ్ళు మూసుకుని రిలాక్స్ అయ్యాక, కళ్ళుతెరిచి "వాట్ అబౌట్ ఫుడ్! పొద్దుటి నుంచి, ఈ గొడవలో పడి సరిగ్గా తినలేదు. నువ్వు తిన్నావా?"

**జలజ హత్యకి సంబంధించిన వీడియో డీసీపీ పుష్పాకిరణ్ దగ్గర ఉంది. ఆమె రహస్యంగా దాచి ఉంచిందా వీడియోని. రాజకీయ నేతలు ఆమెపై ఒత్తిడి తెస్తున్నారు. తన దగ్గర ఎలాంటి సాక్ష్యాధారాలు లేవని నమ్మబలుకుతోందామె. కానీ వాళ్ళు నమ్మడం లేదు. ఇప్పుడు ఆమె ప్రాణాలకు ముప్పు వచ్చింది. మరి అప్పుడు డీసీపీ ఏం చేసింది? ఆ దర్శకుడు డీసీపీకి ఎలాంటి సహాయం చేశాడు?**

"లేదు మేడమ్! పొద్దున్నే మీరు ఫోన్ చేసినప్పటి నుండి పరుగోపరుగు. 'రేస్ అగైనెస్ట్ టైం!' మధ్యలో ఒక ప్లేట్ ఇడ్లీ తిన్నాను. కానీ, ఇప్పుడు ఆకలి దంచేస్తోంది. నేను బైటకెళ్ళి తెస్తాను మేడమ్! ఏం తెమ్మంటారు? వెజ్ ఆర్ నాన్‌వెజ్?"

"నాన్‌వెజ్! యాక్... నేను పక్కా శాఖాహారిని. వెగాన్" అని,

"అవునూ... డూ యూ బూజ్?" అని అడిగింది.

ఆ బూజేంటో నాకు అర్థం కాలేదు. నేను ప్రశ్నార్థకంగా చూశాను.

"అదేనయ్యా మహానుభావా! మందు కొడతావా?" అని అడిగింది.

"అప్పుడప్పుడు" అన్నాను సంశయంగా.

"కమాన్... సిగ్గుపడకు. ఫుడ్‌తోపాటు వోడ్కా, మంచి ఫారిన్ బ్రాండ్ తీసుకురా, లెటజ్ చిల్ ఔట్!" అంది.

నేను నోరు వెళ్ళబెట్టాను.

"అంత సర్‌ప్రైజ్ ఎందుకు? ఐయామ్ మోడ్రన్ గర్ల్. పబ్బులక్కూడా వెళ్తాను. మందు కొడ్తాను. డాన్స్ చేస్తాను. అఫ్కోర్స్ ఢిల్లీకి వెళ్ళినప్పుడు మాత్రమే. కానీ, ఇవ్వాళ, టుడే ఈజ్ ఏ డిఫరెంట్ డే. ఐ నీడ్ టు రిలాక్స్. నాకంటే ముందు నీకే అవసరం ఇవాళ!" అంది.

"నాకా? నాకు పెద్దగా అలవాటు లేదు మేడమ్!" అన్నాను గాభరాగా.

"నో, ఈ రోజు ఆ అవసరం ఉంది. వెళ్ళు".

నేను ఆశ్చర్యంగా చూసి, బైటకెళ్ళి అరగంటలో డ్రింక్స్, మంచింగ్ ఫుడ్ తెచ్చాను.

మేడమ్ చాలాకొద్దిగా, ఒక్క పెగ్ అరగంట సేపు సిప్ చేసింది. చాలా లైట్‌గా ఫుడ్ తీసుకుంది.

"అదేంటి మేడమ్? మందు నాకెందుకు అవసరం?" అని నేనడిగితే,

"చెప్తా!" అంది.

ఇద్దరం కలిసి డిషెస్, సింకులో పడేసి కూర్చున్నాం.

నేను ఒక విధంగా, తనొక విధంగా లూసెన్ అయ్యాము.

ఎందుకంటే, మా ఇద్దరి ఉద్రిక్త పరిస్థితికి కారణం ఒక్కరే - జలజ.

"నీకో విషయం చెప్పాలి" అంటూ నా పక్కన వచ్చి కూర్చుంది.

ఇద్దరి శరీరాల్లో యవ్వనం, యాంగ్జైటీ, మత్తు ప్రవహిస్తోంది. ఆమె టచ్‌తో నాలో పులకింత మొదలైంది. మేడమ్ అదేం పట్టనట్టుగా లాప్టాప్ చూస్తూ ఉంది.

"చెప్పండి మేడమ్!" అన్నాను.

"చెప్పడం కాదు... చూపిస్తాను" అంటూ తన పాకెట్‌లో నుంచి పెన్‌డ్రైవ్ తీసి లాప్టాప్‌లో ఇన్సర్ట్



చేసి 'ప్లే' బటన్ నొక్కింది.

స్క్రీన్ మీద కనిపించిన దృశ్యం చూసి నా మతి పోయింది. కళ్ళు తిరగసాగాయి.

•••

"చీకటిగా ఉన్న గదిలోకి ముందుగా జలజ ప్రవేశించింది. లైట్ వేయగానే, ఆ గదంతా వెలుగులతో నిండిపోయింది. నా ఆఫీసుకు వచ్చినప్పటి, అదే పచ్చరంగు చీరలో జలజ మెరిసిపోతోంది. కానీ, ఆమె ముఖం మీద ఆందోళన, విషాదపు తెరలా ఆవరించుకుని ఉంది. ఆమె వెనుకగా ఆ గదిలోకి అడుగుపెట్టిన వ్యక్తి జలజని ఏదో అడిగాడు. జలజ లేదన్నట్టుగా తలూపింది. కానీ, అతను నమ్మినట్టుగా లేదు. జలజలో భయం పొడసూపింది".

జలజతోపాటు ఆ గదిలోకి ప్రవేశించిన వ్యక్తిని ఎక్కడో చూసినట్టుంది. కానీ ఎవరో తెలియడం లేదు. సీక్రెట్ కెమేరాలో రికార్డయిన దృశ్యాలు కాబట్టి స్పష్టంగా కనిపించడం లేదు.

"ఆమెతో వచ్చిన వ్యక్తి గదినంతా పరీక్షించి చూశాడు. తన బ్యాగులో నుంచి ఒక సెర్చింగ్ డివైజ్ తీసి గోడలు, సీలింగ్ అంతా చెక్ చేశాడు. ఎక్కడా సీక్రెట్ కెమేరాలు కనిపించకపోవడంతో శాటిస్‌ఫై అయినట్టుగా తల ఊపి, జలజను దగ్గరకు లాక్కున్నాడు. పహిల్వాన్‌లా ఉన్న వాడి బిగి కౌగిలిలో, పాము నోటికి చిక్కిన పక్షిలా, జలజ గిలగిలలాడింది. వాడు ఆమెను ఆబగా ఒళ్ళంతా ఎక్కడ పడితే అక్కడ తడుముతూ జాకెట్లో చెయ్యిపెట్టి ఏదో చేయాలని తొందరపడుతుంటే జలజ విసుక్కుంది. 'ఏంటి?' అన్నట్టు ఉరిమి చూశాడతను. బాత్‌రూంకు వెళ్తానన్నట్టుగా వేలు చూపించి లోపలికి నడిచింది. జలజ లోపలికి వెళ్ళగానే ఆ వ్యక్తి కప్‌బోర్డ్స్, టేబుల్ డ్రాయర్స్, లెటర్ బాక్సులన్నీ గబగబా వెతికాడు. ఏమీ దొరకలేదు. జలజ వచ్చేసరికి, ఏం ఎరగనట్టుగా వచ్చి సోఫాలో కూర్చున్నాడు. గదిలోకి వచ్చిన జలజ ముఖంలో ఇబ్బంది స్పష్టంగా కనిపిస్తోంది".

**సినీవాలి**

**కూపన్ నెం.4 విజేత**

**ఆర్. విజయలక్ష్మి**

**సీతమ్మధార, విశాఖపట్నం**

మేడమ్ లాప్టాప్‌లో పాజ్‌బటన్ నొక్కి వీడియోను ఆపుచేసి 'వాడెవడో తెల్సా?' అని నా వైపు చూస్తూ ప్రశ్నించింది.

నేను తెలియదన్నట్టుగా తల అడ్డంగా ఊపాను.

'వాడు సయీమ్! నక్సలైట్‌గా జీవితం మొదలుపెట్టి, పోలీసాఫీసర్లను చంపేస్థాయికి ఎదిగి, చివరకు పోలీసులకు ఇన్ఫార్మర్‌గా మారి నక్సలైట్లను హతమార్చే యాంటీ నక్సల్స్ స్క్వాడ్ లీడర్‌గా మారాడు. ఆ క్రమంలో పోలీసులు, రాజకీయనాయకులు, సినిమా ప్రొడ్యూసర్లు, హీరో, హీరోయిన్లతో సంబంధాలు పెంచుకుని, ఓ పెద్ద నేర సామ్రాజ్యాన్ని స్థాపించాడు. అట్లాంటివాడితో, జలజకేం సంబంధమో అర్థం కావడం లేదు" అంటూ నా వంక చూసింది.

నేను కూడా నాకేం తెలియదన్నట్టుగా భుజాలు ఎగరవేశాను.

మేడమ్ వీడియోను స్టార్ట్ చేసింది.

"జలజ ఇబ్బందిని ఏ మాత్రం పట్టించుకోకుండా సయీమ్ జలజని గట్టిగా కౌగలించుకుని చీరను లాగేసి ఎత్తుకుని బెడ్‌రూం వైపు నడిచాడు".

సీన్ బెడ్‌రూంకు మారింది.

"జలజ వద్దని ఎంత వారిస్తున్నా వినకుండా వాడు ఆమెను వివస్త్రను చేశాడు".

మేడమ్ నా వైపు చూసింది. నేను సిగ్గుతో తల వంచుకున్నాను.

"వాడు జలజను మంచం మీద పడేసి, తన బ్యాగులో నుంచి బ్లాక్‌సిల్క్ తాళ్ళు తీశాడు. వాటిని మురిపెంగా చూస్తూ, జలజవైపు చూపుతూ, వెకిలిగా నవ్వుతూ, కిందకు మీదకు ఊపుతూ, ఆమె కాళ్ళూ చేతులూ నాలుగు మూలలకు లాగుతూ, మంచానికి నాలుగు వైపులా సిల్క్ తాళ్ళతో కట్టేశాడు".

"జలజ గింజుకుంటుంటే వాడు క్రూరంగా నవ్వడం మొదలుపెట్టాడు. జలజనోట్లో గుడ్డలు కుక్కాడు. "ప్లీజ్ ప్లీజ్! వద్దు వద్దు!" అంటున్నట్టుగా ఆమె పెదాలు కదులుతున్నాయి. వాడు బ్యాగులో నుంచి చిన్నపాటి హంటర్ తీశాడు. తను కూడా బట్టలు విప్పాడు".

మేడమ్ తల తిప్పుకుంది. నేను మాత్రం చూస్తూ ఉండిపోయాను.

"ఆ హంటర్ పట్టుకుని మంచం చుట్టూ తిరుగుతూ ముందు సున్నితంగా, చిన్నచిన్నగా, హంటర్‌ను ఆమె ఒంటికి రాస్తూ, ఆమె గింజుకుంటుంటే పిచ్చిగా, వెర్రిగా నవ్వుతూ, చిన్నగా కొట్టడం మొదలుపెట్టాడు. జలజ ఏడుస్తూ అతనికి దండం పెడుతున్నట్టుగా తలతో సైగలు చేస్తోంది. జలజ ఏడుస్తున్నకొద్దీ వాడు హంటర్‌తో గట్టిగా కొట్టడం

**ఈవారం సినీవాలి చదివారు కదా!**
**మా ప్రశ్నకు మీ జవాబు క్రింది కూపన్‌లో స్పష్టంగా రాసి**
**కూపన్‌ని కత్తిరించి మాకు పంపండి. లక్కీడిప్‌లో ఫ్యాన్సీ చీర గెలుచుకోండి!**

**సినీవాలి -6 (23-11-2016)**

మా ప్రశ్న: **జలజతో పాటు ఆ గదిలోకి ప్రవేశించిన వ్యక్తి ఎవరు?**

మీ జవాబు--------------------------------------------------------------------------------

చిరునామా--------------------------------------------------------------------------------

----------------------------------------------------------------------------------------

---------------------------------------------పిన్----------------------ఫోన్‌నెం.------------------------

**ఈ కూపన్‌ను 22 నవంబర్ 2016 తేదీలోగా మా కార్యాలయానికి పంపగలరు.**

మా చిరునామా: నవ్య వీక్లీ, ఆంధ్రజ్యోతి బిల్డింగ్స్, ప్లాట్ నెం. 76, రోడ్ నెం 70, అశ్వనీ లే అవుట్, హుడా హైట్స్, జూబ్లీ హిల్స్, హైదరాబాద్-33

వివాహాది శుభకార్యాలకు కంచిపట్టు చీరల నిలయం పి.యన్.మూర్తి క్లాత్‌స్టోర్స్ మెయిన్ రోడ్, హన్మకొండ వారి సౌజన్యంతో...

మొదలుపెట్టాడు. వాడు కొట్టి హంటర్ తీయగానే, పచ్చని జలజ ఒంటి మీద, వాతలు పడి, చర్మం చిట్లి, రక్తం కారడం మొదలైంది. జలజ విలవిలలాడుతోంది. కళ్ళ నుండి నీళ్ళు రాలి పోతున్నాయి. ఆమె కన్నీటికి వాడి మనసేమీ కరగలేదు. వాడి కర్కశచర్యలు కూడా ఆగలేదు. చివరికి వాడు ఆయాసంతో అలసి సొలసి మంచం మీద కూర్చున్నాడు. వాడు, వాడి బ్యాగులో నుంచి సిరంజీ తీసి అందులోకి చిన్న బాటిల్లోని మందును ఎక్కించి తన తొడకు గుచ్చుకున్నాడు. ఆ మందు ఒంట్లోకి ఎక్కిందో లేదో వాడి కళ్ళు ఎరుపెక్కాయి. ఆయాసం మాయమై, వాడు జూలు విదుల్చుకున్న సింహంలా లేచాడు. మంచం నాలుగు దిక్కులకు కట్టిన తాళ్ళను కత్తితో తెంపి జలజ మీద పడ్డాడు".

"మేడమ్!" అని నేను గట్టిగా అరిచాను.

ఏదో ఆలోచిస్తున్న మేడమ్ ఒక్కసారి ఉలిక్కిపడి, పాజ్ బటన్ నొక్కింది.

"ప్లీజ్. ఆపండి మేడమ్! నేను చూడలేను" అంటూ లేచి గోడకు ఆనుకుని వెక్కివెక్కి ఏడ్చాను.

"ఇప్పుడు అర్థమైందా, వోడ్కా ఎందుకు తెమ్మన్నానో! ఒక పురుషుడివైన నువ్వే, స్నేహితుడివైన నువ్వే, ఈ దృశ్యాలు చూడలేక పోతున్నావు. ఒక స్త్రీగా ఈ వీడియోను  నేను ఇప్పటికి ఐదారు సార్లు చూశాను. నా పరిస్థితి ఎలా ఉంటుందో ఊహించు?"




నేను తల అడ్డంగా ఊపాను.

'భగవాన్! ఏమిటిది? పువ్వులాంటి ఒక స్త్రీని ఇంత కర్కశంగా నలిపి వేయడానికి వాడికి మనసెలా వచ్చింది?' అని మనసులోనే దేవుడితో మొర పెట్టుకున్నాను.

మేడమ్ నా దగ్గరకు వచ్చి, నా భుజం తట్టింది.

"జలజ చాలా తెలివిగలది. నేను ఐదారుసార్లు చూశాను కాబట్టి తనెంత తెలివైందో అర్థమైంది. సయీామ్ ఆమె కార్లో ఎక్కగానే, ఫోన్లు స్విచాఫ్ చేసినట్టుంది. మాఫియా లీడర్లు చాలాజాగ్రత్తలు తీసుకుంటారు. సెల్‌ఫోన్లు స్విచాఫ్ చేస్తారు. తాము వాడే ఫోన్లను, సిమ్‌కార్డులను తరచుగా మార్చేస్తుంటారు. సాధారణంగా తమను గుర్తుపట్టే ప్రమాదమున్న ప్రదేశాలకు వెళ్ళరు. ఎంతో అవసరమైతే తప్ప తెలిసినవాళ్ళ ఇళ్ళకు కూడా వెళ్ళరు. అట్లాంటిది సయీామ్ అంతటి డాన్, జలజ ఇంటికి వెళ్ళాడంటే, ఏదో మతలబు ఉంది. సెక్స్ ఒక వంక మాత్రమే. వాడికి సెక్స్ కావాలంటే, జలజనే తను ఎక్కడుంటే అక్కడకు పిలిపించుకునే వాడు.

సయీామ్ ఎన్ని జాగ్రత్తలు తీసుకున్నా, జలజ ఇంకో ఆకు ఎక్కువ చదివింది. సయీామ్ సీక్రెట్ కెమేరాల కోసం, గోడలు, రూఫ్ చూశాడు గానీ, జలజ తన ఫ్లాటులో మోషన్ సెన్సర్‌తో పనిచేసే కెమేరాలను ఫ్లోరింగ్‌లో ఫిక్స్ చేయించినట్టుంది. సయీామ్ తనను బలవంతంగా కారులో ఎక్కించుకుని తన ఫ్లాటుకే తీసుకురావటం వెనుక ఏదో ప్రమాదం ఉందని పసిగట్టిన జలజ, ఇంటి తాళం తీస్తూనే మోషన్ సెన్సర్లను యాక్టివేట్ చేసినట్టుంది. ఈ కెమేరాలు బైటకు కనపడవు. డివైజెస్‌కు దొరకవు. రిమోట్ టెక్నిక్‌తో పనిచేస్తాయి. అందుకే, సయీామ్ ఎంత వెతికినా కనపడలేదు. అందుకే, జలజ ఆ బటన్ ఆన్ చేయగానే ఇంట్లోని అన్ని రూముల మూలమూలల్లో కన్సీల్ చేయబడిన అనేక కెమేరాలు వీడియో రికార్డు చేశాయి. అందుకే, మనకు మొత్తం వీడియో రూపంలో ఎవిడెన్స్ లభించింది. ఇంతవరకు సయీామ్‌ను బుక్ చేయడానికి  ఎంతోమంది  ప్రయత్నించారుకానీ, ఎక్కడా చిన్నమెత్తు సాక్ష్యం లభించలేదు. అట్లాంటిది, జలజ వల్ల లభించిన ఈ ఎవిడెన్స్ ఆటం బాంబు లాంటిది. ఇది నా దగ్గర ఉందని తెలిస్తే, నా ప్రాణాలు గాల్లో కలిపేందుకు, ఒక్క క్షణం కూడా పట్టదు వాడికి".

అంటూ తనే లేచి, వోడ్కా బాటిల్ తెచ్చి ఇచ్చింది. నేను ఒక్క గుక్కలో వోడ్కా మింగేసి, బాటిల్లో నుండి ఇంకో పెగ్గు తాగాను. గొంతు భగ్గున మండింది. ఆ మంటకు కారే  కన్నీళ్ళతో, బాధతో కారుతున్న కన్నీళ్ళు కలిసి పోయాయి.

"అన్‌ఫార్చ్యునేట్లీ, ఆడియో లేదు. కానీ, ఉండి ఉంటే వాడు జలజను దేని గురించి, ఎందుకు టార్చర్ చేశాడో తెలిసేది. జలజతో సయీామ్ ప్రవర్తన చూస్తుంటే, వాళ్ళిద్దరి మధ్య పాత పరిచయం ఉన్నట్టనిపిస్తోంది. వాళ్ళకు లైంగిక సంబంధం కూడా ఉన్నట్టనిపిస్తోంది. వాడు సెక్స్ టాయిస్‌తో ప్రిపేరయ్యే వచ్చాడంటే, ఇలాంటి శాడిస్టిక్ సెక్స్ ఇదే మొదటిసారి కానట్టనిపిస్తోంది. నీకేమైనా ఆమె గురించిన ఇంటిమేట్ విషయాలు తెలుసా?"

నేను లేదన్నాను.

పిచ్చిపట్టిన మృగం ఒకటి చక్కటి పూదోటలో జొరబడి నాశనం చేసినట్లుగా, నగ్నంగా, ఒళ్ళంతా గాయాలతో, రక్తం కారుతుంటే ఏడుస్తూ కూర్చున్న జలజే నా కళ్ళముందు  కనిపిస్తోంది.

జలజ జీవితంలో ఇంత విషాదం ఉందా!? దేవలోకం నుండి దిగి వచ్చిన అప్సరసలా ఉండే జలజ వెనుక ఇన్ని భయంకర నిజాలు దాగి ఉన్నాయా? అందుకేనా; జలజ నెలలకు నెలలు మాయమయ్యేది. దెబ్బలు తగ్గేవరకూ దాక్కునేదా?

నేను పది నిమిషాల్లో తేరుకున్నాను. మేడమ్ వంక చూశాను. నాలాగా కాకుండా చాలా నింపాదిగా వోడ్కా సిప్ చేస్తూ, ఏదో ఆలోచిస్తూ కూర్చుంది.

మళ్ళీ లాప్టాప్ ఆన్ చేసి, నా వైపు తిప్పి పెట్టింది.

"సయీామ్ ఏదో అడుగుతున్నాడు. జలజ లేదని ఏడుస్తూ, రెండు చేతులెత్తి వాణ్ణి వేడుకుంటోంది. చెంప చెళ్ళుమనిపించి తర్జనితో బెదిరిస్తూ సయీామ్ బైటకు నడిచాడు. జలజ అలానే మంచంపై పడిపోయింది".

చాలాసేపటివరకు వీడియోలో ఏ దృశ్యం రికార్డు కాలేదు.

"ఇంతలో నలుగురు వ్యక్తులు జలజ ఉన్న బెడ్ రూంలోకి వచ్చారు. సొమ్మసిల్లి పడిపోయి ఉన్న జలజను లేపి కూర్చోబెట్టి ఏదో ప్రశ్నించసాగారు. జలజ లేదన్నట్టుగా తల అడ్డంగా ఊపుతోంది. ఇంతలో ఒకడు కత్తి తీసి పొడవబోయాడు. రెండోవాడు వాణ్ణి ఆపి వెకిలిగా నవ్వుతూ ప్యాంటు విప్పాడు. అంతే, ఒకరి తర్వాత ఒకరు జలజమీద పడి అత్యాచారం చేశారు. జలజ ముందు ప్రతిఘటించినా తర్వాత ఓపిక లేక లొంగిపోయింది. నలుగురూ తమ కుతి తీర్చుకున్న కుక్కల్లా నిలబడి మంచం మీద నలిగిపోయిన పువ్వులా ఉన్న జలజని లేపి మళ్ళీ  ఏదో అడిగారు. ఆమె తెలియదని చెప్పడంతో వారిలో ఒకడు కసిదీరా కడుపులో పొడిచాడు. జలజ నొప్పితో లుంగలు చుట్టుకుని పోయింది. కడుపు పట్టుకుని కూలబడిపోయింది. గిలగిలా కొట్టుకుంటూ ప్రాణాలు విడిచింది. వాళ్ళల్లో ఒకడు జలజ శరీరాన్ని కాలుతో నెట్టి చూసి చచ్చిపోయిందని నిర్ధారించుకుని, తల్వార్ తీసుకుని జలజ రెండు చేతులు, రెండు కాళ్ళ దగ్గర నరికాడు. చిమ్ముతున్న రక్తాన్ని ఒళ్ళంతా పూసుకుని పూనకం వచ్చిన వాడిలా ఎగరడం ప్రారంభించాడు. వాణ్ణి ఆపి, ఆ నలుగురు ఇల్లంతా వెతకడం ప్రారంభించారు. ఇల్లంతా వెతికినా వాళ్ళకు కావాల్సింది దొరక్కపోవడంతో, చిందరవందర చేసి వెళ్ళిపోయారు".

చాలాసేపటి వరకు వీడియోలో కదలిక లేదు.

పోలీసులు అడుగుపెట్టడంతో మళ్ళీ దృశ్యాలు రికార్డు కావడం మొదలయింది.

మేడమ్ 'పాజ్' బటన్ నొక్కింది.

ఈసారి నేనే బాటిల్ తీసుకుని వోడ్కా నోట్లో పోసుకున్నాను. దగ్గొచ్చి, ఊపిరి ఆడనంత వరకు తాగి బాటిల్ విసిరేశాను. నా కళ్ళూ, నోరూ, ముక్కులూ కారుతున్నాయి.

"బాస్టర్డ్స్! ఎవరు మేడమ్ వాళ్ళు? జలజను ఎందుకంత ఘోరంగా, కర్కోటకంగా చంపారు?" అని ఏడుస్తూ ఆమె కాళ్ళ దగ్గర కూలబడిపోయాను.

**(ఇంకా వుంది)**

# సయాటికా నుంచి శాశ్వత విముక్తి పొందవచ్చు



డా. మురళి అంకిరెడ్డి
M. D (Homeo)
స్టార్ హోమియోపతి

నేటి జీవన విధానంలో ఆహారలోపాలు, అస్తవ్యస్థమైన దినచర్యలు, ఆందోళన, మానసిక ఒత్తిడి వంటి సమస్యలు అనేకఅనారోగ్యాలకు కారణం అవుతు న్నాయి. వీటిలో అతి ముఖ్యమైనది నడుం నొప్పి (సయాటికా).అయితే శారీరకంగా, మానసికంగా ఎన్నో ఇబ్బందులకు గురిచేసే ఈ సయాటికానొప్పి నుంచి విముక్తి కలగాలంటే హోమియోవైద్యమే సరైనదని అంటున్నారు ప్రముఖహోమియోవైద్యులు డాక్టర్ మురళీ అంకిరెడ్డి.

నడుం వెనుకభాగం నుంచి, కాలు వెనుకభాగానికి, అక్కడి నుండి మడమ వరకు వచ్చే ఈనొప్పిని సయాటికా నొప్పి అంటారు. సాధారణంగా వెన్ను పూసలు,డిస్క్‌లమధ్య నరంనలిగి పోవడం, నొక్కుకు పోవడంవల్ల ఈ నొప్పివస్తుంది. ఈ నొప్పినినిర్లక్ష్యం చేస్తే నొప్పితో పాటు నడకలో ఇబ్బంది, కాళ్లల్లో తిమ్మిర్లు రావచ్చు, ఎక్కువ శాతం ఈ నొప్పి ఏదో ఒక కాలుకే పరిమితమవుతుంది. కొన్నిసార్లు రెండు కాళ్ళలోనూ రావచ్చు. **కారణాలు:** 1.సయాటికానొప్పికి ముఖ్య కారణం నడుం భాగంలోని పూసలు, డిస్క్‌ల మధ్య సయాటికా నరం ఒరుసుకుపోవడం, నలిగి పోవడం, చాలావరకు నడుంభాగంలో డిస్క్‌పక్కకు ఒరిగి పోవడం వల్ల ఈ సమస్య వస్తుంది. దీనిని డిస్క్ హెర్నియేషన్ అంటారు. సయాటికాకు 90 % ఈ డిస్క్ హెర్నియేషన్ కారణం. 2.వెన్నుపూసలు అరిగి పోవడం, పూసలు ఒకదానిపై ఒకటి ఎగబాకిన ప్పుడు, డిస్క్ పక్కకు ఒరిగినప్పుడు నడుంభాగంలో స్పైనల్‌కెనాల్ ద్వారం మూసుకుపోతుంది. దీనిని స్పైనల్‌కెనాల్ స్టీలోసిస్ అంటారు. ఈద్వారం మూసుకుపోవడం తోవెన్నుపాముపై ఒత్తిడిపెరిగి, వెన్నుపాము నుంచి వచ్చే నరాలపై తీవ్రమైనఒత్తిడి పెరుగుతుంది.తద్వారా ఈ సయాటికా నొప్పి వస్తుంది. 3. సయాటికా నరం 'పిరిపాలిమిస్' అనే కండరం (నడుం, పిరుదుల మధ్య ఉంటుంది) గుండా పోతుంది. కొన్నిసార్లు ఈ కండరం దెబ్బలవల్ల గానీ, ఇతర కారణాల వల్ల గానీ చిన్నదిగా అయినప్పుడు నరంపై ఒత్తిడి పెరిగి సయాటికా నొప్పి వస్తుంది. 4. సయాటికా నొప్పి గర్భవతుల్లో ఎక్కువగా వచ్చే అవకాశం ఉంటుంది. గర్భాశయం లోని శిశువు వల్ల వెన్నుపాముపై ఒత్తిడి పెరుగుతుంది. ఎక్కువగా కూర్చున్నప్పుడు కూడా వెన్నుపాము పై ఒత్తిడి పెరుగు తుంది. తద్వారా కాళ్లలో నొప్పిరావడం, తిమ్మిర్లు రావడం జరగుతుంది. 5. కొన్నిసార్లు నడుంభాగం లోని పూసల మధ్య కణుతులు ఏర్పడటం వల్ల వెన్నుపాముపై, నరాలపై ఒత్తిడి పెరిగి సయాటికా నొప్పి వస్తుంది.**నిర్ధారణ:**1. సాధారణ రోగిచెప్పే నొప్పి లక్షణాల ను బట్టి సయాటికా నొప్పిని నిర్ధారించవచ్చు. రోగిని వెల్లకిలా పడుకోబెట్టి కాలును లేపమన్నప్పుడు ఆ రోగి తనకాలును 45 డిగ్రీలకన్నా తక్కువ ఎత్తు లేపితే సయాటికా నరం ఒత్తిడికి లోనవుతుందని అర్థం చేసుకోవాలి. 2.ఎం.ఆర్.ఐ,లాంబార్ స్పైన్(ఎం.ఆర్.ఐ నడుంభాగంలోని వెన్నుపూస)చేసినట్లయితే డిస్క్‌లు ఎలా ఉన్నాయి. నరాలపై ఒత్తిడి ఏ మేరకు ఉంది అనే విషయం తెలుస్తుంది. **నొప్పి లక్షణాలు:** 1. నొప్పి మొదట నడుం నుండి కాలు వెనుకభాగంలోకి వస్తుంది. తర్వాత కాలు వెనుక నుండి తొడల ద్వారా కాలు మడమల వరకు వస్తుంది. 2. కాళ్లల్లో మంటతో కూడిన నొప్పిరావచ్చు. 3. కూర్చున్నప్పుడు, ఎక్కువ సేపు నిల్చున్నప్పుడు నొప్పితీవ్రత పెరుగుతుంది.

4. కాళ్లలోనొప్పితో పాటు తిమ్మిర్లు వచ్చే అవకాశం ఉంటుంది. **జాగ్రత్తలు:**1. ఒకే భంగిమలో చాలాసేపు కూర్చోవద్దు. మంచి ఆధారం ఉన్న కుర్చీలోనే కూర్చోవాలి. 2. సామర్థ్యానికి మించి బరువులు మోయకూడదు. 3. ముందుకు వంగి ఎక్కువ సేపు పని చేయకూడదు. 4. ప్రయాణాలు తక్కువగా చేయాలి. గతుకుల రోడ్లపై ప్రయాణాలు చేయకూడదు. 5.వెనుక జేబులో బరువైన పర్సులు పెట్టుకోకూడదు. కింద కూర్చోవడం మానేయాలి. 6. ప్రతిరోజూ క్రమంతప్పకుండా వ్యాయామం చేయాలి.

**హోమియోవైద్యం:** ఈ వైద్యవిధానంలో రోగికి సంబంధించిన మానసికలక్షణాలననుసరించి జీనోమ్ థెరపీ ఇవ్వడం జరుగుతుంది. దీనిద్వారా రోగికి సయాటికా నుంచి శాశ్వత పరిష్కారం లభిస్తుంది. సయాటికానొప్పి నుంచి విముక్తి పొందటానికి ఈ మందులు ఎంతగానో ఉపకరిస్తాయి. కుడికాలు సయాటికా అయితే. మెగ్నీషియం పాస్, హైపరికమ్, లైకోపోడియం, వలెరియాన మందులు ఉపయోగించ వచ్చు. ఎడమకాలు సయాటికా అయితే. హైపరికమ్, కాలికార్బ్, కాస్టికమ్, రస్టాక్స్, లెకసిస్, సిమిసిఫ్యూగ మందులు ఉపయోగించవచ్చు.



# సోరియాసిస్

సోరియాసిస్ మచ్చలు పింక్ లేక ఎరుపు వర్ణంలో పొలుసులతో కూడి ఉంటాయి. చర్మం దళసరిగా ఉంటుంది. ఈ పొలుసులను బల వంతంగా తీస్తే వాటికింద ఎర్రటిరక్తపు మచ్చలుగా కనిపిస్తాయి. ఈసోరియాసిస్‌మచ్చలు కొంచెం కాని, ఎక్కువ సంఖ్యలో గాని ఉంటాయి.

శరీరంలోని చాలాభాగాలలో అంటే చేతులు, కాళ్ళు, తల,వీపుమీద,మోకాళ్ళ ముందుభాగాన, ఉదరం, అరికాళ్ళు, అరిచేతులలో అధికంగా ఈమచ్చలువస్తాయి.పొలుసులుచాలా దట్టంగా, అధికంగాఉండి కొవ్వొత్తిమైనంలాగాఉంటాయి. ఒక్కొక్కసారి వాపుతో కూడి ఉంటాయి.

సోరియాసిస్ ప్రధానంగా చాతి, కాళ్ళ మీద యుక్త మధ్యవయస్సులో అధికంగా కనిపిస్తుంది. చాలా తక్కువగా చిన్నపిల్లలు, వృద్ధులలో కనిపించ వచ్చు. అధికవత్తిడివలన,వంశపారంపర్యంగాతల్లిదండ్రుల కు ఉంటే వారి పిల్లలకు ఈ వ్యాధిరావటానికి అవకాశాలు ఉంటాయి. కాలివేళ్ళు, చేతివేళ్ళ గోళ్ళలో గుంటలు పడినట్లు ఉంటాయి.

**చికిత్సావిధానం:** ప్రధానంగా సోరియాసిస్ (కిటిభ కుష్టం) అనే వ్యాధిలో పంచకర్మ చికిత్సా విధానం ఎంతో ప్రముఖమైనది. ఈ పంచకర్మ విధానంలో



వమనకర్మప్రధానమైనది. దీనివలన శరీరంలో ఉన్న చెడుభావాలు రసాయనాలు మొదలగు శరీరం నుండి బయటికి పంపబడ తాయి. తక్రధార. ఈ చికిత్సావిధానంలో ప్రత్యేకంగా ఔషధాలతో తయారు చేయబడిన తక్రము లేదా మజ్జిగధారతో మచ్చలు గల శరీర భాగాలను శుభ్రంగా తడపటం జరుగుతుంది. దీనివలన శరీరం పైభాగంలోని పొలుసులన్నీ ఊడిపోతాయి.

**నివారణ:** మానసికవత్తిడి నుండి పూర్తిగా విముక్తి వలన, పులుపు పదార్థాలు, మాంసాహార సేవన, సముద్రఉత్పత్తులు పూర్తిగా నిషేదించటంవలన, వాయుకాలుష్యం, జల కాలుష్యం నుంచి దూరంగా ఉండటం, పరిశ్రమలలో సరైనరక్షణ విధానాలు పాటించటం వలన నివారించవచ్చు.

సోరియాసిస్ మచ్చలు పింక్ లేక ఎరుపు వర్ణంలో పొలుసులతో కూడి ఉంటాయి. చర్మం దళసరిగా ఉంటుంది. ఈ పొలుసులను బల వంతంగా తీస్తే వాటికింద ఎర్రటిరక్తపు మచ్చలు గాకనిపిస్తాయి. ఈసోరియాసిస్‌మచ్చలు కొంచెం కాని, ఎక్కువ సంఖ్యలో గాని ఉంటాయి.

శరీరంలోని చాలాభాగాలలో అంటే చేతులు, కాళ్ళు, తల,వీపుమీద,మోకాళ్ళ ముందుభాగాన, ఉదరం, అరికాళ్ళు, అరిచేతులలో అధికంగా ఈమచ్చలువస్తాయి.పొలుసులుచాలా దట్టంగా, అధికంగాఉండి కొవ్వొత్తిమైనంలాగాఉంటాయి. ఒక్కొక్కసారి వాపుతో కూడి ఉంటాయి.

సోరియాసిస్ ప్రధానంగా చాతి, కాళ్ళ మీద... యుక్త మధ్యవయస్సులో అధికంగా కనిపిస్తుంది. చాలా తక్కువగా చిన్నపిల్లలు, వృద్ధులలో కనిపించవచ్చు అధికవత్తిడివలన, వంశపారంపర్యంగా తల్లిదండ్రుల కు ఉంటే వారి పిల్లలకు ఈ వ్యాధి రావటానికి అవకాశాలు ఉంటాయి. కాలివేళ్ళు, చేతివేళ్ళ గోళ్ళలో గుంటలు పడినట్లు ఉంటాయి.

డా. మనోహర్. M. D (Ayurveda)
స్టార్ ఆయుర్వేద




# చిన్న పామైనా పెద్ద కర్రతో...

**నినాదాలు చేస్తున్న వారిని తప్పించుకుని శవం దొరికిన స్థలానికి చేరుకున్నాడు డిటెక్టివ్ శరత్.**

**'చాలా గడబిడగా ఉంది. ఏదైనా సంఘటన జరగగానే, ఎందుకు? ఏమిటి? అని చూడకుండా దాన్లో కులం, మతం ఆధారంగా రాజకీయలబ్ధి పొందాలని తపించే గద్దలు సిద్ధంగా ఉంటే ఇలాగే ఉంటుంది' కసిగా అన్నాడు ఇన్‌స్పెక్టర్ విజయ్.**

శరత్ మాట్లాడలేదు. వెంటనే పని ఆరంభించాడు.

తుప్పల్లో పడి ఉంది శవం. పదకొండేళ్ళ పిల్లవాడి శవం. ఎవరో బాగా కొట్టి, గొంతు నులిమి చంపేశారు. పసివాడి మీద అంత కసి ఎవరికి ఉంటుంది?

ఆలోచిస్తూ ఘటనా స్థలంలో ఆధారాల కోసం వెతకటం ఆరంభించాడు శరత్. క్రితంరోజు సాయంత్రం నుంచి ఎనిమిదేళ్ళ పిల్లవాడు ఎర్రయ్య కనిపించటంలేదని వాళ్ళ తల్లిదండ్రులు పోలీసులను ఆశ్రయించారు. తెల్లారే, ఊళ్ళోవాళ్ళల్లో ఎవరో బహిర్భూమికి తుప్పల్లోకి వస్తే శవం కనిపించింది.

అంటే, హత్య సాయంత్రం నుంచి తెల్లవారేలోగా జరిగి ఉండాలి. కానీ శవాన్ని చూస్తుంటే సాయంత్రం కన్నా ముందే హత్య జరిగిందనిపిస్తోంది. అంటే పిల్లవాడు తప్పిపోయాడని తల్లిదండ్రులు గుర్తించేకన్నా ముందే హత్య జరిగిందన్నమాట.

అసిస్టెంట్ రాము వైపు తిరిగాడు శరత్.

'రామూ, హతుడి కుటుంబ వివరాలు సేకరించు. పిల్లవాడిని చంపటంవల్ల ఎవరికి లాభమో తెలుసుకో. ఆస్తుల తగాదాలు, మగపిల్లవాడు తమకు పుట్టలేదన్న అసూయలు, అక్రమ సంబంధాల వంటివి ఏమైనా ఉన్నాయేమో తెలుసుకో'.

'యెస్ బాస్' అన్నాడు రాము.

శవం గొంతు దగ్గరి భాగాన్ని జాగ్రత్తగా పరిశీలించాడు శరత్. తాడువంటివి ఏవీ వాడలేదు. చేతులతో ఒత్తి చంపేశారు. వేలిముద్రల కోసం జాగ్రత్తగా వెతికాడు. సరిగ్గా లేవు. శవం బయట పడుండటం వల్ల, రాత్రి కురిసిన మంచువల్ల సరిగ్గా తెలియటం లేదు.

శవానికి అయిన గాయాలు పరిశీలించాడు. కర్రతో చితకబాది నట్టుంది. ఇదేదో కసితో చేసిన హత్యలాగా ఉంది' అనుకున్నాడు శరత్.

మరోసారి శవాన్ని జాగ్రత్తగా పరిశీలించాడు. మెడ దగ్గర సన్నగా అయిన ఆ గాయాన్ని ఇంతకు ముందు గుర్తించలేదు. కమిలివున్న దానిలో భాగం అనుకున్నాడు. ఇప్పుడు తెలుస్తోంది. అది గోరు గీసుకుపోయిన గుర్తు! దాన్ని ఫోటో తీసుకున్నాడు. జాగ్రత్తగా కొలిచాడు. ప్రాణం ఉన్నప్పుడు తగిలిన గాయమే అది.

శవాన్ని వదిలి పరిసర ప్రాంతాలను పరిశీలించటం ఆరంభించాడు.

ఎక్కడయినా కాలిగుర్తులు, టైరుగుర్తులు కనిపిస్తాయేమోనని పరిశీలించటం ప్రారంభించాడు.

అంతలో అతని దృష్టి పొదల పక్కన మెరుస్తున్నదానిపై పడింది. ముందు అది పనికిరానిది అనుకున్నాడు. కానీ నేరపరిశోధనలో దేన్ని పనికిరానిదని వదిలేస్తామో, అదే కీలకమైన ఆధారం అవుతుంది. అందుకనే ఎంతటి పనికి రానిదిగా కనిపించినా, దాన్ని పరిగణనలోకి తీసుకోవాల్సి ఉంటుంది. పనికి రానిదని నిర్ధారణ అయ్యేదాకా, దాన్నీ పరిశోధనకు ప్రాతిపదికగా చేయాల్సి ఉంటుంది.

దాన్ని ప్లాస్టిక్ కవర్‌లో వేసుకున్నాడు. ఆలోచిస్తూ నడిచాడు.

•••

'ఒకే పిల్లవాడండి. అల్లారుముద్దుగా పెంచుకుంటున్నాం' ఏడుస్తూ అంది ఎర్రయ్య తల్లి.

'మాకు ఎవరితోనూ శత్రుత్వం లేదు. ఎవరికీ అన్యాయం చేయలేదు. అయినా పసిపిల్లవాడి ప్రాణాలు తీసేంత కోపం ఎవరికుంటుంది?' తండ్రి కళ్ళు తుడుచుకుంటూ అన్నాడు.

'అబ్బాయి మూవ్‌మెంట్స్ చెప్పండి' అడిగాడు శరత్ మృదువుగా.

**ఒక్కడే పిల్లవాడని అల్లారుముద్దుగా పెంచుకున్నారా తల్లిదండ్రులు. ఒకరోజు ఆడుకోవడానికి వెళ్ళినవాడు తిరిగిరాలేదు. తెల్లారేసరికి తుప్పల్లో శవమై తేలాడు. తల్లిదండ్రులకు ఎవరితోనూ శత్రుత్వం లేదు. ఆస్తి తగాదాలూ, అసూయా ద్వేషాలూ లేవు. కేసు డిటెక్టివ్ శరత్‌కి అప్పగించారు. దొరికిన చిన్న ఆధారంతో కేసును ఛేదించాడు డిటెక్టివ్. మరి అతడికి దొరికిన ఆధారం ఏమిటి? కేసును ఎలా ఛేదించాడు?**

'స్కూలుకు వెళ్ళాడు. వచ్చాడు. ఆడుకోవటానికి బయటకు వెళ్ళాడు. బయట పిల్లలతో సాయంత్రం దాకా ఆడుకుంటాడు. ఏడయినా రాకపోతే అప్పుడు పిలవటానికి వెళ్ళాను. పిల్లల్లో లేడు. తమతో ఆడనే లేదన్నారు. అప్పుడు భయం వేసింది. తెలిసిన వాళ్లందరి ఇళ్ళల్లో వెతికాం. ఎక్కడా లేకపోయేసరికి, పోలీసు కంప్లయింట్ ఇచ్చాం' చెప్పాడు అతడు.

'నా అసిస్టెంట్ స్కూలులో కూడా ఎంక్వయిరీ చేశాడు. స్కూలులోనూ ఎలాంటి అసాధారణ సంఘటనలు జరగలేదట. మీ అబ్బాయి స్కూలుకి ఎలావెళ్తాడు?' అడిగాడు శరత్.

'ఆయా ఉంది. ఇంట్లో పనిచేస్తుంది. పిల్లవాడిని స్కూలులో దింపి, తెస్తుంది'.

'ఏదీ ఆయా?'

అప్పటిదాకా తెరచాటున నుంచున్న ఓ అమ్మాయి తల దించుకుని వచ్చింది.

పదహారు ఏళ్ళుంటాయి. కళ్ళు ఎర్రగా ఏడ్చినట్టున్నాయి.

'అబ్బాయి ఎటువెళ్ళాడో లేక ఎవరయినా తీసుకెళ్ళారో... నువ్వేమైనా చూశావా?' అడిగాడు శరత్.

తల అడ్డంగా ఊపింది అమ్మాయి.

ఇంతలో రాము నుంచి ఫోను వచ్చింది. ఫోనులో రాము చెప్పింది విన్న శరత్ లేచాడు.

•••

'నిజమా?' అడిగాడు శరత్.

ఫోరెన్సిక్ నిపుణుడు ఫణి నవ్వాడు. నిర్ధారణగా చెప్పలేను. కానీ శవం గొంతు దగ్గర అయిన గాటు గోరుతో అయింది. అది దిగిన లోతు, ఆకారాన్ని బట్టి చెప్తున్నాను. ఇది కేవలం నా అనుమానం మాత్రమే. పెద్దల పనయితే కాదు. పిల్లల్లో ఎవరో, ఏదో కసితో చంపి ఉంటారు. ఇది 'జువెనైల్ క్రైమ్' అనిపిస్తోంది.

జువెనైల్ డెలిక్వెన్సీ (Juvenile Deliquency) అనేది ఇంకా పరిణతి చెందని వయసువారు ప్రదర్శించే నేరప్రవృత్తి! వారు చేసిన నేరం జువెనైల్ కిందకు వస్తుంది.

'ఇంకా ఎలాంటి ఆధారాలూ లేవు కదా?' అడిగాడు శరత్.

'లేవు. అదే ఆశ్చర్యంగా ఉంది. ఇంకా యుక్త వయసు రాని పిల్లలు ఇంత పకడ్బందీగా హత్య ఎలాచేశారా? అని ఆలోచిస్తున్నాను'.

'పకడ్బందీగా చేసిన హత్య అయినా అయి ఉండాలి. లేదా, అదృష్టం కలిసి వచ్చి ఉండాలి' అన్నాడు శరత్. అతడికి తనకు దొరికిన మెరిసిన



వస్తువు గుర్తుకు వచ్చింది.

●●●

'వాడు.... క్రికెట్ ఆటలో తనని ఔట్ చేసినందుకు చంపుతానని ఎర్రయ్యను బెదిరించాడు' ఓ పిల్లవాడివైపు చూపిస్తూ చెప్పాడు ఇంకో పిల్లవాడు. ఆ వైపు నడిచాడు శరత్. అతడివైపు భయంగా చూశాడా పిల్లవాడు.

'నేనేం చేయలేదండి. నేను వట్టిగానే బెదిరించాను. నిజంగా నేనేం చేయలేదు' ఏడుపు అందుకున్నాడా పిల్లవాడు.

అతడిని వదిలేశాడు శరత్. పెద్దలు దగ్గర లేకుండా పిల్లలను ప్రశ్నించకూడదు. అందులో ఈ పిల్లవాడు పలకరించక ముందే 'బేరు'మంటున్నాడు.

'బాస్... తగాదాలుండేంత ఆస్తులు లేవు వీళ్ళకు. అన్నదమ్ముల్లోనూ చంపేంత అసూయలు, ద్వేషాలు లేవు' శరత్ పక్కనే నడుస్తూ చెప్పాడు రాము.

శరత్ తల ఊపాడు. ఇల్లు చేరి తలుపు తట్టాడు.

తలుపు తెరచిన హతుడి తండ్రి శరత్‌ని చూసి వెంటనే అడిగాడు. 'ఏమైనా తెలిసిందా?'

'అది తెలుసుకోవాలనే వచ్చాను' అన్నాడు శరత్ లోపలకు అడుగుపెడుతూ.

శరత్ వైపు అయోమయంగా చూశాడతడు.

'మీ ఇంట్లో పనిమనిషి ఉందన్నారుగా? ఎవరామె? మీకు బంధువా?' అడిగాడు శరత్.

అతడి కళ్ళల్లో భయం లీలగా కదలాడింది.

'బంధువు కాదు. ఊళ్ళో అమ్మాయి. వాళ్ళ తల్లిదండ్రులిద్దరూ రోగులు. ఇల్లు గడవటం కష్టంగా ఉందంటే, జాలిపడి తెచ్చుకున్నాం. మా ఇంట్లో పని చేస్తుంది. ఇంట్లో వాళ్ళకి డబ్బులు పంపిస్తాం. ఇది నేరమా?' అడిగాడాయన భయంగా.

'అమ్మాయి ఎక్కడుంది?' అడిగాడు శరత్.

'ఊరికి పంపించేశాను. పిల్లవాడి ఆలనాపాలనా చూసుకునేది. వాడే లేనప్పుడు అమ్మాయి అవసరం మాకేముంది? అందుకని పంపేశాను'.

'ఆమె అడ్రస్ కావాలి?' అడిగాడు శరత్.

'ఎందుకు?' అడిగాడాయన భయంగా.

●●●

తల వంచుకుని కూర్చుంది అమ్మాయి.

'నీ పేరేంటమ్మా?' అడిగాడు శరత్.

'పారిజాత'

'ఆరోజు ఏం జరిగిందో చెప్పు' అడిగాడు శరత్ మృదువుగా.

'స్కూలులో దింపాను. తెచ్చాను. నేను కూరగాయలు తేవటానికి వెళ్ళాను. వచ్చాను. అంతే' మెల్లిగా చెప్పింది అమ్మాయి.

'ఏదీ, నీ చేతులు చూపించు' అడిగాడు శరత్.

ఆమె చేతులు వెనక్కు దాచుకుంది.

తన జేబులోంచి ప్లాస్టిక్ కవర్ తీశాడు. దానిలోంచి విరిగిన గాజు ముక్క తీశాడు.

'ఇది నీ గాజేనా?'

దానివైపు భయంగా చూసింది ఆమె.

'ఎక్కడ విరిగిందీ గాజు?'

ఆమె మాట్లాడలేదు.

'నిజం చెప్పు. భయం లేదు. నీకు శిక్ష తక్కువ పడుతుంది. నువ్వు నిజం దాస్తే, దాన్ని నేను నిరూపిస్తే నీకు శిక్ష ఎక్కువ పడుతుంది' అన్నాడు, వెనుకదాచిన ఆమె చేతులను ముందుకు లాగి, ఆమె గోళ్ళను పరిశీలిస్తూ.

మూతి బిగించింది పారిజాత. ఇప్పుడో ఇంకో క్షణమో బద్ధలయ్యే నీళ్ల నిండిన మేఘాల్లా ఉన్నాయి ఆమె కళ్ళు.

'నిజం చెప్పు. నీకేం కాదు' అన్నాడు శరత్, మృదువుగా.

ఒక్కసారిగా ఏడవటం ఆరంభించింది ఆమె.

'వాడు.... వాడు పశువు. నన్ను... నన్ను రాత్రి... ఎవరూ లేనప్పుడు...' పెద్దగా ఏడవటం ఆరంభించింది.

శరత్ ఒళ్ళు జలదరించింది. ఆమెవైపే చూస్తూ కూర్చున్నాడు.

ఏడుపు మధ్య చెప్పింది. 'నాకేం చేయాలో తెలియలేదు. ఎవరికి చెప్పినా నన్ను నమ్మరు. అందుకని... నేనే కొట్టి చంపాను. ప్రతీకారం తీర్చుకున్నాను' కసిగా చెప్పింది కన్నీళ్ళ నడుమ.

'ఎవరు? నిన్ను బలాత్కారం చేసింది పదకొండేళ్ళ ఎర్రయ్యనా?' అడిగాడు శరత్.

తల అడ్డంగా ఊపింది. 'కాదు. వాళ్ళ నాన్న! ఎవ్వరూ లేని సమయంలో బలాత్కారం చేశాడు. అది ఎర్రయ్య చూశాడు. మరుసటిరోజు నన్ను తుప్పల్లో కలవకపోతే అందరికీచెప్పి అల్లరి చేస్తానన్నాడు. తండ్రి పశువయితే కొడుకు మనిషి అవుతాడా? అందుకే వీడిని కొట్టాను. చంపాను. పెద్దపామును ఏమీ చేయలేను. చిన్నపాము పెద్దదయ్యేలోగా చంపేశాను' వెర్రిగా నవ్వుతూ, ఏడుస్తూ, అరుస్తూ చెప్పిందా అమ్మాయి.

●●●

'తనను బలాత్కారం చేసినందుకు పిల్లవాడి తండ్రిని ఏమీ చేయలేని పారిజాత, దాన్ని చూపించి తనను లొంగదీసుకోవాలని ప్రయత్నించిన అతడి కొడుకును కొట్టి చంపింది. ఆమెను జువెనైల్‌హోమ్‌కు పంపారు. ఎర్రయ్య తండ్రిపై మైనర్‌ను బలాత్కారం చేసిన కేసును పోలీసులు రిజిస్టర్ చేశారు. కేసును వివరించాడు శరత్.

**-కస్తూరి మురళీకృష్ణ,**

**సెల్: 98496 17392**

# పరకాయ ప్రవేశం

పుట్టగంటి గోపీకృష్ణ



**మరో అరగంటలో గుండెనొప్పి రాబోతుందని తెలిస్తే ఆ షాట్‌లో గుండెనొప్పి వచ్చినట్లు అంతగొప్పగా నటించ గలిగే వాణ్ణి కాదేమో!**

**యూనిట్‌సభ్యుల చప్పట్ల మధ్య గర్వంగా ఇవతలకు నడిచాను.**

**అరవైఏళ్ళు దాటిన తరువాతకూడా హీరోవేషాలు వెయ్య గలిగిన అదృష్టం ఎవరికోగానీ దక్కదు. అలాంటి వారిలో నేను ఒకణ్ణి.**

గ్రేట్ హీరో విష్ణుమూర్తిని....

నటించటానికిముందు ఎలాంటి రిహార్సల్సూ చేసుకోను. సహనటుల పొరపాటువల్ల ఎప్పుడైనా మరో టేక్ చెయ్యవలసిన అవసరం వస్తుందేమోతప్ప, నా లోపం ఎప్పుడూ ఉండదు. కొంతమంది నటులు మరుసటిరోజు షూటింగ్ స్క్రిప్ట్ ఇంటికి తెచ్చుకుని, అద్దం ముందు నిలబడి గంటల తరబడి ప్రాక్టీస్‌చేసి మరీ షూటింగ్‌కి వస్తారు. నాకు ఆ అవసరం కూడా లేదు. ఎన్నిపేజీల డైలాగులైనా ఒక్కసారి విని గుర్తుపెట్టుకోగలను. నేను సహజంగా మార్చే హావభావాలకు, ఇంప్రొవైజ్ చేసిచెప్పే డైలాగ్స్ మాడ్యులేషన్‌కు ఫిదా అయిపోయి ఎంతో ప్రిపేరైవచ్చిన నటీనటులు తాము చెప్పవలసిన డైలాగ్స్ మరచిపోయిన సంఘటనలెన్నో. అందుకే ఇంత వయసు వచ్చినా ఈ రంగాన్ని శాసించగలుగుతున్నాను.

'తరువాత షాట్ రెడీ చెయ్యడానికి అరగంటపైనే పడుతుంది. మీరు కారవాన్‌లో కూర్చోండి సార్.." చెప్పాడు డైరెక్టర్.

డైరెక్టర్లందరూ నన్ను పువ్వులా చూసుకుంటారు. దానికి కూడా ఒక కారణం ఉంది. మొదట్లో తోకాడించబోయిన ఒక డైరెక్టర్ని నేను లైనులోపెట్టిన తీరు అందరికీ పాఠమైంది.

ఒక కొత్త డైరెక్టర్ నన్ను మొదటిసారి డైరెక్ట్‌చేస్తూ, "ఈ షాట్లో ఇలాకాకుండా మరోలా నటించండి" అని తను నటించి చూపించబోయాడు. నాకు మండుకొచ్చింది. 'నటన గురించి ఇతను నాకు చెప్తాడా?...' అన్న అహం కోపంగా మారింది.

'యూజ్‌లెస్ ఫెలో. డైరెక్షన్ అంటే ఏమిటో తెలియనివాళ్ళు ఇండస్ట్రీకివచ్చి ఎందుకు మా ప్రాణం తీస్తారో అర్థంకాదు. షిట్..' అంటూ సెట్లోంచి లేచి వెళ్ళిపోయాను.

ఆ డైరెక్టర్ని మార్చేవరకు తిరిగి సెట్లో అడుగు పెట్టలేదు.

ఆ తరువాత గడిచిన ఎన్నో దశాబ్దాల్లో నాకు ఎదురు చెప్పే సాహసం ఎవరూ చెయ్యలేదు.

నేను కారవాన్‌లోకి వచ్చానో లేదో గ్లాసులో జ్యూస్ తెచ్చి నా ముందు పెట్టాడు రాము.

"రోజుకి ఎన్ని గ్లాసుల జ్యూస్ తాగిస్తావ్ రామూ?" తెచ్చి పెట్టుకున్న విసుగు ప్రదర్శిస్తూ అన్నాను. నిజానికి నా భార్య చనిపోయిన దగ్గరనుండి నా

**అతడో గొప్ప నటుడు. ఆరవైయేళ్ళ వృద్ధాప్యంలో కూడా ఇంకా హీరోల వేషాలే వేస్తున్నాడు. అతడి పి.ఏ రాము. అతడంత గొప్పవాణ్ణి కావాలనే లక్ష్యంతో సినీ పరిశ్రమకు వచ్చాడు. రాములో గొప్ప టాలెంట్ ఉంది. అది కనిపెట్టాడా ముసలిహీరో. చేరదీసి ఎదగకుండా తొక్కిపెట్టాడు. ఒక రోజు ముసలిహీరో మరణించాడు. మోక్షం ప్రసాదిస్తే తిరస్కరించి తిరిగి మరో మానవ దేహంలోకి పరకాయ ప్రవేశం చేశాడు. అప్పుడు ఏం జరిగింది?**

పిల్లలకంటే ఎక్కువగా నన్ను కంటికిరెప్పలా కాపాడుతున్నది అతనే!

“మీరు తినేదే తక్కువ. ఇక ఈ జ్యూస్ కూడా తాగకపోతే ఎలా సార్..” నా మాట వినిపించుకోకుండా చేతిలో గ్లాసు పెడుతూ అన్నాడు రాము.

ఒక గుక్క జ్యూస్ తాగి, “షాట్ ఎలా వచ్చింది.” అని అడిగాను.

“మీరు ఆ షాట్ చెయ్యకముందు దాన్ని ఎన్ని రకాలుగా చెయ్యవచ్చో ఊహించుకుంటానుసార్. చివరికి మీరు నేను ఊహించుకున్న ఏ రకంగానూ కాకుండా మరోరకంగా చేసి అందరినీ ఆశ్చర్య పరుస్తారు. అందుకే మీరు నట రారాజు అయ్యారు...’

వాణ్ణి అంతటితో ఆపి మరోపనికి పంపకపోతే ఆ పొగడ్తలు ఆగవు. పొగడ్తలువినటం నాకు ఇష్టమే అయినా ఇప్పుడెందుకో కాసేపు ఒంటరిగా ఉండాలనిపించింది.

కెమేరా రీలొకేట్ చెయ్యటం పూర్తయ్యేసరికి అరగంట పడుతుందన్నారు. నువ్వెళ్లి షాట్ రెడీ అవటానికి అయిదు నిమిషాల ముందు డైలాగ్‌పేపర్ పట్టుకు రా... ఈలోపు నన్ను కాస్త రెస్ట్ తీసుకోనివ్వు” అన్నాను.

సినిమాలలో ఎన్ని సూపర్ హ్యూమన్‌ఫీట్లు చేసినా నా అరవైఏళ్ల శరీరం నన్నుపెట్టే బాధల గురించి తెలిసింది వాడికొక్కడికే. అందుకే కాస్త విశ్రాంతి కావాలనగానే మారు మాట్లాడకుండా బైటకెళ్ళిపోయాడు.

ఛాతిమీద చేత్తో రాసుకుంటూ కుర్చీలో వెనక్కివాలాను. ఈ మధ్య ఎసిడిటీ వల్ల ఈ మంట బాగా ఇబ్బంది పెడుతోంది.

కారవాన్‌కి ఉన్న సీత్రూ గ్లాసులనుండి దూరంగా వెళ్ళిపోతున్న రాము కనిపించాడు. అతని హైటూ, పర్సనాలిటీ చూస్తే తెలియనివాళ్ళు అతన్నే హీరో అనుకుంటారు. కానీ సినిమారంగమే అంత! హీరో లక్షణాలేమీలేని నాకు తిరుగులేని స్టార్‌స్టేటస్ కల్పించింది. అన్ని లక్షణాలూ పుష్కలంగా ఉన్నాయనుకుంటున్న రాములాంటి ఎంతోమంది అవకాశాల్లేక ఖాళీగా ఉండిపోతున్నారు.

లేచి ఫ్రిజ్‌లోంచి యాంటాసిడ్ పౌడర్‌తీసి నీళ్ళలో కలుపుకుని తాగాను.

ఛాతిలో మంట తగ్గినట్టనిపించింది. నిజంగా తగ్గిందా?... నా భావనా?

తిరిగి కుర్చీలో కూర్చున్నాను.

కారవాన్ అద్దంలోంచి బైట తిరుగుతున్న రాము కనిపిస్తున్నాడు. ఆ అద్దాల్లో నుంచి బైట జరుగుతున్నది నాకు కనిపిస్తుంది తప్ప, లోపల జరిగేదేమిటో ఎవరికీ కనపడదు. ఉత్సాహానికి ప్రతిరూపంగా అటూఇటూ తిరుగుతున్న వాణ్ణి చూస్తుంటే వాడు ఈ ఊరువచ్చిన రోజులు గుర్తుకు వచ్చాయి.



ఇరవైఏళ్ళ వయసులో తనఊరినీ, తనవారినీ వదిలేసి హీరో అవ్వాలనే ఆశయంతో ఇక్కడికి వచ్చాడు. వాడికి నటనమీద ఆకర్షణ ఏర్పడటానికి కారణం నేనే. చిన్నప్పటినుండి సినిమాలలో నన్ను చూసి పెరిగిన అతను నిజజీవితంలో కూడా నాలా అవ్వాలని ఈ నగరం వచ్చాడు.

అతను ఇక్కడికివచ్చిన కొన్నిరోజులకే ఎవరో నాతో చెప్పారు. “మీ ఏకలవ్య శిష్యుడట. వేషాల కోసం డైరెక్టర్ల చుట్టూ తిరుగుతున్నాడు. అతన్ని చూస్తుంటే చిన్నప్పటి మిమ్మల్ని చూసినట్లే ఉంది. పైగా మంచి టాలెంటెడ్ కూడానూ. త్వరలో మన ఫీల్డులోకి మరో హీరో రాబోతున్నట్లే ఉంది..”

ఆ మాటలతో నా కుతూహలం పెరిగింది. వాణ్ణి ఒకసారి నా దగ్గరకు పిలిపించుకున్నాను. తన ఆరాధ్య దైవాన్ని కలుసుకున్నందుకు వాడి ఆనందం అవధులు దాటింది. కాసేపు మాట్లాడి వాణ్ణి నటించి చూపించమన్నాను. ఏ మాత్రం బెరుకులేకుండా రెండుమూడు సీన్లుచేసి చూపించాడు.

కాసేపట్లోనే నాకు అర్థమైంది. వాడిదగ్గర టాలెంటుకు కొదవలేదు. బహుశా నన్ను దృష్టిలో పెట్టుకుని ప్రాక్టీస్ చెయ్యటం వల్లనేమో, వాడి నటన ఎలా ఉందంటే నా నటనకి మెరుగులు దిద్దిన వెర్షన్‌లా ఉంది. ఇలానే డైరెక్టర్ల చుట్టూ తిరుగుతుంటే త్వరలోనే ఎవడో ఒక డైరెక్టర్ అవకాశం ఇవ్వకపోడు. ఆ తరువాత నన్ను పక్కకునెట్టి నా స్థానం ఆక్రమించినా ఆశ్చర్యం లేదు.

అందుకేవాణ్ణి నా ప్రాపకంలోకి తీసుకున్నాను. నా పక్కన ఎప్పుడూవుండే అవకాశం కల్పిస్తున్ననెపంతో వాడికి బైటతిరిగే స్వాతంత్ర్యం లేకుండా చేశాను. వాడికి అవకాశం ఇవ్వదలుచుకున్న ఒకరిద్దరు డైరెక్టర్లకి అది నాకు ఇష్టం లేదన్న నా ఉద్దేశం తెలిసేటట్లు చేశాను. నన్నుకాదని వాడికి అవకాశం ఇచ్చేదెవరు? వస్తాయనుకున్న అవకాశాలు ఎందుకు రాకుండా పోయాయో వాడికి అర్థం కాలేదు. అర్థం కావటానికి వాణ్ణినేను ఆలోచించనిస్తేగా.. నామీద వాడికున్న మూఢభక్తి వాడి తెలివితేటలకు గ్రహణం పట్టేలా చేసింది.

అలా ఆరేళ్ళుగా వాడు నా దగ్గర ఉండిపోయాడు. వాడికోరిక గురించి వాడు నాకు గుర్తు చేసినప్పుడల్లా అవకాశం దరిదాపుల్లోకి తీసుకెళ్ళి తిరిగి ఖాళీచేతుల్తో వెనక్కి తెచ్చేవాణ్ణి. అలా వాడికి ఓటమి అలవాటు చేశాను.

ప్రస్తుతం వాడికి కూడా హీరోగా మారడంకంటే ఇలా నా పనివాడు-కమ్-పిఏగా ఉండటమే బాగు న్నట్లుంది. బైట ఉల్లాసంగా ఉత్సాహంగా యూనిట్లో అందరితో కబుర్లు చెప్తూ తిరుగుతున్న వాణ్ణి చూస్తుంటే వాడికి అనుకున్నది సాధించనందుకు ఏమాత్రం బాధ ఉన్నట్లు కనిపించటం లేదు.

వాణ్ణి అలా అద్దంలోంచి చూస్తుంటే గుండె కలుక్కు మంది. అది వాడిమీద జాలితో కాదనీ, నిజంగా నా గుండెల్లో వచ్చిన నొప్పితో అనీ అప్పటికీ తెలియ లేదు.

ఒళ్ళంతా చెమటలు పడుతున్నట్టనిపిస్తుంటే, రిమోట్‌తో ఏసీ టెంపరేచర్ మరింత తగ్గించి కళ్ళు మూసుకున్నాను. నొప్పికాస్త తగ్గినట్లే అనిపించింది. రెండునిమిషాలు గడిచింది. సన్నటిసూదితో ఎవరో గుండెల్లో పొడిచినట్లు మళ్ళీ ఆ బాధ మొదలైంది.

అప్పుడర్థమైంది అది ఎసిడిటీ బాధ కాకపోవచ్చని!

అర్జంటుగా హాస్పిటల్‌కి వెళ్ళాల్సిన అవసరం తెలుస్తుంటే రాముకు ఫోన్ చెయ్యబోయాను. చేతి లోంచి ఫోన్ జారిపోయింది. నేను కుర్చీలోనుండి




మరోపక్కకు జారిపోయాను. క్షణక్షణానికీ బాధ ఎక్కువ అవుతుంటే నా చెయ్యి ఫోన్‌వరకుకూడా వెళ్ళలేకపోయింది. అద్దంబైట నవ్వుతూ కబుర్లు చెప్తున్న రాము కనిపిస్తున్నా అతన్ని పిలిచేమార్గం నాకు కనిపించలేదు.

నా అంతం ఇలా రాబోతోందా అనుకుంటున్న నాకు స్పృహ తప్పింది.

కలో, నిజమో తెలియని అయోమయం.. నన్ను ఎవరో హాస్పిటల్‌కి తీసుకెళ్తున్నట్లు అనిపించింది. నా నోట్లో ఏవో గొట్టాలు దూరుస్తున్నారు. ఏదేదో చేస్తున్నారు. మరి కాసేపటి తరువాత ఒక్కసారిగా ప్రశాంతంగా అనిపించింది.

నా నటనను అభిమానించే ఇంతమంది అభి మానుల్ని వదిలి అప్పుడే చచ్చిపోవాలనిపించటంలేదు. ఎలా అయినా ముంచుకువస్తున్న మరణాన్ని తప్పించు కోవాలి. కానీ... ఎలా?

చుట్టూ ఐసుముక్కల మధ్య ఉన్నట్లు చల్లగా అనిపిస్తుంటే తిరిగి మెలకువ వచ్చింది.

చుట్టూ చీకటి. ఎదురుగా సొరంగమార్గం. ఆ మార్గం చివర ఒక కాంతిరేఖ. దానివైపు నేను ఆక ర్షించబడుతున్నాను. వద్దనుకున్నా అటు జారిపో తున్నాను.

మరణమంటే ఇదేనేమోనన్న తలంపు కలిగిందప్పుడు. ఎవరో నన్ను ఆహ్వానిస్తున్నట్లు అనిపించింది. చిత్రంగా నాకు బాధ ఏమీ తెలియటంలేదు.

'నేను రాను, నేను రాను..' అన్నాను అనియంత్రి తంగా.

"ఎక్కడకి రావు?" ఈ వెలుతురున్నవైపు నుండి అడిగింది ఒక గంభీరమైన గొంతు.

కళ్ళు చిట్లించుకుని చూశాను. అక్కడ వెలుతురు తప్ప ఇంకేమీ కనపడటంలేదు. "ఇప్పుడే చచ్చిపోవటం నాకు ఇష్టంలేదు" గింజుకుంటూ అరుస్తున్నట్లు అన్నాను.

"చచ్చిపోయి నువ్వు ఎక్కడకో వెళ్ళడంలేదు. నా దగ్గరకే వస్తున్నావు".

"వద్దు. నాకు ఇక్కడే బాగుంది".

"నేనెవరో తెలుసా?"

"అర్థమవుతోంది. అయినా నాకు ఇక్కడ ఉండ టమే ఇష్టం".

"ఋషులూ, యోగులూ కోరుకునే చావు నీకు లభ్యమవుతుంటే దానివిలువ తెలియటంలేదు. నీవు వ్యక్తిగతంగా ఎలాంటివాడివైనా కోట్లాది మందికి ఆనందం కల్పించిన కారణంగా అలాంటి అవకాశం ప్రసాదిద్దామనుకున్నాను".

"ఆ అవకాశంకంటే ఇక్కడ నా అభిమానుల మధ్య గడపటమే నాకు ఆనందం".

"లభిస్తున్నదాన్ని వద్దనుకుంటే తరువాత ఇక ఎప్పటికీ నీకు ఆ అవకాశం కలగకపోవచ్చు"

"ఫరవాలేదు. నేను బ్రతికి వుండటమే కావాలి".

ఆ వెలుగుకూడా ఆలోచనలో పడింది. నా కోరిక తీసి పారెయ్యదగ్గదేగానీ, నేను తీసిపారెయ్యదగ్గ వ్యక్తిని కాదుగా!

"నీది కోరుకోదగ్గ కోరికకాదు. కానీ అంతగా ప్రాధేయపడుతున్నావు కాబట్టి ఒక అవకాశం ఇస్తాను. నీ బంధువులు, పిల్లలు, అభిమానుల్లో ఎవ రైనా నీకు తనశరీరం ఇచ్చి నీ శరీరం వాళ్ళు తీసు కుంటారేమోకనుక్కో.. అలా మారుద్దాం".

"అలా ఎవరైనా నా శరీరంలోకి ప్రవేశిస్తే వారు ఎంత కాలం బ్రతుకుతారంటారు?"

"ఒకసారి గుండెపోటువచ్చి బ్రతికిన మనిషి ఎంతకాలం బ్రతుకుతాడో అంతకాలం... అయినా ముందు నీకు శరీరాన్ని ఎవరిస్తారో కనుక్కో"

"ఇవ్వరంటారా స్వామీ?"

"నేనెలా చెప్తాను? నీమీద వారికి ఎంత ప్రేమ ఉందో నీకే తెలియాలి.."

"నేనడిగితే ఎవరూ కాదనరు. ఎవరిని అడ గాలా అనే ఆలోచిస్తున్నాను".

"అయితే ఐదు నిమిషాలు సమయం తీసుకో. ఆలోచించి చెప్పు".

నాకు అంత సమయంకూడా పట్టలేదు. నేను అడిగితే నా కొడుకులు నా కోరిక తీర్చటానికి కాదనక పోవచ్చు. కానీ నా స్వార్థం అందుకు అంగీకరించ లేదు. నా కోరికకోసం వాళ్ళ ఆయుష్షు ఎందుకు తగ్గించాలి? మరి ఎవర్ని అడగాలి?... అప్పుడు గుర్తుకువచ్చాడు రాము. అవును.. ఇందుకు అతనే సరైనవ్యక్తి. నేను అడిగితే ఎట్టి పరిస్థితుల్లో కాద నడు. అదే చెప్పాను ఆ వెలుగుతో.

అక్కడనుండి సమాధానం రాలేదు. కానీ నేను హఠాత్తుగా రాముతో కనెక్ట్ అయ్యాను.

నాకొచ్చిన ఆఫర్ గురించి చెప్పాను.

ఆత్రుత లేకుండా కాసేపు ఆలోచించాడు రాము. "నేను మీ శరీరంలోకి ప్రవేశించినా ఆ శరీరానికి నటించే శక్తి ఎంత కాలం ఉంటుందో....?" సాలోచ నగా అన్నాడు.

"ఎక్కువ కాలం ఉండకపోవచ్చు".

"అప్పుడు నాకేమిటి లాభం?" అడిగాడు రాము.

నా ప్రాణాలు కాపాడే విషయంలో అతనలా లాభ నష్టాల గురించి ఆలోచిస్తాడని అనుకోలేదు. "నా శరీరం సహకరించినన్నిరోజులు దాన్ని వాడుకుని నువ్వు హీరో జీవితం అనుభవించు. నేను సంపాదిం చిన ఐశ్వర్యం, సకల భోగభాగ్యాలు నీకు కష్టపడ కుండా దొరుకుతాయి. అంతకంటే ఏమి కావాలి?"

"కాసేపు నా సంగతి పక్కనపెట్టండి. నా శరీ రంతో మీరేం సుఖం అనుభవిస్తారు? దుర్భర దారిద్ర్యం తప్ప నా దగ్గర ఏముంది?"

"నా ప్రతిభతో నీ శరీరాన్ని మరో గొప్పహీరోని చేస్తాను. నీ పేరు చిరస్థాయిగా మిగిలిపోతుంది. నాకు మరో జీవితం దొరుకుతుంది".

అతను ఏమి ఆలోచించుకున్నాడోగానీ, మొత్తా నికి నా ఆఫర్ అంగీకరించాడు. బహుశా తను అందుకోలేకపోయిన అందలం తన శరీరమైనా అందుకుంటుందని తృప్తి పడ్డాడేమో తెలియదు.

నేను చెప్పకుండానే ఆ అశరీరవాణికి రాము అంగీకారం గురించి తెలిసిపోయింది.

"నీ కోరిక తీరుస్తా. కాకపోతే ఒకచిన్న అను మానం. నువ్వు ఇప్పుడు రాము శరీరంలో ఉంటావు. వేరే శరీరంతో ఇదే నటన చేస్తే ప్రేక్షకులు హర్షిస్తా రంటావా?"

"నా నటన గురించి మీకు తెలీదేమో! నా కోసం ప్రాణాలిచ్చే అభిమానులున్నారు. నాకోసం రచనలు చేసే రచయితలున్నారు. నాకోసం సినిమాలుతీసే నిర్మాతలూ, దర్శకులూ ఉన్నారు. శరీరం ఏదైనా, నా నటనకోసం నన్ను పువ్వుల్లో పెట్టి చూసుకుంటారు.." చెప్పాను.

"నీ అభిప్రాయం ఎంత తప్పో చెప్పటానికైనా నీ కోరిక తీర్చవలసిందే.." అంది ఆ కంఠ స్వరం.

కాసేపటి తరువాత హాస్పిటల్ కారిడార్లో కుర్చీలో కూర్చుని గోడకు తల ఆనించి నిద్రపోతున్న రాము శరీరంలోని నాకు మెలకువ వచ్చింది.

లేచి నిలబడి ఐ.సి.యు. అద్దంలోనుండి లోప లకు చూశాను.

మొహమంతా ముడతలు పడి శరీరానికి

## సింగిల్‌గానే ఉందట!



**బాలీవుడ్‌**లో శ్రద్ధాకపూర్ మీద బోలెడన్ని గాసిప్పులు వస్తూంటాయి. ఎప్పుడూ ఎవరితోనో ఒకరితో ప్రేమాయణం నడుపుతోందనే వార్తలే అవి. అయితే అవన్నీ ఉత్త పుకార్లు మాత్రమే ననీ, తనకు ఎవరితో ఎలాంటి సంబంధం లేదనీ స్పష్టం చేస్తోంది ఈ హీరోయిన్. ఇలాంటి వార్తలు రాసి తనను బాధపెట్టవద్దని కూడా కోరుకుంటోంది. తన సినిమా షూటింగ్ సమయంలో హీరోతో కొద్దిగా క్లోజ్‌గా ఉంటాననీ, అది ఏ హీరోయిన్‌కి అయినా తప్పనిసరి అనీ, దానినే సంబంధం అనుకుని ఉన్నవీ లేనివీ రాస్తే ఎలా అంటూ బాధను వ్యక్తం చేస్తోంది.

గుచ్చిన గొట్టాలు చుట్టూ వేలాడుతుంటే పడుకున్న శరీరం నాదంటే నాకే నచ్చలేదు. కానీ నిన్నటిదాకా నాకు జేజేలు కొట్టించింది ఆ శరీరమే. నేను ఆలోచనలలో ఉండగానే ఆ శరీరంలో ఉన్న రాము కళ్ళు తెరచి చూశాడు.

మా ఇద్దరి కళ్ళూ కలుసుకున్నాయి.

ఒక నవ్వునవ్వి గ్రేట్ హీరో విష్ణుమూర్తిగారికి మెలకువ వచ్చిందని డాక్టర్లను ఎలర్ట్ చెయ్యటానికి పరుగెత్తాను. యువశరీరం ఇచ్చిన కొత్త శక్తితో నా మనసు తిరిగి యవ్వనం పొందినట్లు ఉరకలెత్తుతోంది.

డాక్టర్లు వచ్చారు. నా కొడుకులూ వచ్చారు. రాము శరీరంలో ఉన్న నన్ను పక్కకితోసి నా శరీరానికి సేవలు చేస్తున్నారు. వారి దృష్టిలో మామూలుగానే 'రాము' ఒక వేస్ట్ ఫెలో. విష్ణుమూర్తి మంచం మీద ఉన్న ఈ సమయంలో రామును పట్టించుకునే వాళ్ళే లేరు.

గండం గడిచిందని ప్రకటించారు డాక్టర్లు.

రాము శరీరంతో నేను బైటకు నడిచాను.

ఒక సామాన్యుడి జీవితం ఎలా ఉంటుందో సినిమాలో కాక నిజజీవితంలో మొదటిసారి అనుభవిస్తున్నాను.

వారం తరువాత ఇంటికి వచ్చిన విష్ణుమూర్తిని కలిశాను. ఇప్పుడు మా ఇద్దరి పాత్రలూ తిరగబడ్డాయి.

నాతో మాట్లాడటం ఇష్టంలేదన్నట్లు మొహం తిప్పుకున్నాడు. బాధలోవుండి అలా చేశాడేమో అనుకున్నాను. కానీ తరువాతకూడా అతని ప్రవర్తనలో మార్పురాలేదు.

షూటింగుకు వెంటరాబోయిన నన్ను 'అక్కర లేదు' అన్నాడు.

నాకు చూచాయగా విష్ణుమూర్తి ఎందుకు అలా ప్రవర్తిస్తున్నాడో అర్థమైంది. అతని సహకారం లేనిదే నేను హీరోని కాలేను. నాకు సహకరించి మిగిలిన కొన్ని సంవత్సరాల జీవితంలో అతను తనహోదాకి మరో పోటీదారుణ్ణి తెచ్చుకోదలచుకోలేదు.

నాకు ఒక్కసారిగా భయం వేసింది. ఇలా ఒక సామాన్యుడిలా బ్రతకటానికా మోక్షంకూడా వద్దని ఈ జీవితాన్ని ఎన్నుకున్నది?

ఎన్నిసార్లు విష్ణుమూర్తి దగ్గరకు వెళ్ళబోయినా నన్ను అసలు దగ్గరకు రానివ్వటంలేదు. అయినా నేను వదలకుండా వెంటబడుతూనే ఉన్నాను.

ఎప్పుడూలేనిది వరుసగా విష్ణుమూర్తి సినిమాలు రెండు ఫ్లాప్ అయ్యాయి. షూటింగులో విష్ణుమూర్తి నటన ఇంతకు ముందులాలేదని యూనిట్ సభ్యులు చెవులు కొరుక్కుంటున్నారు. ఎలా ఉంటుంది? విష్ణుమూర్తి రూపంలో ఉన్నది నేనుకాదు, రాము కదా. అతను తనదైన తరహాలో నటించటానికి ప్రయత్నిస్తున్నాడు. విష్ణుమూర్తి నుండి అతని తరహా నటన ఆశిస్తారుగానీ, ఇన్నేళ్ళ తరువాత కొత్తదనంకోసం ప్రయత్నిస్తున్న అతని ప్రయత్నాన్ని ఎవరూ హర్షించటంలేదు. అందుకే ఎన్నడూ లేనిది ఈ ఫ్లాపులు.

మొత్తానికి అతి ప్రయత్నంమీద విష్ణుమూర్తిని ఒంటరిగా కలుసుకోగలిగాను.

"నాకిప్పిస్తానన్న హీరో అవకాశంగురించి ఏమాలోచించారు?" అడిగాను.

"రెండు ఫ్లాపులు వచ్చేటప్పటికి నన్నుపెట్టి సినిమా తియ్యాలంటేనే ఇంకోసారి ఆలోచిస్తున్నారు. నీకు వేషాలెక్కడ ఇప్పించేది?" విసుగ్గా అన్నాడు విష్ణుమూర్తి.

"మన ఒప్పందం గుర్తుంచుకో! నేను సినిమా హీరో కాకపోతే ఈ దిక్కుమాలిన బ్రతుకు నాకెందుకు?" అన్నాన్నేను.

"నీది ఏదో గొప్పబ్రతుకని ఆయుష్షు తక్కువైనా నీ శరీరంలో ప్రవేశించటానికి ఒప్పుకున్నాను. పేరు గొప్ప ఊరు దిబ్బలా తయారైంది నా పరిస్థితి. సినిమాలు లేవు. పట్టించుకునే నాథుడూ లేడు".

"కనీసం మాటమీద నిలబడు. నాకొక అవకాశం ఇప్పిస్తే నువ్వు చేయాలనుకున్న పని నేనుచేసి చూపిస్తాను" కాన్ఫిడెంటుగా చెప్పాను.

ఏ మూడ్‌లోఉన్నాడో మొత్తానికి ఒప్పుకున్నాడు విష్ణుమూర్తి.

తనకు తెలిసిన ఒక డైరెక్టర్ని పట్టుకుని అతనికి రకరకాల ఆశలు చూపించి నన్ను హీరోగాపెట్టి సినిమా తియ్యటానికి ఒప్పించాడు.

'ఒక్క ఛాన్స్....' అనుకున్నాను నేను. నాకు ఒక్క ఛాన్సు ఇస్తే చాలు, నన్నునేను ప్రూవ్ చేసుకోగలను. తిరిగి తెలుగు చిత్రసీమని ఏలగలను. విష్ణుమూర్తి శరీరంలో ఉన్న రాము తన సహజ నటన ప్రదర్శించటంతో విష్ణుమూర్తి నుండి ఏమి ఆశిస్తున్నారో అది ప్రజలకి లభించలేదు. అందుకే విష్ణుమూర్తి సినిమాలకు మునుపటి ఆదరణ దొరకలేదు. ప్రేక్షకులకు కావలసింది విష్ణుమూర్తి నటన. అది వాళ్ళకి నేను ఇవ్వగలను. నాకు కావలసింది ఒక్క అవకాశం మాత్రమే!

నన్ను హీరోగాపెట్టి తీస్తున్న సినిమా షూటింగ్ మొదలైంది.

ముహూర్తానికివచ్చి కొబ్బరికాయకొట్టి వెళ్ళిపోయాడు విష్ణుమూర్తి.

ఎలాంటి షాటైనా రీటేక్ లేకుండా ఒప్పించే నేను, "వన్‌మోర్ టేక్..." అన్న డైరెక్టర్ మాటతో అవాక్కయ్యాను. కానీ ఇప్పుడునేను విష్ణుమూర్తినికాదు, మొదటి సినిమాలో నటిస్తున్న రామును. కాబట్టి అతని ఆజ్ఞ ఆచరణలో పెట్టాను.

రెండోటేక్ తరువాత డైరెక్టర్ మొహంలో కోపం ప్రతిఫలించింది. నా దగ్గరకి కోపంగావచ్చి, "నిన్ను నువ్వు ఏమనుకుంటున్నావ్? మరో విష్ణుమూర్తిని అనుకుంటున్నావా? అచ్చు ఆయనలా చేసేటట్టైతే నిన్ను పెట్టుకోవటం ఎందుకు? ఆయన్నే పెట్టుకుంటాంగా... ఆయన చిత్రసీమని ఏలినన్నాళ్ళూ ఆ అతినటన చూడలేక ప్రేక్షకులు చచ్చారు. మళ్ళీ నువ్వుకూడా అదేనటన చూపించేటట్టైతే మాకు అక్కర్లేదు. వేరే రకంగా చేయగలిగితే చెయ్యి. లేకపోతే దయచెయ్యి..." అన్నాడు కోపంగా.

వందల సినిమాలు చేసిన అనుభవం ఉన్న నన్ను ఇంతవరకూ ఎవరూ అలా తీసిపారెయ్యలేదు. ఆ మాటకొస్తే ఆ దర్శకుడితో ఇంతకుముందు నేను ఎన్నో సినిమాలు చేశాను. ప్రతిసారీ నా నటనని ఎంతగానో పొగిడేవాడు.

"ఇంకో ఛాన్స్ ఇవ్వరూ..." అన్నాను బ్రతిమలాడుతున్నట్లు.

విసవిసానడుస్తూ తనకుర్చీవైపు వెళ్ళిపోయాడు ఆ డైరెక్టర్.

మరోసారి టేక్ మొదలైంది. అరవైఏళ్ళ నా నటనని పక్కన పెట్టి కొత్తగా నటించాల్సిన అవసరం వచ్చింది.

"యూజ్‌లెస్ ఫెలో. నటించటం అంటే ఏమిటో తెలియని వాళ్ళు ఇండస్ట్రీకివచ్చి ఎందుకు మా ప్రాణం తీస్తారో అర్థం కాదు. గెట్ లాస్ట్...' అంటూ సెట్లో నుండి బైటకు వెళ్ళిపోయాడు అతను.

అప్పుడు తెలిసింది ఆ అశరీరవాణి చెప్పనిది ఏమిటో. గడిచిన జ్ఞాపకాన్ని గుర్తు చేసుకున్నంత మాత్రాన కాలం వెనక్కి తిరిగినట్లుకాదు. కొత్త జవసత్వాలు చేకూరినంత మాత్రాన మనిషి కొత్తగా మారడు. నాకు లభించిన 'కాలం' అయిపోయింది. అయినా ఇక్కడ ఉండాలనుకోవటం ప్రకృతి ధర్మాన్ని ఎదిరించటమే!

మరుసటి రోజు నేను ఆత్మహత్య చేసుకున్నాను.

**సెల్:94901 58002**



# తిండివేళలూ ముఖ్యమే!!

'వేళకు ఇంత తినడం నేర్చుకోరా అబ్బాయ్' అంటూ మనవడికి ముద్దుగా చెబుతుంది బామ్మ.

'నాకు తెలుసులేవే, బిజీగా ఉన్నా, నీ పని నువ్వు చూసుకో' అని కసురుకుంటాడా మనవడు. బామ్మ చెప్పిన ఆ ఒక్క మాటకున్న విలువను వెంటనే గ్రహించలేకపోతే, దాన్ని ప్రాక్టికల్‌గా అర్థంచేసుకోవడానికి అతనికి జీవితకాలం పట్టవచ్చు లేదా అది తెలుసుకునే వేళకు అతని ఆరోగ్యం చేయిదాటిపోవచ్చు కూడా!

అందుకే పెద్దల మాట చద్దన్నం మూట అన్నారు.

వేళకి తినకపోతే ఆరోగ్యం చెడిపోవడం ఖాయం. సాక్షాత్తూ పరిశోధకులే ఈ విషయాన్ని అధ్యయనాల ద్వారా తెలియజేశారు. సమయానికి తగినట్లుగా ఆహారం తీసుకుంటే ఊబకాయం ఉండదట. అంటే మంచి శరీరాకృతిని మన సొంతం చేసుకోవచ్చునన్నమాట! ప్రతిఒక్కరూ ఈ నియమం పాటించక తప్ప దంటున్నారు పరిశోధకులు.

చాలామంది మనం ఏం తింటున్నామనే అంశానికి ఎక్కువగా ప్రాధాన్యం ఇస్తారు. కానీ ఎప్పుడు తిన్నామన్నది కూడా ముఖ్యమే అంటున్నారు. ఆరోగ్యకర ఆహారం తినడం ఎంత ముఖ్యమో ఆరోగ్యకరమైన భోజనవేళలూ అంతే ముఖ్యం. అర్థరాత్రి వేళల్లో ఆహారం తినడంవల్ల మానసిక సమస్యలు, ఊబకాయం వస్తాయని పరిశోధనలు వెల్లడిస్తున్నాయి. ఇలా రాత్రి వేళల్లో ఎడాపెడా తినేయడం కూడా ఒక జబ్బే నట మరి దీన్ని ఎలా అధిగమించవచ్చునో తెలుసుకోండి!!

### నిశాహారం ఒక జబ్బే!

నిశాహారమనగానే నిషా కలిగించే ఆహారం అనుకునేరు. రాత్రివేళల్లో నిద్రపట్టక అదేపనిగా తింటూ కాలక్షేపం చేయడమే నిశాహారం. చీకటిలో తింటే ఎవరికీ తెలియదనుకునేరు. కానీ పరిశోధకులు ఇలాంటి అలవాట్లను కనిపెట్టారు. రాత్రివేళ అతి తిండివల్ల లావు అవుతారట. కేవలం తిండి ఎక్కువ తింటేనో లేదా ఫ్యాట్ ఫుడ్ తింటేనో లావవుతారనుకుంటే పొరబాటే. రాత్రిపూట తినడంవల్ల కూడా లావు అవుతారని పరిశోధకులు అంటున్నారు. రాత్రివేళ తినడం అనే అలవాటుకు మానసిక సమస్యలే కారణమని చెబుతున్నారు. మనసులో అలజడి రేకెత్తించే సమస్యల వల్ల స్థూలకాయం వస్తుందని నిపుణులు చెవినిల్లుకట్టుకుని పోరుతున్నారు.

### మనోభారంతో శరీరభారం

దిగులుగా ఉన్నప్పుడు కొందరు అదేపనిగా అతిగా తినేస్తుంటారు. ఆందోళనతో కంచాలకు కంచాలకొద్దీ లాగించేస్తుంటారు. వారెంత తింటున్నారో, ఏం తింటున్నారో కూడా గమనించకుండా తినేస్తుంటారు. పైగా శరీరానికి కొంచెం కూడా కష్టం కలిగించేందుకు అస్సలు ఇష్టపడరు. కూర్చుని తింటే కొండలైనా కరుగుతాయంటారు కదా! కానీ రాత్రివేళల్లో కూర్చుని తింటే మాత్రం కొండలా మీ శరీరం పెరుగుతుంది. పైగా ఇలా పెరగడంతో మరింత దిగులు కమ్ముకుంటుంది. నలుగురిలో బైటకు పోలేరు. దాంతో ఇంకా తినేస్తుంటారు. దీనివల్ల సమస్య జటిలం అవుతుందే తప్ప ఎలా తగ్గించుకోవాలో తెలియని సందిగ్ధావస్థలో పడతారు.

### బింజ్ ఈటింగ్ డిజార్డర్

భావోద్వేగాలకు విపరీతంగా లోనయ్యేవారిలో



కొందరు అవాంఛనీయ భావోద్వేగాలను అదుపు చేసుకోవడానికి తిండిని ఆశ్రయిస్తారు. ఇలా ఎలాంటి భావోద్వేగం కలిగినా దానిని అణుచుకోవడానికి ఏదో ఒకటి తినేస్తారు. ఇంకొందరేమో ఆహారం పారేయడం ఇష్టంలేక ఆకలి ఉన్నా లేకున్నా తింటారు. రకరకాల కారణాల వల్ల అభద్రతాభావంతో బాధపడేవారు సురక్షితంగా ఉన్నామనే భావనకోసం ఆకలి లేకున్నా తింటారు. ఇలా తినే క్వాంటిటీ పెంచుతూ క్వాలిటీ విషయాన్ని విస్మరిస్తారు.

మానసిక సమస్యల నుంచి బైటపడే మార్గం లేక తినడమే ఒక అలవాటుగా చేసుకుంటే అది క్రమంగా బింజ్ ఈటింగ్ డిజార్డర్ (బిఈడి)గా మారుతుంది. బిఈడీ అనగానే ఏదో డిగ్రీ అనుకునేరు. ఇది డిజార్డర్ డిగ్రీ అన్నమాట. ఈ డిజార్డర్ బాధితులకు కాసింత ఖాళీ సమయం దొరికితేచాలు తిండిమీదకే మనసు పోతుంది. ఎవరికైనా వరుసగా ఆరునెలలపాటు కనీసం వారానికి రెండు రోజులు అతిగా తినడమే అలవాటుగా కొనసాగితే అలాంటి వారిని బీఈడి బాధితులుగానే పరిగణించాలి. మొత్తం జనాభాలో ఇలాంటివారు రెండు శాతం వరకు ఉంటారు. స్థూలకాయుల్లో దాదాపు 25 శాతం మేరకు బీఈడీ బాధితులే. ఇలాంటి వారు చురుగ్గా పనులు చేసుకోవడం కంటే, చాలా వరకు కూర్చున్న చోటు నుంచి కదలకుండా ఉండేందుకే ఇష్టపడతారట. బద్ధకంగా మారే చర్యలవల్ల మరింత లావు అవుతారట.

### ఫాస్ట్‌ఫుడ్‌పై తీపి

నిద్రలేమివల్ల దిగులుతో, ఆందోళనలతో బాధపడే వారికి మెదడులోని సంతృప్తి కేంద్రం సక్రమంగా పనిచేయదు. దీనివల్ల ఏం తిన్నా ఎంత తిన్నా సంతృప్తి కలగలదు. అలాంటి వారి మెదడులోని ఆకలి కేంద్రం ఇంకా తినాలి అని ఆరాటపడుతూ ఉంటుంది. అందుకే వారు ఎక్కువగా త్వరగా ఆకలి తీర్చే స్వీట్లు లేదా చిప్స్, పిజ్జాలు, బర్గర్లవంటి ఫాస్ట్‌ఫుడ్‌ని తినేస్తూ ఉంటారు, చక్కెరపై అదుపులేని ఈ మోహం కూడా ఊబకాయాన్ని కలిగిస్తూ ఉంటుంది.

### పిల్లలతో గడపాలి

తల్లిదండ్రులు ఎక్కువసేపు వారితో గడపడం అవసరం. ముఖ్యంగా కార్పొరేట్ ఉద్యోగాలు చేసే తల్లిదండ్రులకు సరైన పనివేళల కారణంగా పిల్లలతో ఎక్కువ సమయం గడిపేందుకు అవకాశం ఉండదు. దాంతో పిల్లలు వారిపై బెంగ పెట్టుకుని క్రమంగా డిప్రెషన్‌లోకి కూరుకుపోతారట. దాంతో సాంత్వన చేకూర్చుకునేందుకు ఆహారాన్నే ప్రత్యామ్నాయంగా చేసుకుంటారట. దీనివల్ల చిన్న వయసులోనే స్థూలకాయులుగా మారతారు. ఒంటరితనంలో మానసికంగా కూరుకుపోయిన ఇలాంటి పిల్లలు కాస్త ఎదిగాక మాదకద్రవ్యాలకు కూడా అలవాటు పడే అవకాశాలు కూడా లేకపోలేదని నిపుణులు హెచ్చరిస్తున్నారు. అందుకే తల్లిదండ్రులను పిల్లలతో గడపడానికి సమయం కేటాయించమంటున్నారు.

### హెల్త్ టైమింగ్స్

వెలుతురు ఉండగానే తినేస్తే ఊబకాయం రాదుగానీ బాగా పొద్దుపోయాక చీకటివేళ తింటే లావు ఎలా అవుతాం అన్న సందేహం కలుగుతోందా? పగటికి రాత్రికి అనుగుణంగా నడిచే జీవగడియారం మన శరీరంలో ఉంటుందట. ఈ విషయమై సైంటిస్టులు మరిన్ని అధ్యయనాలు చేస్తున్నారు. రాత్రివేళల్లో కనిపించే లైట్లకి పగటివేళల్లో కనిపించే లైట్లకి తేడా ఎలా ఉంటుందో పగటివేళ తినే తిండికీ, రాత్రివేళ తిండికి కూడా అంతే తేడా ఉంటుందట. పగటి వేళ స్రవించాల్సిన జీర్ణరసాయనాలు పగలూ రేయీ తేడా లేకుండా అదే పనిగా స్రవిస్తూ ఉంటాయి. మనం ఎప్పుడూ తింటూనే ఉంటే మన గ్లూకోజ్ పాళ్ళు ఎప్పుడూ తారాస్థాయిలోనే ఉంటాయి. దాంతో వాటిని అదుపు చేసేందుకు అదేపనిగా ఇన్సులిన్ స్రవిస్తూ ఉంటుంది. అందుకే జీర్ణక్రియకు రెస్ట్ ఇవ్వడం చాలా ముఖ్యం. రాత్రి నిద్ర సమయంలో తినకుండా ఉండాలి. రాత్రి కనీసం తొమ్మిది గంటలకు భోజనం చేసినా మర్నాడుదయం తొమ్మిదింటికి టిఫిన్ చేయాలి. ఇలా ఉదయం అల్పాహారానికి రాత్రి భోజనానికి మధ్య కనీసం పన్నెండు గంటల విరామం ఉండాలట. ఉదయం బ్రేక్‌ఫాస్ట్‌ని ఎట్టి పరిస్థితుల్లోనూ మానకూడదట. అందుకే ఉదయం పూట టిఫిన్‌ను మహారాజులాగా, భోజనం తరహాలో చేయాలట. మధ్యాహ్న భోజనం సామాన్యుడి తిండిలా తినాలట. ఈ నియమాలు పాటిస్తే ఈటింగ్ డిజార్డర్ తగ్గించుకోవచ్చు.

**- పుష్పలత**

## పరిశోధనలు చెప్పేదీ ఇదే!

**రా**త్రివేళల్లో అమితాహారం వల్ల బరువు పెరుగుతుందనే విషయం తాజా పరిశోధనల్లోనూ నిరూపణ అయింది. సాల్క్ ఇనిస్టిట్యూట్ ఫర్ బయోలాజికల్ సైన్సెస్‌కి చెందిన సచ్చిదానంద పాండా పరిశోధనలో ఈ విషయం తేటతెల్లమైంది. ఈ విషయమై ఎలుకల మీద పరిశోధనలు నిర్వహించగా బాగా పొద్దుపోయాక తిండి తినే ఎలుకలు విపరీతంగా బరువు పెరిగాయట. దీనికి భిన్నంగా తిండి తినని జీవులు సన్నబడ్డాయి. మనలో ఆరోగ్యకరమైన అలవాట్లను ప్రోత్సహించేందుకు ఎలుకలపై జరుగుతున్న ఈ పరిశోధనలూ తోడ్పడుతున్నాయి. రాత్రంతా ఏదో ఒకటి తింటూ ఉండే జీవుల్లో డయాబెటిస్ వచ్చే అవకాశాలు ఎక్కువ. అంతేకాదు, ఫ్యాటీ లివర్ వచ్చే అవకాశం ఉంది. రాత్రిపూట ఇన్‌టేకింగ్ లేకుండా జీర్ణాశయానికి విరామం ఇస్తే కొలెస్ట్రాల్‌లో గణనీయమైన తరుగుదల కనిపిస్తోందట.

## ఎలా అధిగమించవచ్చు?

**మా**నసిక సమస్యలవల్ల అతిగా తినే అలవాటును అధిగమించడం కాస్త కష్టమే అయినా కొంత ప్రయత్నంతో దీన్ని అధిగమించవచ్చని నిపుణులు చెబుతున్నారు. వారు చెబుతున్న ఈ కొద్దిపాటి జాగ్రత్తలతో ఈ సమస్య నుంచి బైటపడవచ్చు. ఏం తింటున్నారో ఎంత తింటున్నారో శ్రద్ధగా గమనించాలి. అతిగా తినడం అనర్థాలకు మూలం. తినే పదార్థాల పరిమాణంపై శ్రద్ధపెట్టి తింటే, ఈ పరిస్థితిని తేలిగ్గానే అధిగమించవచ్చు.

అపరిమితమైన తిండికి ఒత్తిడే ముఖ్య కారణం అంటున్నారు. అందుకే ఒత్తిడిని ముందుగా తగ్గించుకోవాలి. వ్యాయామం కాస్త కఠినమైన పరిష్కారమే అయినప్పటికీ వ్యాయామంవల్ల ఒత్తిడిని జయించవచ్చు.

అదేవిధంగా స్థూలకాయాన్ని జయించాలంటే, సమోసాలు, మిర్చీలు, బర్గర్లు వంటి జంక్ ఫుడ్‌కి దూరంగా ఉండాలి. పోషక విలువలతో కూడిన ఆహారం తీసుకోవాలి. నెమ్మదిగా జీర్ణమయ్యే అహారం ఎక్కువసార్లు తీసుకుంటూ ఉండాలి. అంతేకాక రోజులో ఎక్కువసార్లు నీరు తాగాలి. దీనివల్ల బరువు తగ్గుతారు.




**అదేరోజు సాయంత్రం.... సమయం ఆరుగంటలు.**

**రాజశేఖరం ఇంటికి డాక్టర్ చంద్రమౌళి, అతని భార్య భవాని వచ్చారు. చంద్రమౌళి మిలిట్రీలో రాజశేఖరంతో బాటు డాక్టర్‌గా పనిచేసి, రిటైర్మెంటు తీసుకుని దిల్‌షుక్‌నగర్‌లో క్లినిక్ నడుపుతున్నాడు. ఒక్కడే కొడుకు. గ్లోబల్ హాస్పిటల్‌లో సర్జన్‌గా పనిచేస్తున్నాడు.**

**రెండు కుటుంబాలకీ పూర్వ పరిచయాలుండడంతో, చాలాకాలం తర్వాత కల్సుకున్న ఆనందం వాళ్ళ కబుర్లలో ప్రధానాంశమైంది.**

"అయితే, "డాక్టర్ మాధురి ఐ.ఎ.ఎస్" అన్న మాట. గ్రేట్... చాలా ప్రౌడ్‌గా ఉంది. ఎప్పుడో చిన్నప్పుడు చూశాను" అన్నాడు చంద్రమౌళి.

"ఇవన్నీ మాధురి లేటెస్ట్ ఫోటోలు" అని ఆల్బం ఇచ్చింది లలిత, కాఫీ ఫార్మాలిటీ అయ్యాక...

"అవునూ.. మీ వంశీ డాక్టరే కదా! తీసుకురాలేదేం" అడిగాడు రాజశేఖరం.

"అవును. జనరల్ సర్జన్‌గా గ్లోబల్‌లో చేస్తున్నాడు.

"వెరీగుడ్... నీలానే ఉంటాడు కదా!" అన్నాడు రాజశేఖరం.

"ఇప్పుడిలా ఉన్నాడు" అని వ్యాలెట్ తీసి, అందులో ఉన్న వంశీ ఫోటో తీసి రాజశేఖరానికిచ్చాడు.

చూసి "ఆ రోజుల్లో నువ్వున్నట్టే ఉన్నాడు" అన్నాడు నవ్వుతూ. రాత్రి డిన్నరయ్యాక వెళ్ళారు చంద్రమౌళి దంపతులు.

వాళ్ళెందుకొచ్చారో, వీళ్ళు వాళ్ళతో ఏం మాట్లాడారో సుందర్రామయ్యకి అర్థం గాలేదు. కానీ.. కొడుకు మాటల్ని బట్టి, మాధురికి పెళ్ళిసంబంధం గురించేనని మాత్రం గ్రహించాడు.

●●●

రాత్రి పదైంది. మనసంతా చిరాగ్గా ఉంది శారదకి. హాల్లో లైట్లు ఆఫ్ చేద్దామని బెడ్‌రూం నుండి వచ్చింది. ల్యాండ్‌ఫోన్ శబ్దం చేస్తుంటే, ఫోనెత్తి.. "హలో!" అంది.

"అమ్మా!" అన్నాడు కౌషిక్.

"ఎక్కణ్ణుంచిరా! ఎక్కడికెళ్ళావు?" చాలా సంవత్సరాల తర్వాత శారద కళ్ళలో కన్నీళ్ళు.

"కంగారు పడకమ్మా! అర్జంటు పనిమీద ఢిల్లీ వెళ్ళాల్సొచ్చింది. అఫీషియల్ వర్క్. రెండ్రోజులు పట్టింది".

"ఒక్క ఫోన్ చేసే టైము దొరకలేదా? ఎంత కంగారు పడుతున్నామో తెలుసా?"

"ఫ్లైట్ క్యాచ్ చెయ్యాలన్న హడావిడిలో ఫోన్ ఆఫీసులోనే మర్చిపోయానమ్మా!"

"మీ డాడీ ఎంత దిగులు పడుతున్నారో తెలుసా! మీ ఆఫీసుకెళ్ళి ఎంక్వయిరీ చేస్తే... నువ్వు ఢిల్లీ వెళ్ళావని తెలిశాక నెమ్మదించారు".

"సారీ! అమ్మా! రేపు సాయంత్రానికి వచ్చేస్తా! డాడీ ఉన్నారా?"

"లేరు.. కోర్టుకి వెళ్ళారు."

"అందరూ బాగున్నారామ్మా!"

"ఈ రెండ్రోజుల్లోనే నీకు తెలియని ప్రచండ మార్పులేమీ జరగలేదు. అవన్నీ తర్వాత... ముందు నువ్వింటికొచ్చెయ్".

"రేపు సాయంత్రానికి నీముందుంటా? సరేనా?" అని ఫోన్ పెట్టేశాడు కౌషిక్.

●●●

అదేరోజు రాత్రి.. రాజశేఖరం పక్కన పడుకున్న భార్య లలితతో "చంద్రమౌళి తన కొడుకు డాక్టర్ వంశీకి, మాధురికి పెళ్ళిచూపులు ఏర్పాటు చెయ్యమంటున్నాడు. నువ్వేమంటావు?" అన్నాడు.

"ఇప్పుడా ఆలోచనెందుకండీ!" ఆశ్చర్యంగా అంది లలిత.

"ఆలోచించే టైము లేదు కాబట్టి".

"ఏం బావుంటుందండీ! కౌషిక్ అని అనుకున్నాక"

"అది జరగదని తెల్సిందిగా!"

"అని వాళ్ళన్నారా? చిన్న కారణం చూపించి, వాళ్ళందర్నీ దూరం చేసుకుందామా?"

"అయితే క్యారెక్టర్ లేని కౌషిక్‌కి మాధురినిచ్చి పెళ్ళిచేద్దామంటావా?"

"అంటే వాడికి క్యారెక్టర్ లేదని డిసైడైపోయారా? చిన్నప్పట్నుంచీ మన కళ్ళముందు పెరిగిన వాడండీ!"

"ఇప్పుడు పెద్దవాడై పోయాడుగా! మనందరికీ తెలియని కౌషిక్ రెండోవైపు ఎలా ఉంటాడో చూపించాడుగా!"

"అందులో నిజానిజాలు తెల్సుకోవాల్సిన బాధ్యత మనకి లేదా?"

"ఉంది.... కనుక్కోబట్టే గదా! అసలు రంగు బైట పడింది" అన్నాడు వ్యంగ్యంగా.

"మీ మాటలు ఇహ ఆపండి. ఇవన్నీ అన్నయ్యగారి చెవిన బడితే...!"

"దాస్తే... దాగని విషయం గురించి మనం ఎందుకు భయపడాలి?"

"తొందరపడి నిర్ణయాలు తీసుకోకండి. మరోసారి ఆలోచించండి."

"ఇక్కడిదాక వచ్చాక ఇహ ఆలోచించేదేం లేదు. మాధురి వచ్చాక, చంద్రమౌళి వాళ్ళు పెళ్ళిచూపులకు వస్తారు".

"....... .......... .........."

"ఏంటి మాట్లాడవు?"

"ఏం మాట్లాడమంటారు? ఏకపక్ష నిర్ణయాలు మీరు తీసుకుంటున్నప్పుడు"

లలిత మాటలు వినిపించనట్టు, "మాధురి వచ్చాక, మాట్లాడిన తర్వాతే పెళ్ళిచూపులు ఏర్పాటు చేద్దాం. వంశీ మంచి సర్జను. మనకి తగిన సంబంధం. నువ్వే మాధురిని కన్విన్స్ చెయ్యాలి".

"నావల్లకాదు. అదీ మీరే చెప్పండి. మీలా ఖచ్చితంగా నేను మాట్లాడలేను. కానీ ఈ విషయం మాధురికి తెలియకముందే, అన్నయ్యగారూ వాళ్ళక్కూడా మీరే చెప్పండి. ఎందుకైనా మంచిది... మరోమారు ఆలోచించి నిర్ణయం తీసుకోండి. అయినా మీది తొందరపాటు నిర్ణయమని మీకు అనిపించటం లేదా? మన కష్టాల్లో, సుఖాల్లో అండగా ఉన్న వాళ్ళని, చిన్నకారణం చూపించి.. ఎన్నో ఏళ్ళుగా పెంచుకున్న అనుబంధాన్ని తెంపుకుంటే, తర్వాత మనమెంత ఫీలయినా...." అంది లలిత.

ఆమె మాటలు వినటం ఇష్టం లేనట్టు రాజశేఖరం పక్కకి తిరిగి పడుకున్నాడు.

●●●

రాజేష్ కారు పార్క్‌చేసి.... ఇందిరాపార్క్‌లో రూపకోసం ఎదురు చూస్తున్నాడు.

### జరిగిన కథ

**ప**క్కపక్క ఇళ్ళల్లో స్థిరపడిన స్నేహితుల పిల్లలే కౌషిక్, మాధురి. ఒకరు డాక్టర్, మరొకరు ఇంజనీర్. పెద్దలు వారికి పెళ్ళిసన్నాహాలు చేస్తుంటారు. ఈ లోపు మాధురి ఫ్రెండ్ రూపతండ్రి వచ్చి కౌషిక్ తన కూతుర్ని ప్రేమిస్తున్నాడనీ, వారికి పెళ్ళిచేయాలనీ అడుగుతాడు. నిజానిజాలు తేలకముందే కౌషిక్ దోషిగా మారతాడు. ముస్సోరిలో ఐఎఎస్ శిక్షణ పొందుతున్న మాధురిని కలిసిన కౌషిక్ ఆమెకు అన్నీ వివరిస్తాడు. ఇంతలో వీరిద్దరి కుటుంబాల మధ్య ఉన్న దశాబ్దాలనాటి స్నేహం బీటలువారే స్థితికి చేరుకుంటుంది.

ఆ తర్వాత.....

పది, ఇరవై, ముప్ఫయ్ నిమిషాలు ముందుకు కదిలినా, రూప రాకపోయేసరికి, ఆమె సెల్‌కి ఫోన్ చేశాడు. 'స్విచాఫ్' అనొస్తోంది. కావాలనే రూప అరచెయ్యి చూపించిందని అర్థం చేసుకున్న రాజేష్, తిరిగి వెళ్ళబోతుంటే.. చేతిలో ఉన్న సెల్‌ఫోన్ శబ్దం చేసింది. అప్పటికే కార్లో కూచుని డోర్‌లాక్ చేసిన రాజేష్... ఎవరితో మాట్లాడుతున్నాడో బైటికి విన్పించటం లేదు.

●●●

ఉదయం ఆరుగంటలు. శంషాబాద్ ఏర్‌పోర్ట్‌కి ఢిల్లీనుంచి వచ్చిన మాధురిని రిసీవ్ చేసుకోవడానికి రాజశేఖరం, లలిత వచ్చారు. క్లియరెన్స్ అయ్యాక, లగేజ్ తీసుకుని తల్లిదండ్రులున్న దగ్గరకి వచ్చింది మాధురి.

●●●

ఇంటికొచ్చిన మాధురికి ఎదురెళ్ళి లగేజ్ లోపలికి తెస్తూ, "బాగుండారామ్మా" అన్నాడు గోవిందు.

"ఆc... నువ్వెలా ఉన్నావు?" అంది.

సుందర్రామయ్య ఎదురెళ్ళి మనవరాల్ని చూసి, "మధూ! అలా చిక్కిపోయావేంటే?" అన్నాడు.

"మీ అందరి మీద బెంగ తాతయ్యా!" అంది నవ్వి.

గంట తర్వాత భాస్కర్రావు, శారద వచ్చి "ఎలా ఉన్నావు డాక్టర్ కలెక్టరమ్మా!" అంటూ పరామర్శించారు.

"బావున్నాను... మీరు?"

"ఊc.... ఎలా ఉంది? ముస్సోరి ట్రైనింగ్?" అడిగాడు భాస్కర్రావు.

"చాలా బాగుందంకుల్.. మంచి ఎన్విరాన్‌మెంట్. క్లైమేట్ బాగుంది. ఎంతోమంది ఇంటలెక్చువల్స్ మధ్య నేనూ ఉండటం థ్రిల్లింగ్‌గా ఉంది" అంది ఎగ్జైటింగ్‌గా.

"మాధురీ! వేళకి తింటున్నావా? బాగా చిక్కావు" అంది శారద.

"నిజమా! ఉండండాంటీ, అద్దంలో చూసుకొస్తాను. ఇందాక తాతయ్య కూడా అలానే అన్నారు" అంటూ లోపలికి వెళ్ళింది.

భాస్కర్రావు గొంతు విని.. రాజశేఖరం పైనుండి రావటం గమనించి "మధూ! రిలాక్సవ్వు. తర్వాత కలుద్దాం" అని శారద లేచేసరికి, భాస్కర్రావు ఆమె వెనకే వెళ్ళాడు.

లలిత మౌనంగా చూసిందే తప్ప, ఉండమని అనలేదు. రాజశేఖరం మాత్రం వాళ్ళు కావాలనే తనని విలన్‌గా భావిస్తున్నారని అనుకున్నాడు.

"ఏరమ్మా! ఆంటీవాళ్ళు?" అంది మాధురి వచ్చి.

"తర్వాత కలుస్తామని వెళ్ళారు. నువ్వు స్నానం చేసొస్తే... వేడిగా టిఫిన్ పెడతాను" అంది లలిత.

గోపాలకృష్ణయ్య లోపలికొచ్చి "ఏరా! మాధురి వచ్చిందటగా! ఎక్కడ?" అడిగాడు.

గొంతు విని బయటికొచ్చి "తాతగారూ! బావున్నారా?" అంది మాధురి.

"ఏమిటీ... కొత్తగా 'గార్లు' అంటున్నావు?" అన్నాడు.

"మర్యాద.. మర్యాద"

గోపాలకృష్ణయ్య మాధురిని తేరిపారచూస్తూ "ఎందుకిలా సన్నబడ్డావు?" అన్నాడు.

"ది....గు....లు"

"ఎవరి మీదా?"

"నీ మనవడి మీ...ద" అంది మెల్లగా.

"సరైన సమయంలోనే మొదలైంది ఫో!" అన్నాడు అదే స్థాయిలో.

●●●

హాల్లో కూచుని పేపరు చూస్తున్నాడు భాస్కర్రావు. శారద టీ తెచ్చింది.

"రాత్రి ఆలస్యంగా వచ్చారని అడగలేదు. నిన్న కోర్టు వాయిదా ఏమైంది?".

"వచ్చేవారం హియరింగు" అన్నాడు తల తిప్పకుండా.

శారద తనూ టీ తాగుతూ..... "మాధురి వచ్చిందిగా! మాధురి అభిప్రాయం ఏంటో ఓసారి అడగనా?" అంది.

"అంతకన్నా ముఖ్యమైన విషయం... విను. నిన్న రాజశేఖరం ఫోన్ చేసి హాస్పిటల్ కట్టడానికి ఇచ్చిన పదిలక్షలు తిరిగి ఇచ్చెయ్యమన్నాడు. వేరే చోట పెట్టుబడి పెడుతున్నాడట" అన్నాడు.

"మంచిదే! ఇదంతా చూస్తుంటే మీరన్నట్టు.. ఆయన కావాలనే ఈ విషయాన్నింత పెద్దది చేస్తున్నట్టన్పిస్తోంది. అన్నట్టు కౌశిక్ ఫోన్ చేశాడు" అని



కౌషిక్ చెప్పిందంతా భర్తకి చెప్పింది.

"వాణ్ణి కూడా రానియ్. ముందుగా మాధురి ముందు మనమెందుకు బైటపడటం" అన్నాడు భాస్కర్రావు.

●●●

మధ్యాహ్నం పన్నెండు గంటలు. హనుమకొండ చౌరస్తా దగ్గర్లో ఉన్న కిషన్‌పురలో భానోజీరావు ఇంటి ముందాగిన కార్లోంచి దిగిన కౌషిక్, రూప సెల్‌కి ఫోన్ చేశాడు.

"హలో! కౌషిక్! నన్ను గుర్తుంచుకున్నారే!"

"మర్చిపోయే అనుబంధమా? మనది. ఇప్పుడు ఎక్కడున్నారు?"

"హైదరాబాదులోనే.."

"అయితే వెంటనే మా ఇంటికొచ్చెయ్యండి. మాధురి వచ్చింది."

"ఇప్పుడా?!!"

"పోనీ.. ఓ గంటాగి రండి"

"ఈరోజు అస్సలు కుదర్దు. రేపొచ్చి కలుస్తాను".

"నేనొచ్చి పికప్ చేసుకుంటాను. విద్యానగర్ రానా?"

"వద్దొద్దు. మా కజిన్ వాళ్ళింట్లో ఫంక్షన్ జరుగుతోంది. మధ్యలో వదిలేసి రాలేను".

"సరే మీ బ్యాడ్‌లక్" అని ఫోనాఫ్‌చేసి, లోపలికెళ్ళి కాలింగ్ బెల్ నొక్కాడు.

ఓ మధ్య వయస్కురాలు తలుపుతీసి, "ఎవరు గావాల?" అంది.

"భానోజీ గారిని కలవడానికి వచ్చాను. నా పేరు కౌషిక్" అన్నాడు.

రెండు నిమిషాల తర్వాత భానోజీ వచ్చి, "అరే! కౌషిక్ అంటే నువ్వేనా? ఏంటి సెప్పాపెట్టకుండా వచ్చినవు.. రా! రా! కూచో" అన్నాడు.

"రూపా! ఎవురొచ్చిన్రో చూడు" అని రూపని పిలిచాడు.

రూప గదిలో నుండి బైటికొచ్చి... అక్కడున్న కౌషిక్‌ని చూసి షాకయి రాని నవ్వు తెచ్చుకుని "రండి! రండి! ఏంటి? సడన్‌గా నా మీద ఇంత దయ కల్గింది" అంది.

"ఇంట్లోనే ఉండి, హైదరాబాద్‌లో ఉన్నానని చెప్పి, ఇంత సడన్‌గా ఎలా ఊడిపడ్డారండీ" అన్నాడు ఆశ్చర్యంగా.

"అదీ.... అదీ.. జస్ట్ ఫర్ ఫన్.. నిన్ననే వచ్చానిక్కడికి. నిలబడే ఉన్నారేంటి... రండి! కూచోండి" అంది దొరికిపోయిన దొంగలా.

"నా ఫ్రెండ్ కూడా వచ్చాడు. పిలుచుకొస్తాను" అని బైటికొచ్చి, కార్లో కూచున్న రాజేష్‌తో కలిసి లోపలికి వస్తుంటే, వాళ్ళిద్దర్నీ చూసిన రూప నోటమాట రానట్టు అవాక్కయి చూసింది. ఇద్దరూ వచ్చి సోఫాలో కూచున్నారు.

"ఏంటి రూపా! నన్ను ఇందిరాపార్కు దగ్గర వెయిటింగ్‌లో పెట్టి, నువ్విక్కడికి వచ్చావేంటి? టూ... బ్యాడ్" అన్నాడు రాజేష్.

ముఖమంతా నవ్వు పులుముకుని, "మీరిద్దరూ ఎక్కడ కలిశారు?" అంది.

"మమ్మల్నిద్దర్నీ కలిపింది నువ్వే".

"అబ్బ! ఇవాళేంటి అంతా కన్ఫ్యూజన్‌గా ఉంది" అని రూప తనలోని నటిని బైటకు రప్పిస్తోంది.

భానోజీకి ఏమీ అర్థంగాక.. నిలబడి చూస్తున్నాడు. రూప లేచి లోపలికెళ్ళి కూల్‌డ్రింక్స్ తెచ్చి ఇద్దరికీ ఇచ్చింది. కౌషిక్‌వైపు తిరిగి "మాధురి ఎప్పుడొచ్చింది? ఎలా ఉంది?" అంది.

"మధ్యలో మాధురి సంగతెందుగ్గానీ, మీ వాళ్ళతో నువ్వే మాట్లాడి, మన పెళ్ళి మేటర్ సెటిల్ చేస్తావా? లేకపోతే మా వాళ్ళని మీ ఇంటికే పిలిపించమంటావా?" అన్నాడు రాజేష్.

"ఏంటమ్మా! రూపా! ఇతనెవరు? పెళ్ళంటడేంది?" అడిగాడు భానోజీ.

"మీ రూపా, నేనూ మెడిసిన్‌లో క్లాస్‌మేట్సండీ! ఇద్దరం ఫస్టియర్లోనే ప్రేమించుకున్నాం. ఫైనలియర్ అయ్యాక పెళ్ళి చేసుకుందామనుకున్నాం. సడన్‌గా ఇప్పుడు ఇంట్లోవాళ్ళు ఒప్పుకోవటం లేదని నాతో చెప్పి, ఇప్పుడు కౌషిక్‌తో పెళ్ళంటోంది. ఇదేం న్యాయం.. పెద్దాయన మీరు. మీ అమ్మాయికి మంచీ, చెడూ... పద్ధతులూ నేర్పలేదా?" అన్నాడు రాజేష్. భానోజీ మౌనంగా రూపవైపు చూశాడు. రూప మొహంలో కంగారు, స్వేదం అలముకున్నాయి. తమాయించుకుంటూ,

"నో!... నో!... నిన్ను నేను ప్రేమించడమేమిటి రాజేష్! కొత్తగా మాట్లాడుతున్నావు. క్లాస్‌మేట్‌వి గదా! అని క్లోజ్‌గా ఉంటే... పెళ్ళని వెంటబడుతున్నావేంటి?" అంది.

"క్లోజ్" అంటే.. ఇలాగేనా?" అని, చేతిలో ఉన్న ఫోటోల్ని తీసి భానోజీ ముందు పడేసి, "వీటిని చూసి మీరే చెప్పండి" అన్నాడు.

చూసి రియాక్టవుతాడనుకున్న భానోజీ రివర్సయ్యేసరికి రాజేష్, కౌషిక్ మొహాలు చూసుకున్నారు.

"ఆ ఈ ఫోటోల్దేముండాది తమ్మీ! ఇయ్యాలరేపు కంప్యూటర్లలో ఎవరెవ్వరికీ ఎసమంటి కాంబినేషన్లు గావాల్నో సెప్పుండ్రి. ఈ కౌషిక్‌బాబుకి, ఐశ్వర్యా రాయ్ అతుక్కు బోయినట్టు గావాల్నా.. నీ పేరేంది... రాజేష్‌గదూ.. నిన్న రంభొచ్చి మూతిలో మూతి

కౌషిక్‌కి నైతిక విలువలు లేవనే అభిప్రాయంతో ఉన్నాడు మాధురి తండ్రి. ఆమెకు మరో సంబంధం వెతికే పనిలో పడ్డాడు. తన స్నేహితుడి కొడుక్కి, మాధురికి పెళ్ళి చేయాలని నిర్ణయించాడు. వారిని పెళ్ళిచూపులకు రప్పించాడు. దాంతో కౌషిక్ తండ్రిలో కూడా పట్టుదల పెరిగింది. అతడు కూడా కౌషిక్‌కి పెళ్ళి ప్రయత్నాలు మొదలెట్టాడు. మరి మాధురి ఏం చేసింది?

పెట్టి, ముద్దుబెట్టుకున్నట్టు గావాల్నా.. సెప్పండి... సిటికె, సిటికేస్తే చాలు...సెకండ్లలో వచ్చేస్తయి" అన్నాడు.

రూప మొహంలో చిరుదరహాసం.

"నువ్వేం ఫికరుబడకు బిడ్డా! నువ్వీ కౌషిక్‌నే గదా కావాలంటా ఉండావూ! నీ పెండ్లి వీనితోనే జరిపిస్త"

"ఓ.కే.. కలలు గంటూ కూచోండి! రా! రాజేష్! వెళ్దాం" అన్నాడు కౌషిక్.

"రాజేష్! ఈ మ్యారేజ్ స్ట్రగుల్‌లో విన్నర్ నువ్వో నేనో తేల్చుకుందాం. నిన్నంత తేలిగ్గా వదిలిపెట్టను. అనవసరంగా నా వైపు కన్నెత్తి చూడకు" అంది రూప లేడీ విలన్లా నవ్వుతూ.

"కన్నెత్తి చూస్తానో... కల్యాణం చేసుకుని తీసుకెళ్తానో... వెయిట్ అండ్ సీ" అని రాజేష్ వెళ్తుంటే..

"తమ్మీ.. పోకుండ్రి! ఉండుండ్రి" అన్నాడు భానోజీ.

రాజేష్ ఒక్కక్షణం ఆగి వెనక్కి తిరిగాడు.

భానోజీ లేచి నిలబడి... "రేయ్... శంకర్, హరీష్, లక్ష్మణ్ రాండ్రా" అని భానోజీ గట్టిగా అరిచేసరికి... భానోజీ బ్రదర్స్ వచ్చి లైన్లో నిలబడ్డారు.

"గేందిర చూస్తా నిలబడ్డరు.. బోన్లోబడ్డ ఎలకని ఎవరైనా వదుల్తరా... ఆళ్ళిద్దర్నీ గదిలోకి నెట్టి ఉతుకుండ్రి" అని భానోజీ విలన్ అవతారం ఎత్తేసరికి.. వెళ్ళబోతున్న కౌషిక్, రాజేష్‌ల మీదికి దూసుకొచ్చారు. అనుకోని సంఘటనకి వాళ్ళిద్దరూ అవాక్కైనా ఒక్కసెకనులో రియాక్టయ్యేసరికి ఫైటింగ్ స్టార్టయిందక్కడ.

కౌషిక్ ఇచ్చిన బాక్సింగ్ కిక్కులకి, రాజేష్ కొట్టిన కరాటే పంచ్‌లతో భానోజీ బ్రదర్స్ మోటుకొట్టుడు.. మోదలేక పోయింది.

కౌషిక్ కళ్ళెర్రజేసి... "చూడండి బ్రదర్స్! మళ్ళీ మీలో ఎవరైనా, నావైపుగానీ, మా ఇంటివైపుగానీ పెళ్ళీ, గిళ్ళీ అని వెంటబడితే... ఇప్పుడు చూశారుగా.. ఇంతకు రెట్టింపు రుచి చూడాల్సొస్తుంది. పలుకుబడి, రాజకీయం, బ్యాగ్రౌండు అనివస్తే... మీరు స్టేట్ హోం మినిస్టర్ దగ్గర కెళితే, మాకు సెంట్రల్ హోం మినిస్టర్ దగ్గరకెళ్ళే దమ్ముంది. జాగ్రత్త!" అని హెచ్చరించి, వేగంగా బయటికొచ్చి కారు ముందుకురికించాడు.

●●●

సమయం సాయంత్రం ఆరు గంటలు. గోవిందుని తీసుకుని బైటికెళ్ళిన రాజశేఖరం హడావిడిగా ఇంటికొచ్చాడు. వెనకాలే గోవిందు స్వీట్లు, పళ్ళు తెచ్చి లోపల పెట్టాడు.

"ఏంటి గోవిందూ! ఇవన్నీ ఎందుకు? ఎవరిచ్చారు?" అడిగింది లలిత.

"అయ్‌గారు, నేను ఎల్లి తెచ్చామండీ! ఎందుకో



నాకు చెప్పలేదమ్మా!" అన్నాడు.

"లలితా! త్వరగా తయారవ్వు.. చంద్రమౌళి వాళ్ళు వస్తున్నారు."

"మొన్నేగా వచ్చెళ్ళారు".

"ఇవాళ వాళ్ళబ్బాయి వంశీ కూడా వస్తున్నాడు".

"అంటే.. పెళ్ళిచూపులా...!" లలిత దీర్ఘం తీసే సరికి,

"అలాంటిదే"

"మాధురి ఇవాళేగా వచ్చింది. దానితో ఒక్క మాట కూడా చెప్పకుండా ఇలా ఏర్పాటుచేస్తే ఏమను కుంటుందో"

"మనం ఏమన్నా తప్పుచేస్తున్నామా? కానిపని చేస్తున్నామా? పెళ్ళి సంబంధం చూడటం తప్పా! అనవ సరపు అనుమానాలూ నువ్వూ" అన్నాడు చిరాగ్గా.

"మీ సంగతి తెలిసి కూడా మీతో వాదించటం నాదే తప్పు" అని లోపలికెళ్ళింది. నిద్రలేచిన మాధురి టీ తాగుతుంటే.. ఆమె దగ్గరకొచ్చి,

"మధూ! త్వరగా స్నానం చేసి చీర కట్టుకో" అంది లలిత.

"ఎందుకు?"

"చంద్రమౌళిగారని మీ డాడీతో కలిసి మిలి ట్రీలో పన్జేశారు. వాళ్ళు వస్తున్నారు".

"రానివ్వమ్మా! దానికెందుకింత హడావిడి?"

"సరిగ్గా! ఆ సమయంలోనే చంద్రమౌళి ఫ్యామిలీ వచ్చారు. వాళ్ళని హాల్లో కూచోమని చెప్పి, రాజశే ఖరం లోపలి కొచ్చాడు.

భార్యవైపు చూసి "లలితా! వాళ్ళొచ్చారు. త్వరగా రా!" అనెళ్ళాడు.

"మాధురీ! నువ్వూ తయారవ్వు" అని కిందికెళ్ళింది లలిత.

తల్లిదండ్రుల హడావిడి ఆంతర్యం అర్థమైనా... వేడుక ఎంతవరకూ వెళ్తుందో చూద్దామనుకుని.. తయారై, పదిహేన్నిమిషాల తర్వాత కిందికెళ్ళింది.

రాజశేఖరం కూతుర్ని అందరికీ పరిచయం చేశాడు.

తెల్లగా, ఎత్తుగా, మంచి పర్సనాలిటీ, చూడగానే ఆకట్టుకునే రూపం, బాలీవుడ్ హీరోలా ఉన్నాడు డాక్టర్ వంశీ.

"నైస్ టు మీట్ యూ" అన్నాడు మెల్లగా.

"నాక్కూడా" అంది.

అంతలో గంగ స్వీట్సు, ఫ్రూట్సు, కూల్‌డ్రింక్సు తెచ్చి అందరికీ ఇచ్చింది.

వంశీ, మాధురి మాట్లాడుకుంటుంటే.. చంద్ర మౌళి దంపతులకి ఇల్లు చూపించడానికి తీసు కెళ్ళారు రాజశేఖరం, లలిత.

మాధురి, వంశీతో మాట్లాడిన పది నిమిషాల్లో అతనో మొహమాటస్థుడిలా, చేస్తున్న వృత్తిపట్ల అంకితభావం కలిగినవాడిలా కన్పించింది.

వంశీకి గ్లోబల్ హాస్పిటల్‌నుండి ఫోన్ వచ్చింది.

"ఎక్స్‌క్యూజ్‌మి మాధురిగారూ! అర్జెంట్ సర్జరీకి అటెండవ్వాలి రమ్మంటున్నారు. మళ్ళీ కలుద్దాం.. సారీ" అన్నాడు.

"ఇట్స్ ఓకే".

ఇద్దరూ కలిసి లాన్‌లో కూచున్న తల్లిదండ్రుల దగ్గరకొచ్చారు. వంశీ విషయంచెప్పి 'బయల్దేరతాం అంకుల్' అన్నాడు.

వాళ్ళు వెళ్తుంటే... భాస్కర్రావు బైటనుంచి లోపలి కొస్తూ కన్పించాడు.

కారు దిగెళ్తున్న భాస్కర్రావుని పిలిచి, చంద్ర మౌళి ఫ్యామిలీని పరిచయం చేశాడు. రాజశేఖరం.

రాజశేఖరం నోటితో చెప్పకపోయినా, అసలు విషయం అర్థమై భాస్కర్రావుకి పుండుమీద కారం చల్లినట్లన్పించింది.

చంద్రమౌళి వాళ్ళు వెళ్ళిన పది నిమిషాలకి, తాతలిద్దరూ బైటనుంచి లోపలికొస్తుంటే..

"ఎక్కడికెళ్ళావు నాన్నా! ఇప్పుడు చంద్రమౌళి వాళ్ళొచ్చెళ్ళారు. చంద్రమౌళి కొడుకు వంశీని నువ్వు చూసుంటే బాగుండేది" అన్నాడు రాజశేఖరం.

"నువ్వు చూశాక, ఇంకా నేను చూసి చేసేది ఏముంది" అనుకుంటూ లోపలికెళ్తున్న తండ్రి వైపు అసహనంగా చూశాడు.

●●●

"శారదా! శారదా!...." లోపలికొస్తూనే భార్యని పిలిచేసరికి, గబగబా హాల్లోకొచ్చింది.

"ఏమిటండీ!"

"నీకో గుడ్‌న్యూస్ చెబుతా! ముందు నీకు, నాకు స్వీట్ పట్టుకురా!"

"ఏంటో చెప్పండి!"

"ముందు తీసుకురావోయ్"

## మనమీదేనర్రోయ్!

సరసి





శారద లోపలికెళ్ళింది.

టి.వి.లో భక్తిఛానల్ చూస్తున్న గోపాలకృష్ణయ్య కొడుకు సంతోషాన్ని చూసి తల తిప్పాడు.

"నాన్నా! మనం మల్లేష్‌యాదవ్ మీద వేసిన కేసు గెలిచాం" అన్నాడు.

"చాలా సంతోషం... దేవుడు మనకి అన్యాయం చెయ్యడురా!"

శారద తీసుకొచ్చిన స్వీటు.. ఆమె నోటికి అందించి, తనూ తింటూ విషయం చెప్పాడు.

"నాకు తెల్సండీ! న్యాయం మనపక్కన ఉన్నంత వరకూ మనకు ఎటువంటి అన్యాయమూ జరగదు. ఉండండి కాఫీ తెస్తాను" అంది.

"మాధురికి పెళ్ళిచూపులనుకుంటాను".

"ఔనా!?" ఆశ్చర్యంగా నోరెళ్ళబెట్టాడు గోపాలకృష్ణయ్య.

"వాళ్ళింటికెవరో వస్తున్నారని విన్నాను గానీ... పెళ్ళిచూపుల కోసమని తెలీదు" అంది శారద.

"ఛ! వీడిలా మారిపోతాడనుకోలేదు. కనీసం ఒక్కమాటైనా మనతో చెప్పకుండా, ఏకంగా మాధురికి పెళ్ళిచూపులే ఏర్పాటుచేశాడంటే, ఇన్నేళ్ళ స్నేహానికి సమాధి కట్టేశాడన్న మాట" అన్నాడు భాస్కర్రావు అసహనంగా.

"మనతో చెప్పని విషయం గురించి మనం ఎందుకండీ బాధపడటం".

"చిన్న పండగైనా, ఫంక్షనైనా వాళ్ళు లేకుండా మనం, మనం లేకుండా వాళ్ళూ జరుపుకోని అనుబంధాన్ని కాలదన్ని, వాడింట్లో జరుగుతున్న ముఖ్యమైన సందర్భానికి మనల్ని పిలవకుండా, పక్కనే ఉండి, పిలవ కూడని వాళ్ళకింద జమకట్టేయడానికి వాడి మనసు ఎలా అంగీకరించిందో? ఇంతేనా.. ఇన్నేళ్ళ అనుబంధం?"

"అంతేనని... మనమెందుకండీ అనుకోవటం! మాధురి ఆంతర్యం ఏమిటో తెలుసుకున్నాక ఓ నిర్ణయానికొద్దాం" అంది.

"వాడు ఏ ఉద్దేశంతో ఈ రెండు కుటుంబాల మధ్య అడ్డుగోడ కట్టాడో మనకనవసరం. కౌషిక్‌కి పెళ్ళి చెయ్యడం మనకి చాతకాదా?" అన్నాడు ఆవేశంగా.

"కౌషిక్‌కి, మాధురిని అనుకున్నాక మళ్ళీ వేరే ఆలోచన ఎందుకురా! వాడు తొందరపడ్డాడని మనం కూడా అదే తప్పు చేస్తామా? అసలు పిల్లలిద్దరూ ఇష్టపడితే మనల్ని కాదని ఎన్ని సంబంధాలు తెచ్చినా, పెళ్ళి జరిపించటం రాజశేఖరం తరం అవుతుందా?" అన్నాడు గోపాలకృష్ణయ్య.

సరిగ్గా ఆ సమయంలో ఇంటికొచ్చాడు కౌషిక్. బ్యాగ్ సోఫాలో పడేసి అలసటగా కూచున్నాడు.

కొడుకుని చూసి భాస్కర్రావు ఏదో అడగబోతుంటే..

"సారీ! డాడీ! ఆఫీసు పని మీద అర్జంటుగా ఢిల్లీ వెళ్ళాల్సొచ్చింది. నా ఫోను ఆఫీసులో మర్చిపోయ్యాను. అందుకే వెంటనే ఇన్ఫార్మ్ చెయ్యలేకపోయాను."

భాస్కర్రావు కొడుకు పక్కన కూచుని, భుజం మీద చెయ్యేసి, "ఒక్కోసారి అనుకోనివి జరుగుతుంటాయి. ఈ గొడవల్ని మనసులో పెట్టుకుని ఎక్కడికెళ్ళావోనని కంగారు పడ్డాం. ముందు రిలాక్సవ్వు" అన్నాడు.

కౌషిక్ గొంతు విని లోపల్నుంచి వేగంగా వచ్చింది శారద.

"ఏవిట్రా! ఇంకెప్పుడూ ఇలా చెప్పాపెట్టకుండా వెళ్ళకు" అంది కన్నీళ్ళొత్తుకుంటూ.

"ఏదో జరిగిపోయిందిలే అమ్మా! దీనికే కళ్ళనీళ్ళు పెట్టుకోవాలా?"

## ప్రేమలో పడిన సోనాక్షి



ఇప్పుడు కొత్తగా ప్రేమలో పడడం ఏమిటి? అర్జున్‌కపూర్‌తో వ్యవహారం నడిపి అతగాడితో బ్రేకప్ కూడా చెప్పేసిందిగా అనుకుంటున్నారు కదూ! ఇది కొత్త ప్రేమ కథ. సోనాక్షి ప్రస్తుతం బంటి సజ్దేకి అనే వ్యక్తితో ప్రేమాయణం నడుపుతోందనీ, ఇద్దరూ కలిసి పార్టీలకూ పబ్‌లకూ కూడా తిరుగుతున్నారనీ బాలీవుడ్ జనాలు అంటున్నారు. కాకపోతే అందరిలాగే సోనాక్షి కూడా అతగాడితో లవ్ ఎఫైర్ ఏదీ లేదంటూ కొట్టిపారేస్తోంది. నిన్న మొన్నటి దాకా అమ్మ ఆంక్షలలో చిక్కుకున్న సోనాక్షి ఇప్పుడు ఆ ఆంక్షలను ఛేదించుకుని మిగతా హీరోయిన్ల బాట పట్టిందని బాలీవుడ్ జనాలు అంటున్నారు.

"నీకేం, ఎన్నైనా చెబుతావు. ఎంత హడలిపోయామో తెలుసా!"

"తలనొప్పిగా ఉంది. మంచి కాఫీ ఇవ్వు" అన్నాడు.

కాఫీ తాగి, కౌషిక్ తనే గదికెళ్ళి రిఫ్రెషయి వచ్చాడు.

తాత, తండ్రితో కలిసి భోంచేస్తుంటే, "హలో! అంకుల్" అంటూ మాధురి వచ్చి భాస్కర్రావు పక్కన కూచుంది.

"ఏంటి మ్యాడీ? ఎప్పుడొచ్చావు? ముస్సోరికి ముచ్చెమటలు పట్టించి వచ్చావా?" అన్నాడు కౌషిక్.

"అవన్నీ తర్వాత. తమరేంటి ఇంట్లో చెప్పకుండా ఢిల్లీకి పారిపోయావట"

"మేటరు నీదాకా వచ్చిందీ?" అన్నాడామెను చూస్తూ.

మాధురి చూపు మరల్చుకుని టాపిక్ మారుస్తూ, "అంకుల్... పుల్కాలే తింటున్నారా?" అంది.

"నువ్వు నా డైట్‌ని టైట్ చేసెళ్ళావుగా. పుల్కాలు కాక పలావులా పెడ్తుంది మీ ఆంటీ" అని చెయ్యి కడిగి లేచెళ్ళాడు భాస్కర్రావు.

"మాధురీ! నువ్వూ తిను... నీకిష్టమైన గోబీ మసాలా".

"వద్దాంటీ! నాకిష్టమని తెల్సుకదా! నేను తినాలి అనుకుంటే ముందే పిలిచేవారు. లేకపోతే అక్కడికే పంపేవారు. వద్దు. ఈ ఇళ్ళకి ఏదో అయింది".

శారద ఏదో అనబోతుంటే.. కౌషిక్ వద్దన్నట్టు తల్లివైపు చూశాడు.

మాధురి గోపాలకృష్ణయ్య వైపు చూసి, "ఏంటి? నువ్వూ సీరియస్సా! లేక మనవడు పక్కనున్నాడని ఫోజా!" అంది.

"మా మొహాలకి ఆ రెండే తక్కువ".

"అబ్బో! కోపం తారాస్థాయిలో ఉందే... తాతగారికి" అంది నవ్వుతూ.

"ఏంటి మాధురీ! అంత లావయ్యావు?" అన్నాడు కౌషిక్.

"ది....గు....లు" అందొకలా.

"ఎవరి మీద?"

"మీ అందరి మీద"

గోపాలకృష్ణయ్య మాధురి, కౌషిక్‌ల మొహాల్ని పరికించి చూశాడు.

మాధురి ఫోన్ రింగైంది.

"హలో! హలో!" అంది. సరిగ్గా విన్పించట్లేదు. ఫోన్ కట్టయి మళ్ళీ వెంటనే రింగవుతుంటే.

"ఇక్కడ సిగ్నల్ రావటం లేదు. బయటికెళతాను. మళ్ళీ కలుస్తా!" అంటూ ఫోన్ చెవి పక్కనుంచుకుని వెళ్ళిపోయింది.

•••

మర్నాడుదయం భాస్కర్రావుకి కాఫీ ఇచ్చి, తనూ తాగుతూ కూచుంది శారద. "కౌషిక్ ఇంకా లేవలేదా?" అడిగాడు.

"లేదు"

భాస్కర్రావు పేపరు చూస్తున్నాడు. గోవిందు ఓ కుర్రాణ్ణి వెంటబెట్టుకొచ్చి, "అయ్యగారూ! మీ కోసం వచ్చాడండీ!" అన్నాడు.

తలెత్తి చూసి... "ఏంటన్నట్టు చూశాడు".

ఆ కుర్రాడు ఓ కవరిచ్చి, వచ్చిన పని చెప్పెళ్ళాడు.

ఆ మాటలు విన్న శారద.. "ఎందుకండీ.. మీరూ తొందర పడుతున్నారు?" ఇదేమైనా పోటీనా? వాళ్ళు చేసిన తప్పే మనమూ చేస్తే... వాళ్ళకీ మనకీ తేడా ఏముంటుంది?" అంది.

"ఇంకా ఆలస్యం చేస్తే చాతకాని వాళ్ళకింద జమకడతారు" అన్నాడు భాస్కర్రావు. అంతలో అక్కడికి కౌషిక్ వచ్చి కూచున్నాడు.

"అమ్మా! కాఫీ ఇవ్వు" అన్నాడు.

"కౌషిక్, ఈ ఫోటోలు చూడు" అని కొడుక్కి ఇచ్చాడు భాస్కర్రావు.

"ఎవరివి డాడీ! అమ్మాయి బాగుంది?"

"పురుషోత్తం గారని, నాకు బాగా తెలిసిన వ్యక్తి. ఆయన కూతురీ అమ్మాయి. సాఫ్ట్‌వేర్ ఇంజనీర్. నీకు నచ్చితే చెప్పు".

"నాకు నచ్చడమెందుకు?"

"పురుషోత్తం గ్రానైట్ బిజినెస్ చేస్తుంటాడు. వేరే వ్యాపారాలున్నాయి. చాలా ఆస్తి ఉంది. ఒక్కతే కూతురు. మనకి తగిన సంబంధం" అన్నాడు.

శారద కాఫీ తెచ్చి కొడుక్కిచ్చింది.

కౌషిక్... తల పట్టుకుని తల్లివైపు చూశాడు.

**(ఇంకా వుంది)**



## టమాటాలతో ముడతలకు చెక్

వయస్సు రీత్యా కాకుండా ఎండ, వేడి కారణంగా ముఖం మీద ఏర్పడే ముడతలకు టమాటాతో చెక్ పెట్టవచ్చు అంటున్నారు జర్మన్ పరిశోధకులు. టమాటాలోని లైకోపెన్ అనే పదార్థం సూర్య కిరణాల ప్రభావం నుంచి చర్మాన్ని కాపాడుతుందన్న విషయం వీరి పరిశోధనలో వెల్లడైంది. 65 మంది మీద సుమారు పన్నెండు వారాల పాటు పరిశోధనలు నిర్వహించారు. వీరిని రెండు గ్రూపులుగా విభజించి ఒక గ్రూపు వారికి టమాటాలు కలిగిన ఆహారాన్నీ, మరొక గ్రూపు వారికి టమాటాలు లేకుండా ఆహారాన్ని ఇచ్చారు. ఈ రెండు గ్రూపులను పన్నెండు వారాల పాటు ఉదయం, సాయంత్రం సూర్యకిరణాలు తాకే విధంగా గడపనిచ్చారు. అనంతరం వీరి చర్మాన్ని పరిశీలించారు. టమాటాలను ఆహారంలో తీసుకోని వారి చర్మం ముడతలు పడగా, టమాటాలను ఆహారంలో తీసుకున్న వారిలో ముడతలు చాలా తక్కువగా కనిపించాయి.

ఈ పరిణామం కేవలం టమాటాల వలనే కలిగిందా? లేక ఇతర కారణాలేమైనా ఉన్నాయా? అన్న విషయం మీద వీరు పరిశోధనలు నిర్వహిస్తున్నారు. టమాటాలను ఆహారంలో ఎక్కువగా చేర్చుకోవడం వలన చర్మ కేన్సర్ నుంచి కొంత వరకూ తప్పించుకోవచ్చని వీరు చెబుతున్నారు.



## గుడ్డుతో పక్షవాతానికి చెక్

ఆహారంలో గుడ్డు చేర్చుకోవడం ద్వారా పక్షవాతం వచ్చే అవకాశాలను పన్నెండు శాతం తగ్గించుకోవచ్చు అంటున్నారు అమెరికా పరిశోధకులు. ఆహారంలో గుడ్డును చేర్చుకోవడం ద్వారా గుండె జబ్బుల నుంచి తప్పించుకోవచ్చు అన్న విషయం గతంలో నిర్వహించిన పలు పరిశోధనల్లో స్పష్టమైంది. ఈ పరిశోధనా ఫలితాలు తప్పు అని చెప్పలేమనీ, గుడ్డులోని పోషకాలు, విటమిన్-ఇ గుండెను ఆరోగ్యంగా ఉంచడానికి కొంత మేరకు ఉపయోగపడతాయే తప్ప గుండెజబ్బులు, హార్ట్ అటాక్ వంటి వాటిని పూర్తిగా అరికట్టలేవని వీరు స్పష్టం చేస్తున్నారు.

సుమారు 33 సంవత్సరాల పాటు రెండు లక్షల 75వేల మంది మీద వీరు సుదీర్ఘ కాలం అధ్యయనం నిర్వహించారు. ప్రతిరోజూ గుడ్డు తినడం వలన పక్షవాతం వచ్చే అవకాశాలు 12 శాతం వరకు మాత్రమే తగ్గుతాయని వీరు స్పష్టం చేస్తున్నారు.






## నిద్రలేమితో ఊబకాయం?

నిద్ర లేమితో ఊబకాయం వస్తుందన్న విషయం చాలామందికి తెలుసు. ఊబకాయానికి నిద్ర ఒక్కటే కారణం కాదు, మరొక కారణం ఉంటుంది అంటున్నారు పరిశోధకులు.

నిద్ర తక్కువపోయే వారు రోజు మొత్తం మీద తీసుకోవలసిన క్యాలరీల కన్నా 365 క్యాలరీలు ఎక్కువ తీసుకుంటారనీ, వీరిలో క్యాలరీల ఖర్చు కూడా తక్కువగా ఉంటుందని వీరు చెబుతున్నారు. క్యాలరీలు ఖర్చు కాకపోవడం, కావలసిన దానికన్నా ఎక్కువ ఆహారం తీసుకోవడం వలనే ఊబకాయ సమస్య వస్తుందని వీరు స్పష్టం చేస్తున్నారు.

లండన్‌లోని కింగ్ జార్జ్ యూనివర్సిటీ పరిశోధకులు 172 మంది మీద పరిశోధనలు నిర్వహించారు. సరిపడా నిద్రపోయిన వారు కావలసినంత ఆహారం తీసుకోవడమే కాకుండా వారిలో క్యాలరీలు ఖర్చు కావడం గమనించారు.

అదే నిద్రలేమితో బాధపడేవారు రోజు మొత్తంలో ఆహారం ఎక్కువ తీసుకోవడమే కాకుండా వీరిలో క్యాలరీల ఖర్చు బాగా తక్కువగా ఉండడం గమనించారు.

## భయంతో గుండెజబ్బులు

దయ్యం కన్నా భయం ప్రమాదకరమైంది అంటారు. ఇది నూటికి నూరుపాళ్ళు నిజం అంటున్నారు నార్వే పరిశోధకులు. ఆరోగ్యం గురించి ఎక్కువగా ఆలోచించే వారికీ, అనవసరంగా భయపడే వారికీ గుండె సంబంధిత జబ్బులు త్వరగా వచ్చే అవకాశం ఉందన్న విషయం వీరి అధ్యయనంలో వెల్లడైంది. సుమారు ఏడు వేల మంది ఆహారపు అలవాట్లు, వారి ఆరోగ్యస్థితి, ఆరోగ్యం పట్ల వారి ఆలోచనా విధానాన్ని నమోదు చేసుకున్నారు. వీరిలో ఎక్కువగా ఆరోగ్యం గురించి ఆందోళనపడే వారి సంఖ్యే ఎక్కువ. ఏడు సంవత్సరాల అనంతరం వీరి ఆరోగ్య పరిస్థితిని పరిశీలించారు. ఆరోగ్యం గురించి అనవసరంగా ఆందోళనపడేవారిలో 70 శాతం మంది గుండెజబ్బులకు గురైనట్లు గుర్తించారు. అనవసర ఆందోళన తీవ్రమైన ఒత్తిడికి దారి తీస్తుందనీ, దీని కారణంగా రక్తపోటు పెరిగే అవకాశం ఉందని వారు అంటున్నారు.



## సూర్యరశ్మితో ఒత్తిడి మాయం

బాగా ఒత్తిడిగా అనిపించినప్పుడు సూర్యుడు ఉదయించే ముందు లేదా సూర్యాస్తమయాలలో కొద్దిసేపు సూర్యుడికి ఎదురుగా నిలుచుంటే ఒత్తిడి చాలావరకూ తగ్గుతుందంటున్నారు పరిశోధకులు. సుమారు 40 మంది మీద వీరు పరిశోధనలు నిర్వహించారు. వీరందరూ తీవ్రమైన ఒత్తిడితో బాధపడుతున్నవారే! వీరిని రెండు గ్రూపులుగా విభజించి ఒక గ్రూపు వారికి చికిత్సతో పాటు ఉదయం సాయంత్రం రెండుసార్లు సూర్యుని ఎదురుగా నిలుచోమన్నారు. రెండో గ్రూపు వారికి కేవలం చికిత్స మాత్రమే అందించారు. కొన్ని రోజుల అనంతరం వీరిలోని ఒత్తిడిని పరిశీలించారు. రెండో గ్రూపువారి కన్నా మొదటి గ్రూపు వారిలో ఒత్తిడి శాతం తగ్గిన విషయాన్ని గుర్తించారు. మందులు వాడుతూ సూర్య కిరణాల దగ్గర కొంతసేపు గడిపితే ఒత్తిడి చాలావరకూ అదుపులో ఉంటుందన్న విషయం వీరి పరిశోధనలో వెల్లడైంది.

-అవినాష్



## రామాయణం

113

# భరద్వాజమహర్షి విందు: భరతుని స్వాగతం

**విభీషణ, సుగ్రీవ, అంగదాదులుసహా సీతారామలక్ష్మణులు పుష్పకాన్ని అధిరోహించారు. ఎందరు ఎక్కినా ఇంకా ఇంకొకరికి తావు కల్పించే పుష్పకం విశాలంగా ఉండి, వానరవీరులతో కలకలంగా ఉంది. అక్కణ్ణుంచి బయల్దేరేందుకు సిద్ధమయ్యాడు రాముడు. అతని మనసును గ్రహించి, పుష్పకం పైకి లేచింది. ఆకాశానికి ఎగిసి ప్రయాణించసాగింది.**

అతివేగంగానూ కాక, అతి మెల్లగానూ కాక హాయిగా నడుస్తున్న విమానం నుంచి కిందికి చూస్తూ, ఆనందించసాగారంతా. తనకు తెలిసీ, సీతకు తెలియని స్థలాలను ఆమెకు చూపించాలనుకున్నాడు రాముడు. సీతను దగ్గరగా తీసుకున్నాడు. చూపిస్తూ చెప్పసాగాడిలా.

“సీతా! ఇదే! ఈ స్థలమే రణరంగం. ఇక్కడే కుంభకర్ణుణ్ణీ, రావణుణ్ణీ నేను సంహరించాను. అదిగో! అక్కడే పాపం రావణుని పట్టమహిషి మండోదరి సవతులతో గోలుగోలున ఏడ్చింది. అటు చూడు! సాగరమధ్యంలో కనిపిస్తోందే వారధి, లంక చేరేందుకు దానిని వానరసేన నిర్మించారు. అదే రేపు ‘సేతువు’ పేరిట ప్రఖ్యాతి కానున్నది. అదిగో అక్కడే… ఆ స్థలంలోనే సాగరుడు నాకు ప్రత్యక్షమయ్యాడు.”

కళ్ళు పెద్దవి చేసి, విస్తుపోయి చూడసాగింది సీత.

“అదిగో! మనోజ్ఞవనాలతో శోభిల్లుతున్న ఆ పురమే కిష్కింధ. అదే సుగ్రీవుని రాజధాని. ఆ నగరద్వారం దగ్గరే మహావిక్రమశాలి వాలిని నేను సంహరించాను.”

“మీ ప్రతాపాలకు అద్భుతగులుతున్నానని అనుకోకపోతే నాదో చిన్న మనవి.” అన్నది సీత.

“చెప్పు”

“మీరు మీ వానరమిత్రబృందంతో బయల్దేరినట్టుగానే నేనూ సుగ్రీవ అంగదాదుల పత్నులతో అయోధ్యకు రావాలనుకుంటున్నాను. అందుకు అనుమతించండి.”

“నీ కోరిక కాదంటానా?” అన్నాడు రాముడు. సుగ్రీవుణ్ణి చేర పిలిచి, అతనికి సీత కోరిక తెలియజేశాడు. పుష్పకాన్ని కిష్కింధలో నిలిపాడు.

సుగ్రీవుని ఆదేశానుసారం తార, రుమాదులంతా అందంగా అలంకరించుకుని వచ్చి, పుష్పకాన్ని అధిరోహించారు. సీత చుట్టూ కూర్చున్నారంతా. పుష్పకం పైకి లేచి అక్కణ్ణుంచి బయల్దేరింది. ఆయా స్థలాలు చూపిస్తూ సీతకు మళ్ళీ రాముడు ఇలా చెప్పసాగాడు.

“దేవీ! ఇదే ఋష్యమూకపర్వతం. ఇక్కడే నేను సుగ్రీవునితో స్నేహం చేశాను. అదిగో అదే, శబరి ఆశ్రమం. ఇదిగో ఇదే, జటాయువు నిల్చున్న మర్రిచెట్టు.”

ఉత్సాహంగా ఉత్కంఠగా తిలకిస్తున్న సీతకు ఖర దూషణాదులను సంహరించిన రణరంగం, పంచవటి ఆశ్రమం, గోదావరీతీరం, చిత్రకూటం… అన్నీ చూపిస్తూ భరద్వాజ ఆశ్రమం కనిపించడంతో పుష్పకాన్ని కిందికి దింపాడు రాముడు. ఆ మహర్షిని దర్శించేందుకు కాలినడకన బయల్దేరాడు.

ఆ రోజు పంచమి. మహర్షిని సమీపించాడు రాముడు. చేతులు జోడించి నమస్కరించాడతనికి. రాముణ్ణి ఆశీర్వదిస్తూ దివ్యదృష్టితో జరిగిందంతా తెలుసుకున్నాడు మహర్షి. దీక్ష ముగించి వచ్చాడు రాముడు. సీత, లక్ష్మణుడుసహా సంతోషంగా వచ్చాడు. అతనికి సాదర ఆహ్వానం పలకాలనుకున్నాడు మహర్షి.

“మీరూ, మీ ఆశ్రమవాసులూ క్షేమమే కదా మహర్షి?” అడిగాడు రాముడు.

“క్షేమమే”

“మా నగరం అయోధ్య ఎలా ఉన్నది? భరతుడు రాజ్యాన్ని ఎలా పాలిస్తున్నాడు? మా తల్లులంతా క్షేమమే కదా?”

“అందరూ క్షేమమే రామా! నీ మీది ప్రేమతో భరతుడు జడలూ, నారలూ ధరించాడు. నీ పాదుకలు ముందుంచుకుని రాజ్యపాలన చేస్తున్నాడు. నీ రాకకోసం వేయికళ్ళతో ఎదురు చూస్తున్నాడు.”

ఆనందించాడు రాముడు.

“తండ్రిమాటకోసం ఎంతటి త్యాగానికి పూనుకున్నావయ్యా! గొప్పవాడివయ్యా నువ్వు. రాకుమారుడివైనా, రాజ్యాన్ని వదులుకుని, అరణ్యాల్లో కందమూలఫలాలతో కడుపు నింపుకున్నావంటే…తలచుకుంటేనే బాధగా ఉంది. రామా! గతంలో నువ్వు చేసిన గొప్పకార్యాలూ, ఇప్పుడు నువ్వు చేసిన సేతు నిర్మాణం, రావణసంహారం, సీత అగ్నిప్రవేశం, దేవతల వరాలూ అన్నీ నిన్ను మరింత గొప్పవాణ్ణి చేస్తాయి. సత్యాత్ముడివయ్యా నువ్వు. నీకేం వరం కావాలో కోరుకో! ఇస్తాను.” అన్నాడు మహర్షి.

మళ్ళీ నమస్కరించి, మరింత అణకువగా నిలిచాడు రాముడు.

“రామా! జయశీలుడివి! పరిపూర్ణాత్ముడివి! నీలాంటివాడు విభీషణ, సుగ్రీవ, అంగదాదుల సహా ఇక్కడకి రావడం మహదానందంగా ఉంది. మీరంతా ఈ రోజు నా ఆతిథ్యం స్వీకరించాలి.” అభ్యర్థించాడు భరద్వాజుడు. కాదనలేదు రాముడు. శిరసువంచి మరీ అందుకు అంగీకరించాడు. సంతోషించాడు మహర్షి.

“వరం కోరుకుని కూడా నా ముచ్చట తీర్చవయ్యా.”

“మీ అనుగ్రహంతో ఇక్కడ నుంచి అయోధ్య వరకూ యోజనదూరంలో గల వృక్షాలన్నీ కల్పవృక్షాలై ఎప్పుడూ పుష్పఫలాలతో వర్ధిల్లేటట్టు చూడండి. నా మిత్రులు వానరులకు తృప్తి కలిగించండి” వేడుకున్నాడు రాముడు.

“శుభం” అన్నాడు మహర్షి. అంతే! ఆ క్షణమే వృక్షాలన్నీ పూలూ, కాయలూ, పండ్లూ కాసి విలసిల్లాయి. వానరులకు విందు చేశాయి.

కొద్దిసేపు గడిచింది. తర్వాత…

ఆశ్రమంలో ఓ మూలగా ఒంటరిగా కూర్చున్నాడు రాముడు. ఆలోచనలో పడ్డాడు. దీర్ఘంగా ఆలోచించి, దూరంగా నిల్చుని తననే గమనిస్తున్న హనుమను కేకేశాడు. దగ్గరకు రమ్మన్నాడు. వచ్చాడతను.

“హనుమా! నువ్వు వెంటనే అయోధ్యకు బయల్దేరాలి.” చెప్పాడు రాముడు.

“సరేస్వామి”

“దారిలో భాగీరథీతీరాన ఉన్న గుహుణ్ణి ముందుగా నువ్వు కలవాలి. అతను నా ప్రాణమిత్రుడు. అతని క్షేమసమాచారాలు తెలుసుకోవాలి. తర్వాత నేనిలా అయోధ్యకు బయల్దేరి వస్తున్నట్టుగా అతనికి చెప్పాలి.”

“అలాగేస్వామి”

“ఇప్పుడు అసలు సంగతి చెబుతున్నాను, జాగ్రత్తగా విను.”

వినేందుకు చెవొగ్గాడు హనుమ.

“అయోధ్యలో నా ప్రియసోదరుడు భరతుడు ఉన్నాడు. అతన్ని దర్శించు. దర్శించి, సీత, లక్ష్మణులసహా నేను మిత్రులందరితోనూ పుష్పకంలో రేపు ఉదయానికి అక్కడకి చేరుకుంటున్నట్టుగా చెప్పు. చెప్పి, ఒకటొకటిగా జరిగిన సంఘటనలన్నీ అతనికి వివరించు. వాటిని వివరిస్తూ భరతునిలో కలిగే భావాలను ప్రతిక్షణం గమనించు.” చెప్పడం

**భరద్వాజ ఆశ్రమం దాపున పుష్పకాన్ని నిలిపి కాలినడకన ఆశ్రమానికి చేరుకున్నాడు రాముడు. భరద్వాజ మహర్షి ఆతిథ్యం స్వీకరించి విశ్రమించాడు. హనుమను చేరబిలిచి వెంటనే అయోధ్యకు బయల్దేరమన్నాడు. భరతుణ్ణి సందర్శించి జరిగిన సంఘటనలన్నీ వివరించి అతడి ముఖకవళికలను గమనించమన్నాడు! రాముడు ఎందుకు హనుమతో అలా చెప్పాడు? అతడి ఆంతర్యం ఏమిటి?**

ఆపాడు రాముడు.

హనుమ ఉత్కంఠగా చూడసాగాడు. రెండు క్షణాలు మౌనం వహించాడు రాముడు. తర్వాత అన్నాడిలా.

"ఇంకేం లేదు హనుమా! గత కొన్నేళ్ళుగా రాజ్యాన్ని పాలిస్తున్న భరతునికి, నా రాకతో తాను రాజ్యాన్ని వదులుకోవాల్సి వస్తుందనే బాధ ఉందని పించిందనుకో! అది అతని హావభావాల్లో కని పించడం తప్పు కాకపోయినా ప్రమాదసంకేతం. అప్పుడు ఆ రాజ్యాన్ని మనం వదులుకోవడమే శ్రేయస్కరం. తానే రాజు, రాజ్యం తనదనే భర తుని భావాలు నువ్వు గమనించిన వెంటనే నాకు ఆ సంగతి తెలియజెయ్యాలి. రేపు నేను అయోధ్యకు బయల్దేరకముందే నాకు ఆ సంగతి నువ్వు చెప్పగలిగితే ధన్యుణ్ణి." అన్నాడు రాముడు.

అయోమయంగా చూశాడు హనుమ.

"తమ్ముళ్ళ సరదాలనూ, సంతోషాలనూ అన్నలే తీర్చాలి. పెద్దవాడిగా అది నా బాధ్యత." అన్నాడు రాముడు.

"బయల్దేరు" చెప్పాడు. రామాజ్ఞానుసారం వెంటనే ఆకాశానికి ఎగిసి, అక్కణ్ణుంచి బయల్దే రాడు హనుమ.

కాసేపు ప్రయాణించి శృంగిబేరిపురంలో దిగాడు. గుహుణ్ణి సమీపించాడు. అతనికి రాముడి గురించి సవివరంగా తెలియజేశాడు. ఆ మాటలు పూర్తికాగానే అక్కణ్ణుంచి బయల్దేరి, చూడముచ్చ టైన కోసలరాజ్యాన్ని మెచ్చుకుంటూ నందిగ్రామం చేరాడు. భరతుని ఆశ్రమంలోనికి ప్రవేశించాడు. అక్కడ నారలూ, జటలూ ధరించి, బ్రహ్మవర్చ స్సుతో వెలిగిపోతున్న భరతుణ్ణి చూశాడు. భర తుడు అప్పుడు మంత్రులతోనూ, సేనాపతులతోనూ మంతనాలు జరుపుతున్నాడు. వేళకాని వేళ వెళ్ళి పలకరించరాదనుకున్నాడు. ఓ మూలగా నిల్చు న్నాడు హనుమ.

కాసేపటికి భరతుడు ఒంటరిగా కనిపించాడు. అప్పుడు కలిశాడతన్ని. చేతులు జోడించి నమస్క రించి చెప్పాడిలా.

"రఘుభూషణా! ఏ రామునికోసం నువ్వింతగా పరితపిస్తున్నావో ఆ రాముడే నీ క్షేమం తెలుసు కుని రమ్మని నన్నిక్కడకు దూతగా పంపాడయ్యా. నా పేరు హనుమ."

సంతోషంగా చూశాడు భరతుడు.

"రాక్షసరాజు రావణుణ్ణి సంహరించి సీత, లక్ష్మణుడు, మిత్రులసహా నీ రాముడు ఇక్కడికి వస్తున్నాడయ్యా."

"నిజమా" అడిగాడు భరతుడు. అతనికి అంతా ఊహాతీతంగా ఉంది. ఆనందపారవశ్యంతో మూర్ఛ పోయాడు. కాసేపటికి తేరుకున్నాడు. లేచి కూర్చు న్నాడు. ఎదురుగా ఉన్న హనుమను చూసి, అపూర్వా నందంతో గట్టిగా కౌగలించుకున్నాడతన్ని. ఆనందా శ్రువులు రాల్చాడు.

"హనుమా! అమృతం కంటే తీయనైన మాట చెప్పావు. ధన్యుణ్ణి. నువ్వు నిజంగా వానరుడివా? లేక దివి నుంచి దిగి వచ్చిన దేవతవా? ఎవరు నువ్వు? నువ్వు ఎవరైతే మాత్రం శుభవార్త చెప్పి, నన్ను ఆనందింపచేసినందుగ్గాను నీకు నూరు గ్రామాలూ, లక్షగోవులూ ఇస్తున్నాను, తీసుకో."



అన్నాడు భరతుడు.

నవ్వుతూ చూశాడు హనుమ.

"హనుమా! నువ్వు చెప్పిన శుభవార్త వినగానే నాకు ఏమనిపించిందో తెలుసా? మనిషి అనేవాడు బతికి ఉంటే నూరేళ్ళకైనా సుఖపడతాడన్న సామెత నిజమని తేలింది. రావయ్యా రా! ఈ దర్భాసనం మీద కూర్చో! కూర్చుని మా రామయ్యగురించి ఇంకా ఇంకా సంగతులు చెప్పు." వేడుకున్నాడు భరతుడు.

సంతోషించాడు హనుమ. భరతుడు కోరి నట్టుగానే కూర్చుని, రాముని గురించి అన్నీ వివ రంగా తెలియజేశాడు.

"ప్రస్తుతం నీ రాముడు భరద్వాజాశ్రమంలో ఉన్నాడు. రేపు సూర్యోదయం తర్వాత ఇక్కడకు రానున్నాడు." అన్నాడు.

అవునా? అని వేగిరపడ్డాడు భరతుడు. రాముడు వస్తున్నాడు. తన కోరిక నెరవేరుతోందని ఆనందిం చాడు. శత్రుఘ్నుడు, మంత్రులతో చర్చించాడు. రాముని రాకను నగరమంతటా చాటింపు చేయిం చాడు. అన్నిచోట్లా పతాకలు ఎత్తించాడు. తోర ణాలు కట్టించాడు. అడుగడుగునా పూజలు నిర్వ హించాడు. సూర్యోదయానికి ముందే నగరం నుండి బంధువులూ, పెద్దలూ, మంత్రులూ, సేనా నాయకులూ, కవులూ, గాయకులూ నాట్యకారు లంతా ఊరేగింపుగా తరలి రావాలన్నాడు.

వందలకొలదీ పనివారిని రప్పించాడు శత్రు ఘ్నుడు. నందిగ్రామం నుండి నగరం వరకూ మిట్టపల్లాలు లేక రాదారిని చదును చేయించాడు. నీరు చల్లి, బాటపై లాజలూ, పుష్పాలూ జల్లిం చాడు.

పండుగలా ఉంది వాతావరణం. అందంగా ఇళ్ళను అలంకరించుకుని, ఆనందంగా ఉన్నారు పౌరులు. రాముని రాకకోసం ఎదురుచూడసాగారు.

భరతుని ఆదేశానుసారం సూర్యోదయానికి ముందే మంత్రులూ, బంధువులూ, ఆప్తులంతా అలంకరించుకుని మరీ ఆశ్రమానికి బయల్దేరారు. దశరథపత్నులు రథాల్లో ప్రయాణించారు. ఆయు ధాలు ధరించిన సైనికులు ఏనుగులూ, గుర్రా లపై వరుసలు కట్టి ముందు నడుస్తోంటే, వారిని పౌరులు వెన్నంటారు. శంఖ భేరీధ్వనులతో నంది గ్రామాన్ని మేలుకొలిపారు.

నిష్ఠవల్ల నీరసించినా రాముడు వస్తున్నాడన్న మాటతో కోలుకున్నాడు భరతుడు. ఉత్తేజంగా, ఉత్సాహంగా ఉన్నాడు. జటలూ, నారలూ, జింక చర్మం సవరించుకున్నాడు. రాముని పాదుకలు శిరసుపై ధరించాడు. పైన శ్వేతఛత్రం, ఇరు వైపులా వింజామరలు వీస్తుండగా అన్నకు అభి ముఖంగా దక్షిణదిక్కుగా బయల్దేరాడు భరతుడు. అయోధ్యపౌరులతోనూ, ఆప్తులతోనూ, హనుమ తోనూ ఊరేగింపుగా నడిచాడు.

ఆకాశంకేసి చూస్తూ నడవసాగాడు హనుమ. పుష్పకం కనిపించిందతనికి. ఆనందించాడు. భర తునితో అన్నాడిలా.

"రాజా! అదిగో అటు చూడు! పుష్పకంలో వీరాసనంలో కూర్చున్న మహాబాహుడే మన రాముడు."

చూపించాడు హనుమ. భరతునిసహా పుష్ప కాన్ని చూశారంతా. అదిగో అంటే అదిగో అను కున్నారు. మెడలెత్తి చూశారు. సీతతో శోభిస్తున్న రాముణ్ణి చూసి ఆనందించారు. భరతుడు పరుగు పరుగున రావడాన్ని చూసి, పుష్పకాన్ని నిలుపు చేశాడు రాముడు. నేలకు దాన్ని దించాడు. పుష్పకం నేలకు దిగడం ఆలస్యం, చేతులురెండూ జోడించి నమస్కరిస్తూ పుష్పకంలోనికి ప్రవేశించాడు భరతుడు. రామునికి సాష్టాంగప్రణామం చేశాడు.

**(ముగింపు వచ్చేవారమే)**

**-అరణి**




నవంబర్ 16 నుంచి
నవంబర్ 22 వరకు

శ్రీ బిజుమళ్ళ బిందుమాధవశర్మ



## మేషం (మార్చి 21 - ఏప్రిల్ 20 మధ్య పుట్టినవారు)

బదిలీలు, రియల్ ఎస్టేట్ వ్యవహారాలు, ఆర్థిక వ్యవహారాలు, వేడుకలు, వృత్తి, వ్యాపార విషయాలపై ఈ వారం శ్రద్ధ పెడతారు. బుధవారం స్టేషనరీ, రవాణా, బోధన, పర్యాటక రంగాల వారికి ఆర్థికంగా ప్రోత్సాహకరం. 17,18 తేదీల్లో రియల్ ఎస్టేట్ రంగంలోని వారికి ఆర్థికంగా ప్రోత్సాహకరం. కుటుంబ సభ్యుల ఆరోగ్యం మెరుగవుతుంది. 19, 20, 21 తేదీల్లో పెట్టుబడులు లాభిస్తాయి. చిన్నారులు, ప్రియతముల కోసం విలువైన వస్తువులు సేకరిస్తారు. బహుమతులు ఇచ్చిపుచ్చుకుంటారు. 21న వృత్తిపరమైన సమావేశాలు, చర్చలకు ఆటంకాలు ఎదురయ్యే అవకాశం ఉంది. లక్ష్య సాధనకు అధికంగా శ్రమించాలి.



## వృషభం (ఏప్రిల్ 21 - మే 21 మధ్య పుట్టినవారు)

వేడుకలు, సమావేశాలు, కుటుంబ వ్యవహారాలు, స్పెక్యులేషన్లు, పెట్టుబడులు, బీమా, రుణప్రయత్నాలపై ఈ వారం దృష్టి పెడతారు. బుధవారం స్పెక్యులేషన్లు లాభిస్తాయి. ప్రియతముల కోసం విలువైన వస్తువులు కొనుగోలు చేస్తారు. ఆర్థిక పరిస్థితి ప్రోత్సాహకరం. 17,18 తేదీల్లో సోదరీసోదరుల విషయాల్లో శుభపరిణామాలు సంభవం. కీలక సమాచారం అందుకుంటారు. 19, 20, 21 తేదీల్లో రియల్ ఎస్టేట్ రంగంలోని వారికి శుభప్రదం. కుటుంబ వ్యవహారాలు ఉల్లాసం కలిగిస్తాయి. భాగస్వామి వైఖరిలో మార్పు గమనిస్తారు. 22న చిన్నారులు, ప్రియతముల కోసం విలువైన వస్తువులు కొనుగోలు చేస్తారు.



## మిథునం (మే 22 - జూన్ 21 మధ్య పుట్టినవారు)

బోనస్‌లు, ఇంక్రిమెంట్లు, ఇంటర్వ్యూలు, ప్రేమానుబంధాలు, స్పెక్యులేషన్లు, భాగస్వామికి సంబంధించిన అంశాలపై ఈ వారం దృష్టి పెడతారు. బుధవారం కొత్త పనుల ప్రారంభానికి అనుకూలం. వృత్తి, వ్యాపారాల్లో ఉత్సాహంగా ఉంటుంది. 17,18 తేదీల్లో అదనపు ఆదాయం కోసం చేసే ప్రయత్నాలు ఫలిస్తాయి. వైద్యం, హోటల్ రంగాల వారికి శుభప్రదం. 19, 20, 21 తేదీల్లో ఇంటర్వ్యూలలో ఆశించిన ఫలితాలు సాధిస్తారు. సహోద్యోగులతో ఉల్లాసంగా గడుపుతారు. వృత్తిపరమైన ప్రయాణాలు ఉల్లాసం కలిగిస్తాయి.



## కర్కాటకం (జూన్ 22 - జులై 22 మధ్య పుట్టినవారు)

విద్య, చిన్నారుల విషయాలు, పొదుపు పథకాలు, విందు వినోదాలు, విద్యా విషయాలు, వృత్తి, వ్యాపారాలపై ఈ వారం దృష్టి సారిస్తారు. బుధవారం ఉన్నత విద్య కోసం చేసే ప్రయత్నాలు ఫలిస్తాయి. రాజకీయ, సినీ రంగాల వారికి శుభప్రదం. 17,18 తేదీల్లో విద్యార్థులు లక్ష్య సాధనకు అధికంగా శ్రమించాలి. పెట్టుబడులు లాభిస్తాయి. ప్రేమానుబంధాలు బలపడతాయి. 19, 20, 21 తేదీల్లో పెట్టుబడులు లాభిస్తాయి. ప్రియతముల కోసం విలువైన వస్తువులు సమకూర్చుకుంటారు. బహుమతులు ఇచ్చిపుచ్చుకుంటారు. 22న సోదరీసోదరుల విషయాల్లో శుభపరిణామాలు సంభవం. బోధన, రవాణా, పర్యాటక రంగాల వారికి శుభప్రదం.



## సింహం (జులై 23 - ఆగస్టు 23 మధ్య పుట్టినవారు)

గృహ, విద్యా విషయాలు, వేడుకలు, పొదుపు పథకాలు, ప్రేమానుబంధాలకు ఈ వారం ప్రాధాన్యత ఉంటుంది. బుధవారం వేడుకల్లో పాల్గొంటారు. గృహరుణాలు మంజూరవుతాయి. పెట్టుబడులు లాభిస్తాయి. 17,18 తేదీల్లో వేడుకలకు ఏర్పాట్లలో అసౌకర్యం కలిగే అవకాశం ఉంది. వాయిదా పడుతున్న పనులు పట్టుదలతో పూర్తి చేస్తారు. 19, 20, 21 తేదీల్లో రియల్ ఎస్టేట్, నిర్మాణ రంగాల వారికి ఆర్థికంగా ప్రోత్సాహకరం. ఆర్థిక విషయాల్లో మీ వైఖరిని సమీక్షించుకుంటారు. విలువైన వస్తువులు కొనుగోలు చేస్తారు. 22న చిన్నారులు విషయాల్లో శుభపరిణామాలు సంభవం.



## కన్య (ఆగస్టు 24 - సెప్టెంబర్ 22 మధ్య పుట్టినవారు)

సమావేశాలు, చర్చలు, విద్యా విషయాలు, పెట్టుబడులు, బదిలీలు, నిర్మాణాలకు ఈ వారం ప్రాధాన్యత ఇస్తారు. బుధవారం ఇంటర్వ్యూలలో విజయం సాధిస్తారు. ప్రముఖులతో సమావేశాలు ఫలిస్తాయి. 17,18 తేదీల్లో ఆర్థిక విషయాలకు సంబంధించిన ఒక సమాచారం కలవరపెడుతుంది. స్నేహానుబంధాలు బలపడతాయి. సమావేశాలు ఫలిస్తాయి. 19, 20, 21 తేదీల్లో ఉన్నత విద్య, విదేశీ వ్యవహారాలకు అనుకూలం. దూరప్రయాణాలు, చర్చలు ఫలిస్తాయి. ఒక సమాచారం ఉల్లాసం కలిగిస్తుంది. 22న రియల్ ఎస్టేట్ రంగానికి చెందిన వారు నిదానం పాటించాలి. కుటుంబ వ్యవహారాలపై దృష్టి సారిస్తారు



## తుల (సెప్టెంబర్ 23 - అక్టోబర్ 23 మధ్య పుట్టినవారు)

అదనపు ఆదాయాలు, విద్యా విషయాలు, పెట్టుబడులు, సోదరీసోదరుల వ్యవహారాలపై ఈ వారం దృష్టి పెడతారు. బుధవారం ఆర్థిక వ్యవహారాలకు సంబంధించి కొత్త వ్యూహాలు అమలు చేస్తారు. పెట్టుబడులకు సంబంధించిన చర్చలు ఫలిస్తాయి. 17,18 తేదీల్లో వృత్తి, వ్యాపారాల్లో ఆర్థిక పరిస్థితి ప్రోత్సాహకరం. అదనపు ఆదాయం లభిస్తుంది. పెద్దల సహకారంతో లక్ష్యాలు సాధిస్తారు. 19, 20, 21 తేదీల్లో బంధుమిత్రుల సహకారంతో ఆర్థికపరమైన లక్ష్యాలు సాధిస్తారు. పెట్టుబడులు లాభిస్తాయి.



## వృశ్చికం (అక్టోబర్ 24 - నవంబర్ 22 మధ్య పుట్టినవారు)

సమావేశాలు, వృత్తి, వ్యాపారాలకు సంబంధించిన వ్యూహాలు, పెట్టుబడులు, పొదుపు పథకాలపై ఈ వారం దృష్టి పెడతారు. బుధవారం వైద్యం కోసం అవసరమైన నిధులు సర్దుబాటవుతాయి. బీమా, గ్రాట్యుటీ, పన్నుల వ్యవహారాలకు అనుకూలం. 17,18 తేదీల్లో ఒక సమాచారం మనస్తాపం కలిగిస్తుంది. సమావేశాల్లో కీలకపాత్ర పోషిస్తారు. సంకల్పం నెరవేరుతుంది. 19, 20, 21 తేదీల్లో వృత్తి, వ్యాపారాలకు సంబంధించిన కీలక నిర్ణయాలు తీసుకుంటారు. ప్రముఖులతో పరిచయాలు ఏర్పడతాయి. 22న ఆర్థిక సంస్థలతో పనులు పూర్తవుతాయి. స్నేహానుబంధాలు బలపడతాయి.



## ధనుస్సు (నవంబర్ 23 - డిసెంబర్ 21 మధ్య పుట్టినవారు)

ఆరోగ్యం, పెట్టుబడులు, సమావేశాలు, దూరప్రయాణాలు, కీలక నిర్ణయాలపై ఈ వారం దృష్టి సారిస్తారు. బుధవారం రాజకీయ, సినీ రంగాల వారికి శుభప్రదం. కొత్త పరిచయాలు లాభిస్తాయి. 17,18 తేదీల్లో ఆరోగ్యం పట్ల శ్రద్ధ చూపాలి. ఆర్థిక విషయాల్లో గత అనుభవంతో లక్ష్యాలు సాధిస్తారు. అంతరంగిక విషయాలు చర్చకు వస్తాయి. 19, 20, 21 తేదీల్లో ఉన్నత విద్య, విదేశీ వ్యవహారాలకు అనుకూలం. దూరంలో ఉన్న ప్రియతముల నుంచి శుభవార్త అందుతుంది. బోధన, రవాణా, పర్యటన రంగాల వారికి శుభప్రదం. 22న వ్యాపార రంగంలోని వారికి ప్రోత్సాహకరం. గౌరవ పదవులు అందుకుంటారు.



## మకరం (డిసెంబర్ 22 - జనవరి 20 మధ్య పుట్టినవారు)

వివాహాది శుభకార్యాలు, ఆర్థిక వ్యవహారాలు, వృత్తి, వ్యాపారాలు, ప్రముఖుల కలయిక, ప్రయాణాలపై ఈ వారం దృష్టి సారిస్తారు. బుధవారం వృత్తి, వ్యాపారాల్లో అదనపు ఆదాయం అందుకుంటారు. బంధుమిత్రులతో వేడుకల్లో పాల్గొంటారు. 17,18 తేదీల్లో స్పెక్యులేషన్లకు దూరంగా ఉండాలి. బృందకార్యక్రమాల్లో పాల్గొంటారు. ఆర్థిక పరిస్థితి ప్రోత్సాహకరం. 19, 20, 21 తేదీల్లో ఆర్థిక పరిస్థితి ప్రోత్సాహకరం. పెట్టుబడులపై మంచి ప్రతిఫలం అందుకుంటారు. విలువైన వస్తువులు కొనుగోలు చేస్తారు. 22న ఉన్నత విద్య, విదేశీ వ్యవహారాలకు ప్రోత్సాహకరం.



## కుంభం (జనవరి 21 - ఫిబ్రవరి 18 మధ్య పుట్టినవారు)

వృత్తి, వ్యాపారాలు, పెద్దల ఆరోగ్యం, వేడుకలు, సమావేశాలు, ఆర్థిక వ్యవహారాలపై ఈ వారం దృష్టి పెడతారు. బుధవారం వృత్తి, వ్యాపారాల్లో సృజనాత్మకంగా వ్యవహరించి లక్ష్యాలు సాధిస్తారు. చిన్నారుల విషయాల్లో శుభపరిణామాలు సంభవం. 17,18 తేదీల్లో పెద్దల ఆరోగ్యం పట్ల శ్రద్ధ చూపించాలి. ఉన్నత పదవులు అందుకుంటారు. ఉద్యోగ ప్రయత్నాలు ఫలిస్తాయి. 19, 20, 21 తేదీల్లో వివాహాది శుభకార్యాల్లో పాల్గొంటారు. కుటుంబ వ్యవహారాల్లో పెద్దల సహకారంతో లక్ష్యాలు సాధిస్తారు. జనసంబంధాలు విస్తరిస్తాయి. 22న విలువైన వస్తువులు సమకూర్చుకుంటారు. సన్నిహితుల అంతరంగిక విషయాలు చర్చకు వస్తాయి.



## మీనం (ఫిబ్రవరి 19 - మార్చి 20 మధ్య పుట్టినవారు)

చిన్నారులు, విద్యా విషయాలు, వృత్తి వ్యాపారాలు, పెద్దలు, బంధుమిత్రుల కలయికపై ఈ వారం దృష్టి సారిస్తారు. బుధవారం కుటుంబ వ్యవహారాల్లో శుభపరిణామాలు సంభవం. బదిలీ ప్రయత్నాలు ఫలిస్తాయి. 17,18 తేదీల్లో అంచనాలు ఫలించకపోవచ్చు. ప్రియతములకు సంబంధించిన సమాచారం ఉల్లాసం కలిగిస్తుంది. విద్యార్థులకు శుభప్రదం. 19, 20, 21 తేదీల్లో ప్రణాళికాబద్ధంగా వ్యవహరించి వృత్తి, వ్యాపారాల్లో లక్ష్యాలు సాధిస్తారు. వృత్తిపరమైన సమావేశాలు ఫలిస్తాయి. బంధుమిత్రులతో విందు వినోదాల్లో పాల్గొంటారు. 22న జనసంబంధాలు విస్తరిస్తాయి. వివాహాది శుభకార్యాల్లో పాల్గొంటారు.



## అన్ని విషయాలూ నాకు తెలుసు!

ఒకే ప్రశ్నకి పదే పదే ఒకే రకమైన సమాధానం చెప్పాలంటే ఎవరికైనా విసుగే! అదీ దగ్గరివారికి చెందిన ప్రశ్నలైతే మరీ ఇబ్బంది ! సరిగ్గా ఇలాంటి ఇబ్బందే ఐష్ భర్త అభిషేక్ బచ్చన్ ఎదుర్కొంటున్నాడు. ఐష్ సినిమా 'యే దిల్ ముష్కిల్ హై' సినిమా వివాదం ఇప్పటి వరకు సద్దుమణగలేదు. ఈ సినిమాకి సంబంధించిన ప్రశ్నలను తప్పించుకోవాలని బచ్చన్ కుటుంబం ఎంత ప్రయత్నించినా లాభం లేకుండా పోతోంది. ఈ సినిమాకి సంబంధించి ఇక ప్రశ్నలు ఆపేయాలనీ, సెట్‌లో జరిగే ప్రతి సన్నివేశాన్నీ ఐష్ తనకు ఎప్పటికప్పుడు చెప్పేదనీ, దాంతో సినిమా గురించిన అన్ని వివరాలూ తనకు తెలుసంటూ అభిషేక్ చెప్పుకొచ్చాడు.

## పేరు మార్పు వెనుక దిల్‌రాజ్

హెబ్బాపటేల్ నటిస్తున్న 'నాన్నా... నేను నా బాయ్ ఫ్రెండ్స్' సినిమా అసలు పేరు 'నేను నా బాయ్ ఫ్రెండ్స్' అట! అయితే ఇదేదో బూతు సినిమా టైటిల్‌లాగా ఉందని దిల్‌రాజ్ పైవిధంగా 'నాన్నా...నేను నా బాయ్ ఫ్రెండ్స్' అని మార్పు చేశారట! ఫ్యామిలీ ఆడియన్స్‌ను ఆకట్టుకోవడానికే పేరు మార్చారంటున్నారు. పైగా సినిమాలో నాన్న క్యారెక్టర్‌కి ఎంతో ఇంపార్టెన్స్ ఉందట కూడా! మొత్తానికి మొదటి పేరు కన్నా రెండో పేరే క్యాచీగా ఉందని అందరూ అంటున్నారు.



## నవ్య సినిమా

## ముప్ఫై కోట్లతో ఫైట్

ఈ బడ్జెట్‌తో ఓ సినిమా చేయొచ్చు. చిన్న హీరోలతో అయితే ఏకంగా రెండు సినిమాలు చేయొచ్చు. కానీ ఇంత మొత్తాన్ని ఒక్క ఫైట్ గురించే వెచ్చిస్తున్నారట! ఇంత ఖర్చుతో ఫైట్ చేయబోతున్న హీరో ఎవరో తెలుసా? ప్రభాస్. 'బాహుబలి'తో ప్రభాస్ రేంజ్ ఒక్కసారిగా పెరిగిపోయింది. ఈ హీరో మీద ఎంత ఖర్చు పెట్టినా అంతకు రెండింతలు రాబట్టుకోవచ్చు అన్న విషయం నిర్మాతలకు బాగా అర్థమైపోయింది. అందుకే ఇంత ఖర్చు పెట్టి ఆ ఫైట్‌ను ఆకాశంలో తీస్తున్నారట! తీసేది ఆకాశంలో కాబట్టి అంత ఖర్చు పెట్టవచ్చు అన్నవారూ ఉన్నారు. అసలు సంగతేమిటంటే ఈ సినిమా షూటింగే మొదలుకాలేదు. డిసెంబర్‌లో షూటింగ్ మొదలవుతుందని అంటున్నారు. సినిమా మొదలు కాకముందే ఫైటింగ్ కోసం పెట్టే ఖర్చును కూడా లెక్కకడుతున్న నిర్మాతను మెచ్చుకోవలసిందే అంటున్నారు సినీ జనాలు.



## టాలీవుడ్ మీద మోహన్‌లాల్ కన్ను

'జనతాగ్యారేజ్'తో తెలుగువారి అభిమానం ఏ రేంజ్‌లో ఉంటుందో మోహన్‌లాల్‌కి అర్థమైపోయింది అందుకే ఇక్కడ మార్కెట్‌ని పెంచుకోవడానికి తన సినిమాలను తెలుగులో విడుదల చేయాలని డిసైడ్ అయిపోయాడట! 'మనమంతా' సినిమాని కూడా బాగా ఆదరించడంతో మరో రెండు సినిమాలను తెలుగులోకి తేవడానికి మోహన్‌లాల్ రెడీ అయిపోతున్నాడు. ఇవి కనుక విజయం సాధిస్తే టాలీవుడ్ మార్కెట్‌పై మోహన్‌లాల్ పట్టు సాధిస్తాడని సినీ జనాలు అంటున్నారు.



## ప్లకార్డులతో 'బాహుబలి' ప్రదర్శన

ఇంటా బయటా 'బాహుబలి'కి లభిస్తున్న ఆదరణ ఇంతా అంతా కాదు. ఇప్పటికే ఎన్నో అవార్డులు, రివార్డులు ఈ సినిమాకు దక్కాయి. వాటికన్నా గొప్ప ఆదరణ ఒకటి ఈ సినిమాకు జపాన్‌లో లభించింది. జపాన్‌లో ఈ సినిమా చూసిన జపనీయులు ఆనందంతో ఉప్పొంగిపోయారట! 'బాహుబలి' ప్లకార్డులను పట్టుకుని జపాన్ వీధుల్లో ఊరేగింపు నిర్వహించారట! ఒక సినిమా అదీ విదేశీ సినిమాకు జపాన్‌లో ఇలాంటి గౌరవం దక్కడం గొప్ప అదృష్టమంటున్నారు ఆ సినిమా దర్శకనిర్మాతలు.





# ఆమెని చూస్తే అసూయ

**-శ్రీదివ్య**

**శ్రీదివ్య...పేరుకు తగ్గట్టే దివ్యమైన రూపం. కానీ ఆ రూపాన్ని టాలీవుడ్ మెచ్చ లేదు. పక్కనున్న కోలీవుడ్ మాత్రం అక్కున చేర్చుకుంది. ఆ రూపంతో పాటు ఆమెలోని నటిని మెచ్చుకుంది. అందలం ఎక్కించింది. అవడానికి తెలుగమ్మాయే అయినా పర భాషలో దూసుకుపోతున్న శ్రీదివ్యతో...**

---

**దీపావళి బాగా జరుపుకున్నారా?**

ఆ...మా ఫ్యామిలీ అంతా బాగా జరుపుకున్నాం. టపాసులు కాల్చడం నాకు ఎప్పుడూ ఇష్టం ఉండదు. అది తప్పించి మిగతా పండగ అంతా మా ఇంట్లోనే ఉందా అన్నంత సరదాగా, ఆనందంగా జరుపుకుంటాం.

**తెలుగమ్మాయి అయి ఉండి తెలుగులో నటించడం లేదన్న బాధ ఉందా?**

అదెప్పుడూ ఉంటూనే ఉంటుంది. అసలు సినిమాలు చేయకుండా ఉండడం లేదుగా.. అప్పుడప్పుడూ చేస్తూనే ఉంటున్నాను. మొన్నటికి మొన్న 'కాష్మోరా'లో కనిపించాను కదా. అవకాశం వచ్చినప్పుడల్లా తెలుగు సినిమాలు చేస్తూనే ఉన్నాను.

**ఈ సినిమాలో నయనతారతో నటించడం ఎలా అనిపించింది?**

తనకీ నాకూ కలిపి పెద్దగా సీన్లు లేవు. ఒక్క రోజు మాత్రమే కలిసి చేశాం. ఆమె చాలా బాగా మాట్లాడతారు. సీనియర్ అన్న గర్వం ఎక్కడా కనిపించలేదు.

**ఈ సినిమాలో మోడ్రన్ డ్రస్సులు వేసినట్టున్నారు?**

అవసరాన్ని బట్టి వేసుకున్నాను. 'కాష్మోరా'లో నా పాత్ర మోడ్రన్ అమ్మాయి పాత్ర. అందుకే మోడ్రన్ డ్రస్సులు వేసుకున్నాను.

**తెలుగు, తమిళ భాషలలో ఏది సౌకర్యంగా ఫీలవుతారు?**

నా మటుకు నాకు రెండు భాషలూ సౌకర్యంగానే ఉంటాయి. కోలీవుడ్‌కి వెళ్ళిన మొదట్లో కొద్దిగా భయపడిన మాట నిజమే! అక్కడివారి అభిమానం చూసిన తరువాత మాత్రం ఆ భయం పోయింది. తెలుగమ్మాయిని కనుక ఇక్కడ ఎటూ ఆ ఆదరణ ఉంటూనే ఉంటుంది. రెండు భాషల వారు నన్ను అభిమానించడం నిజంగా నా అదృష్టం.

**రెమ్యునరేషన్ పెంచారట నిజమేనా?**

నాకు ఎంత ఇవ్వాలో నా దర్శకనిర్మాతలకు బాగా తెలుసు. అంతే తప్ప ఎప్పుడూ ఇంత ఇవ్వమని ఎవ్వరినీ అడగలేదు.

**చదువు మొదలెట్టారట?**

పదవ తరగతి వరకు మాత్రమే చదివాను. ముందు సీరియల్స్ ఆ తరువాత సినిమాలు. వీటితో కాలేజీకి వెళ్ళే అవకాశమే లేకుండా పోయింది. నాగార్జున యూనివర్సిటీ ద్వారా డిగ్రీ చదువుతున్నాను. దీని తరువాత పీజీ చేసే ఆలోచన కూడా ఉంది.

**సమాజసేవ చేస్తున్నట్టుంది?**

సమాజసేవ కాదు కానీ, నా పరిధిలో ఏదో చిన్న చిన్న సహాయాలు చేస్తున్నాను. 'రాయుడు' షూటింగ్ సమయంలో చెన్నై దగ్గర ఒక పల్లెటూరిలో నేనూ, విశాల్‌గారూ నెల రోజులు ఉండాల్సి వచ్చింది. ఆ సమయంలో మరుగుదొడ్లు లేక మహిళలు ఎంత ఇబ్బంది పడుతున్నారో ప్రత్యక్షంగా చూశాం. వెంటనే విశాల్‌గారు ఆ ఊరిలో మరుగుదొడ్లు కట్టించాలని నిర్ణయించుకున్నారు. నా వంతుగా పది మరుగుదొడ్లు కట్టించా. అంతే తప్ప పెద్దగా సమాజ సేవ అంటూ చేయడం లేదు.

**నిత్యామీనన్ అంటే అసూయ అన్నారు కదా? ఎందుకలా?**

నా మాటలు వక్రీకరించారు. నిజా

నికి నేను అన్న సందర్భం వేరు. తనకి మంచి మంచి కథాబలం ఉన్న సినిమాల్లో అవకాశాలు వస్తుంటాయి. నిత్యా సినిమా చేస్తోందంటే ఆ సినిమాలో కచ్చితంగా కథ ఉండి తీరుతుందన్న నమ్మకం అందరిలో ఉంది. ఇంతమంది నమ్మకాన్నీ, మంచి మంచి అవకాశాలనూ అందిపుచ్చుకుంటున్న నిత్యాను చూస్తుంటే అప్పుడప్పుడు అసూయగా ఉంటుందని అన్నానే తప్ప వ్యక్తిగా తనంటే నాకు ఎలాంటి ద్వేషం లేదు.

### తీరని కోరికలు?

తీరని కోరికలు అని కాదు. అవి ఎప్పుడో ఒకప్పుడు తీరుతాయి. మణిరత్నం సార్ డైరెక్షన్‌లో సినిమా చేయాలని ఉంది. అలాగే సూర్యా సార్‌తో కూడా సినిమా చేయాలని ఉంది. అనుకోకుండా ఆయన తమ్ముడు కార్తీతో చేసే ఛాన్స్ వచ్చింది.

### తీరిక సమయాల్లో శ్రీదివ్య ఎలా ఉంటుంది?

కామ్‌గా, బుద్ధిమంతురాలిలాగా ఉంటాను. నేను ఇంట్లో ఉన్నాననే సంగతి మా పక్కింటి వాళ్ళక్కూడా తెలియదు.

### సినిమాల్లోకి వచ్చిన తరువాత మరిచిపోలేని అనుభవం?

నాకు డ్యాన్స్ అంత బాగా రాదన్న సంగతి అందరికీ తెలిసిన విషయమే. గత ఏడాది కోలీవుడ్‌లో ఓ సినిమాలో డ్యాన్స్ చేయాల్సి వచ్చింది. నాకు తేలికైన స్టెప్పులే వేయమని డ్యాన్స్ డైరెక్టర్‌తో చెప్పడం విన్న యూనిట్ సభ్యులు నవ్వుకోవడం చూశాను. దాంతో నాకు పట్టుదల పెరిగి ఆ రోజు రాత్రి మా సిస్టర్‌కి ఫోన్ చేశాను. తను మంచి డ్యాన్సర్. పాట, సిట్యుయేషన్ చెప్పి స్టెప్పులు ఎలా వేయాలి, హావభావాలు ఎలా ఉండాలో చెప్పమన్నాను. తను చెప్పింది. వాటిని ఆ రాత్రంతా బాగా ప్రాక్టీసు చేసి మరునాడు సెట్‌లో చేసి చూపించాను. అందరూ ఆశ్చర్యపోయారు. రాత్రికి రాత్రి ఎలా నేర్చుకున్నావని అడిగారు. మా సిస్టర్ చెప్పిందని చెప్పాను. అందరూ మెచ్చుకున్నారు. మరో సంఘటన కూడా ఎప్పుడూ గుర్తుకొస్తూ ఉంటుంది. ఓ సినిమాలో ఆర్యగారిని వెనక కూర్చోబెట్టుకుని బండి నడపాలి. నాకు బండి నడపడం రాదు. పది నిమిషాల్లో చిన్న చిన్న చిట్కాలు నేర్చుకుని బండి నడిపాను. ఆ హీరో నాకన్నా చాలా భయపడిపోయారట! సీన్ అయిపోగానే హాయిగా ఊపిరి పీల్చుకున్నాను అంటూ నాతో చెప్పారు. ఈ రెండు సంఘటనలూ మరుపురానివే!

### సెట్‌కి వెళ్లేముందు హోంవర్క్ ఉంటుందా?

ముందుగా ప్రిపేర్ అయ్యే అలవాటు నాకు లేదు. సెట్‌కి వెళ్ళాక డైరెక్టర్‌గారు ఎలా చెబితే అలా చేస్తాను, అంతే!

### గ్లామర్, ఎక్స్‌పోజింగ్‌కి దూరం అంటారు నిజమేనా?

మొదటి దానికి ఓకే కానీ, ఎక్స్‌పోజింగ్‌కి మాత్రం నేను విరుద్ధం. నా శరీరాకృతి దానికి సరిపోదు. అందుకేనేమో ఇంతవరకూ నన్ను ఎవరూ అడగలేదు. నేను చేయలేదు. సంప్రదాయబద్ధంగా కూడా గ్లామర్‌గా కనిపించవచ్చు.

### అందుకేనా ఎక్కువగా సంప్రదాయబద్ధమైన పాత్రల్లోనే కనిపిస్తారు?

సినిమాల్లో నా ఇష్టాయిష్టాలు అంటూ ఉండవు. డైరెక్టర్‌గారు చెప్పినట్టు చేయాల్సిందే! నా లక్ కొద్దీ ఎక్కువగా చీరలు, లంగా ఓణీల్లో కనిపించే పాత్రలే వస్తున్నాయి. అందుకే శ్రీదివ్య సంప్రదాయబద్ధమైన పాత్రలకే నప్పుతుంది అని అందరూ అంటూంటారు.

### తిరిగి బుల్లితెర మీద సీరియల్స్ చేసే ఆలోచన ఉందా?

ప్రస్తుతానికి అయితే లేదు. భవిష్యత్తులో ఏం జరుగుతుందో చెప్పలేం కదా?

### అరేంజ్డ్ మ్యారేజా? లవ్ మ్యారేజా?

ఇప్పటివరకూ అలాంటి ఆలోచన రాలేదు.

### సినీ రంగంలో మీ బెస్ట్ ఫ్రెండ్స్?

అందరితో మాట్లాడతాను కానీ, బెస్ట్ ఫ్రెండ్స్ అంటూ ఎవరూ లేరు. అందరూ నాకు కావాల్సిన వారే!

### ఒక వేళ మీరే హీరో అయితే ఏ హీరోయిన్ అంటే ఎక్కువ ఇష్టపడతారు?

ఐశ్వర్యారాయ్‌నే! ఆమె అందం నిత్యనూతనం.

### సైజ్ జీరో గురించి?

అలాంటివి పట్టించుకోను. నాకు నచ్చినవి తినేస్తాను. రోజూ ఓ గంటన్నర వ్యాయామం చేస్తాను. ఆరోగ్యంగా ఉండాలే తప్ప బరువు తగ్గించుకోవడానికి అనారోగ్యం బారిన పడకూడదు. ఆడపిల్లలు మరీ సన్నగా పీలగా ఉంటే అందంగా ఉండరని నా అభిప్రాయం. ఎత్తు, దానికి తగ్గ బరువుతో ఉంటేనే అందంగా కనిపిస్తారు. మన అందమంతా ఆరోగ్యంలోనే ఉంది.

-చిన్ని





ఇంటర్వ్యూ

ఆయన నేర్చుకోనిదీ, ఆయనకు రాని రాగం నేర్చుకోవాలనే పట్టుదలతోనే నేను గిటార్, పియానోలలో పట్టు సాధించాను.

### నాటకానుభవం

గొల్లపూడి మారుతీరావుగారు రచించిన 'కళ్ళు' నాటకం ఏ ఆడిటోరియంలో ప్రదర్శించినా అందులో రంగడి పాత్ర నేనే పోషించేవాణ్ణి. అలా నాటకానుభవం సంపాదించుకున్నాను. యాక్టింగ్ ఇనిస్టిట్యూట్‌లో, ముఖ్యంగా బి.ఎన్.రెడ్డి, రజనీకాంత్ లాంటివారు నా పాత్రను ఎంతగానో మెచ్చుకునేవారు. ఫిలిం ఇనిస్టిట్యూట్‌లో నేను శిక్షణ పొందే సమయంలో కామెడీ సుధాకర్, జయభాస్కర్ లాంటి వాళ్ళంతా నా క్లాస్‌మేట్స్. రజనీకాంత్, నారాయణరావు లాంటివాళ్ళంతా మొదటి బ్యాచ్ సీనియర్స్.

### అమ్మ కోరిక తీర్చేందుకే!

నాకు సంగీతంమీదే మక్కువ. నటించాలనే కోరిక ఉండేదికాదు. గిటార్, పియానో స్పెషలిస్టుగా పేరు సంపాదించుకున్నాను. కానీ అమ్మ నన్ను నటుడిగా చూడాలని కోరుకుంది. అమ్మ కోరిక తీర్చేందుకే ఫిలిం ఇనిస్టిట్యూట్‌లో శిక్షణపొందాను. నాన్నగారికి నేను నటించడం ఇష్టం లేదు.

### తొలిచిత్రం

'నాలాగా ఎందరో' నా మొదటి చిత్రం. ఈరంకి శర్మగారు దర్శకులు. నేను సైడ్ హీరో. నారాయణరావు, హేమసుందర్, రూపా తదితరులు నటించారు. ఉత్తమ చిత్రం కేటగిరీలో దీనికి నంది అవార్డు లభించింది. ఉత్తమనటుడిగా హేమసుందర్, ఉత్తమ గాయకుడిగా ఎస్పీ బాలసుబ్రహ్మణ్యంలకు కూడా నంది అవార్డులు లభించాయి. ఇలా 1978లో విడుదలైన ఈ చిత్రానికి మూడు నంది అవార్డులు వచ్చాయి.

# నేడు అన్నీ కథలేని చిత్రాలే! పసలేని సన్నివేశాలే!

-భానుచందర్

**విలక్షణ నటుడు భానుచందర్ దర్శకునిగా, స్క్రీన్ రైటర్‌గా, నిర్మాతగానే కాకుండా, కరాటే ఫైటర్‌గా ప్రేక్షకుల హృదయాల్లో స్థానం పొందిన నేచురల్ ఆర్టిస్ట్. నాలుగు దశాబ్దాలుగా పలు భాషల్లో 160కి పైగా చిత్రాల్లో నటించిన నంది అవార్డు గ్రహీత భానుచందర్ ఇంటర్వ్యూ ఈ వారం....**

చెన్నై నగరం కోడంబాకం నా జన్మస్థలం. సుప్రసిద్ధ సంగీత దర్శకులు మాస్టర్ వేణు నా తండ్రిగారు. ఏరువాక సాగాలో రన్నో చిన్నన్న నీ కష్టమంతా తీరునులే రన్నో చిన్నన్నా!, కారులో షికారు కెళ్ళే పాల బుగ్గల పసిడీదాన...వంటి ఎన్నో హిట్ సాంగ్స్‌కు సంగీత దర్శకత్వం వహించింది ఆయనే! మా అమ్మ శకుంతలాదేవి. నాకు ఒక అన్నయ్య, మూర్తిచందర్.

### చదువు, సంగీతం

నా ప్రాథమిక విద్య అంతా పాండీబజార్‌లోని స్కూల్స్‌లో సాగింది. తర్వాత ముంబై నేషనల్ కాలేజీలో బి.ఏ చదివాను. బాల్యంలో స్కూలు ఎగ్గొట్టి స్విమ్మింగ్‌పూల్‌లో ఈత కొట్టి ఇంటికి వచ్చినందుకు అమ్మ నాకు చేసిన బడితె పూజ ఎప్పటికీ మరపురాని సంఘటనే! ప్రసిద్ధ సంగీత విద్వాంసులు ధన్‌రాజ్ గారి దగ్గర గిటార్ నేర్చుకున్నాను. ఫోర్త్‌గ్రేడ్ గిటార్‌లో, పియానోలో కూడా ప్రావీణ్యం సంపాదించుకున్నాను. ఇళయరాజా గారికి కూడా ఈయనే గురువు. నాన్నగారు స్వయంగా వీణ, సితార్, హార్మోనియం, వయోలిన్, సారంగి (దిల్‌రుబా), ఫ్లూట్...వీటన్నింటిలో నిష్ణాతులు. ఎంతో ప్రావీణ్యంగల ప్రజ్ఞాశాలి. సంగీతంలో

### మన ఊరి పాండవులు

చిరంజీవి, మురళీమోహన్, జయభాస్కర్, ప్రసాద్‌బాబు, నేనూ నటించిన శతదినోత్సవ చిత్రం 'మన ఊరి పాండవులు'. బాపూగారు దర్శకత్వం వహించారు. వారి ఆశీర్వాదం, బాలు మహేంద్రలాంటి గొప్ప టెక్నీషియన్ల పరిచయంతో, నా సినీ కెరీర్ ముందడుగు వేసింది.

### దక్షిణాదిన బ్లాక్‌బెల్ట్ హీరోలం

దక్షిణభారత భాషా చిత్రాల్లో కరాటేను తెరపై ప్రదర్శించి గుర్తింపు తెచ్చింది నేను, సుమన్. మా ఇద్దరికీ కరాటేలో ప్రావీణ్యం ఉంది. బ్లాక్‌బెల్ట్ హీరోస్ అని మాకు పేరు. తమిళంలో కూడా కరాటేకు గుర్తింపు తెచ్చింది మేమే! ఈ విషయంలో మా ఇద్దరికీ బ్రహ్మాండమైన లైఫ్ ఇచ్చిన చిత్రం 'ఇద్దరు కిలాడీలు'. 1983లో విడుదలైంది. దీంతో మేమిద్దరం బాగా పాపులర్ అయ్యాం.

### ప్రాణ మిత్రుడు సుమన్

సుమన్ నా ప్రాణ మిత్రుడు. 'వంశగౌరవం' చిత్రంలో నేను నటిస్తున్నప్పుడు, షూటింగ్ విరామ సమయంలో సుమన్‌ను తీసుకెళ్ళి తమ్మారెడ్డి భరద్వాజగారికి పరిచయం చేశాను. అలా సుమన్‌ను తెలుగు పరిశ్రమకు పరిచయం చేసిన ఘనత నాకే దక్కింది. స్నేహశీలి సుమన్. ఎక్కడున్నా, ఏ ఇంటర్వ్యూలోనైనా నన్ను మరచిపోకుండా జ్ఞాపకం చేసు కుంటాడు. అలాంటి స్నేహితుడు లభించినందుకు నేనెంతో గర్వపడతాను.

### బి.ఆర్.చోప్రా ప్రశంస

బి.ఆర్.చోప్రాగారి చిత్రం 'ఇన్సాఫ్ కా తరాజ్' రైట్స్ తీసుకుని తెలుగు, తమిళ భాషల్లో ఒకేసారి ద్విభాషా చిత్రంగా నిర్మించారు. ఈ రెండు చిత్రాల్లోనూ నేనే నటించాను. ఏకకాలంలో తెలుగు, తమిళభాషల్లో షూటింగ్ చేశారు. ఇటు తెలుగులో డైలాగ్ చెప్పగానే, అటు తమిళ్‌లో డైలాగ్ చెప్పాలి. ఇలా రెండు భాషల్లో నేను ఏకకాలంలో షూటింగ్ చేయడం బి.ఆర్.చోప్రాగారు చూసి, బాపూగారి సమక్షంలోనే, 'ఈ అబ్బాయి ఫెంటాస్టిక్‌గా చేస్తున్నాడని అభినందించారు. ఆ అభినందన ఎప్పటికీ మరచిపోలేను.

### బాలచందర్‌గారి చిత్రం

నేను నటించిన తెలుగు-తమిళ ద్విభాషా చిత్రం విడుదల కొంచెం ఆలస్యం కావడంతో నాకు నిరుత్సాహం కలిగింది. అమెరికా వెళ్ళిపోదామనుకున్నాను. ఇంతలో బాలచందర్‌గారి సినిమాలో ఆఫర్ వచ్చింది. ఈ చిత్రం పేరు 'ఆడవాళ్ళు మీకు జోహార్లు'. ఈ సినిమా షూటింగ్‌లో


నవ్యవీక్లీ చదువుతూ...


కుటుంబ సభ్యులతో...

మోటార్ బైక్‌పై ఫాస్ట్‌గా వచ్చే సీన్ ఉంది. సరిత నిలబడిన చోట సడన్ బ్రేక్ వెయ్యాలి. బ్రేక్ ఫెయిలై బండి బలంగా ఆమెను ఢీకొట్టింది. నేను కిందపడ్డాను. ఆమెకు లైట్ ఫ్రాక్చర్స్ అయ్యాయి. మా ఇద్దర్నీ విజయా హాస్పిటల్‌కి తరలించారు. బాలచందర్‌గారు రోజూ హాస్పిటల్‌కి వచ్చి మా ఇద్దరికీ ధైర్యం చెప్పేవారు. తగ్గిన వెంటనే షూటింగ్ ప్రారంభిద్దాం అనేవారు. ఇది నా జీవితంలో మేజర్ యాక్సిడెంట్. 1981లో ఈ సినిమా విడుదలైంది.

### జీవితాన్ని మలుపు తిప్పిన 'తరంగిణి'

కోడి రామకృష్ణగారి దర్శకత్వంలో తయారైన చిత్రం 'తరంగిణి'. ప్రతాప్ ఆర్ట్ ప్రొడక్షన్స్ అధినేత రాఘవగారి చిత్రమిది. దాదాపు అన్ని థియేటర్లలో శత దినోత్సవాలు చేసుకుని బ్రహ్మాండంగా ఆడింది. దీంతో నాకు హీరోగా పేరు రావడం, ఆఫర్లు రావడం మొదలయ్యాయి. వెనక్కు తిరిగి చూసుకునే పనిలేకుండాపోయింది. సుమన్ ద్వారా ఈ వేషం నాకు వచ్చింది. కోడి రామకృష్ణగారు కూడా గత చిత్రాల్లో నా స్టైల్స్‌కి సంబంధించిన స్టిల్స్ అన్నీచూసి నువ్వే మా సినిమాకి తగిన నటుడివి అన్నారు.

రాఘవగారి ఇంట్లోనే, నెలరోజుల సమయంలో ఈ సినిమా షూటింగ్ పూర్తిచేయడం అప్పట్లో ఒక సంచలనం. ఈ చిత్రంలో నా పాత్ర సెకండ్ హాఫ్ నుండి వస్తుంది.

### ముక్కుపుడక

తరంగిణి చిత్రం సూపర్‌హిట్ కాగానే, కోడి రామకృష్ణగారు 'ముక్కుపుడక' చిత్రం ప్రారంభించారు. 'తరంగిణి రాకెట్‌లా దూసుకుపోయింది, ఈ చిత్రంలో కూడా నువ్వే నటించాలి' అంటూ నన్ను హీరోగా తీసుకున్నారు. నా నటన మీద ఆయన కున్న నమ్మకాన్ని వమ్ము చేయకుండా నటించాను. ఈ చిత్రం కూడా అన్ని సెంటర్లలో చాలా బాగా ఆడింది. 1983లో ఈ చిత్రం విడుదలైంది.

### నాన్నగారి గురించి

మా నాన్నగారు మాస్టర్ వేణు. ప్రముఖ సంగీత దర్శకులు. సాలూరి రాజేశ్వరరావుగారి పెద్ద కొడుకును 'బాబు' అంటాం. ఆయన్ని నాన్నగారి దగ్గరకు తీసుకువచ్చి ఒక పళ్ళెంలో కొబ్బరికాయ, పూలు, పళ్ళు పెట్టి ఇప్పించారు. నమస్కారం పెట్టించారు. 'మీకు వచ్చిన రాగాల్లో పది శాతం మా వాడికి నేర్పిస్తే చాలు' అని రాజేశ్వరరావుగారు అడగడం నా కళ్ళారా చూశాను. 'నాన్నగారు ఇంత గొప్పవారా' అని గర్వించాను. ఇలా నాన్నగారి దగ్గర సంగీత శిష్యరికం చేసినవారు ఎందరో. ముఖ్యంగా పెండ్యాల, ఘంటసాల, రాజేశ్వరరావు వంటి చిత్ర పరిశ్రమ పెద్దలు నాన్నగారిని ఎంతో గౌరవించేవారు. ప్రఖ్యాత హిందీ సంగీత దర్శకులు నౌషాద్‌గారు నాన్నగారికి ఇచ్చిన సర్టిఫికెట్ 'మాస్టర్'. అప్పటినుండీ ఆయన మాస్టర్ వేణుగా ప్రసిద్ధి.

బొంబాయిలోని ఒక కార్యక్రమంలో నాన్నగారు హార్మోనియం ప్లే చేస్తుండగా నౌషాద్ గారు చూసి ఆశ్చర్యపోయారు. 'సంగీత్ సరస్వతీ ఆప్‌కే హాతోంమే హై' అంటూ ఆశీర్వదించి 'నీకు మాస్టర్ సర్టిఫికెట్ ఇస్తున్నాను.' అన్నారు. ఆ ఫంక్షన్‌లో ఒక రాజకీయనేత చేతులమీదుగా దాన్ని ఇప్పించారు.

### నేటి చిత్రాల్లో సబ్జెక్ట్ లేదు

నేటి చిత్రాల్లో సబ్జెక్ట్ ఉండటం లేదు. ఎంతసేపూ ప్రేమే ఇతివృత్తం. ఒకప్పుడు కుటుంబ కథా చిత్రాలకు బాగా ప్రాముఖ్యం ఉండేది. ఎవరు ఏ క్యారెక్టర్ చేయాలో దర్శకుడు బాగా ఆలోచించి నిర్ణయించేవారు. అందుకే ఆయా పాత్రలకు నటులు జీవం పోసేవారు. ఇప్పటి చిత్రాలు పసలేని సన్నివేశాలతో కాలం వెళ్ళదీస్తున్నాయి. అందుకే ఫ్లాప్ అవుతున్నాయి. విభిన్న చిత్రాలు కరువైపోయాయి. మాయాబజార్, గుండమ్మకథ, శంకరాభరణం, నిరీక్షణ వంటి చిత్రాలు ఇప్పుడు వస్తున్నాయా అంటే ప్రశ్నార్థకమే! భవిష్యత్తులో ఉత్తమ చిత్రాలు వస్తాయనే ఆశతో ఉన్నాను.

### కుటుంబం

నా భార్య స్వర్ణలక్ష్మి. మాది పెద్దలు కుదిర్చిన పెళ్ళి. మాకు ఇద్దరు పిల్లలు. జయంత్, నిశాంత్. పెద్దబ్బాయి జయంత్ 'మిక్చర్‌పొట్లం' చిత్రంలో హీరోగా నటిస్తున్నాడు. ఈ చిత్రం విడుదలకు సిద్ధంగా ఉంది. ఇందులో నాది టెర్రరిస్టు పాత్ర. రెండో అబ్బాయి నిశాంత్, డాక్టర్. ప్రస్తుతం హౌస్‌సర్జన్ చేస్తున్నాడు.

-కె.హరనాథ్
సెల్ 9703542598

# ఇవన్నీ నిజాలే!

### ఇదేం పిచ్చి!

A 18వ శతాబ్దం నాటి ప్రష్యా రాజు ఫ్రెడరిక్ విలియం. తన సైనికులు ఆరు అడుగులపైగా పొడవు ఉండాలని కోరుకునేవాడు. అలాంటివారిని బలవంతంగా సైన్యంలో జేర్చేవాడు. వారిని పోషించి, సైనిక శిక్షణ ఇచ్చి పొడుగు మహిళలనిచ్చే పెళ్ళి చేసేవాడు. వారిని ఇంకా పొడుగు సాగదీసేందుకు వాళ్ళ శరీరాన్ని నలిపి నలిపి దొర్లిస్తూ చిత్రహింసలు చేసేవారట.

•••

A మానవాళికి మొదట తెలిసిన ఔషధం ఆయుర్వేదమే. ఫాదర్ ఆఫ్ మెడిసిన్‌గా పేరొందిన చరకుడు 2,500 సంవత్సరాల క్రితమే దీనినొక వైద్యంగా సుసంఘటితం చేశాడు.

•••

A మొఘల్ వంశానికి చెందిన ఆరుగురు చక్రవర్తులు (1526 నుంచి) నిరాఘాటంగా 200 సంవత్సరాలు భారతదేశాన్ని పరిపాలించారు.

•••

A థాయ్‌లాండ్‌లో 'వాట్ ప్రా దమ్మకయా' అనే బౌద్ధ దేవాలయాన్ని వెయ్యి ఎకరాల్లో నిర్మించారు. ఇక్కడ బంగారుపూత పూసిన మూడు లక్షల బుద్ధ విగ్రహాలతోపాటు మరో ఏడు లక్షల కంచు విగ్రహాలున్నాయి!!

•••

A 18వ శతాబ్దపు ఇంగ్లాండ్‌లో ధనవంతులైన ఎస్టేట్స్‌లో పురోహితుల దుస్తులు ధరించిన మనుషుల్ని అద్దెకు ఉంచుకోవడం ఫ్యాషన్‌గా ఉండేది. వారు జుత్తు పెంచాలి. గోళ్ళు కత్తిరించకూడదు. స్నానం చేయకూడదు. ఎస్టేట్స్‌లో వీరు సన్యాసులై కేవలం ఆభరణాల్లా తిరుగుతూ ఉండాలని కోరుకునేవారు.

•••

A నాకు నిశ్శబ్దం మీద నమ్మకం ఎక్కువ. ఈ విషయం మీద గంటలు గంటలు ప్రసంగించగలను!

-జార్జ్ బెర్నార్డ్ షా

•••

A ప్రపంచంలో గ్రానైట్ రాయితో నిర్మించిన మొట్టమొదటి దేవాలయం తమిళనాడు తంజావూరులోని బృహదీశ్వరాలయం. రాజరాజచోళుని కాలంనాటి ఆలయమిది. ఈ ఆలయ శిఖరాన్ని 80 టన్నుల ఏకశిల (గ్రానైట్‌శిల)తో నిర్మించడమే దీని విశిష్టత.

•••

A సమాచారమే ఆధునిక యుగంలో మనిషికి ఆక్సిజన్!

-రోనాల్డ్ రీగన్

### ఐస్ మైన్

A అమెరికా పెన్సిల్వేనియాలోని అపలేచియన్ పర్వతాల్లో ఐస్‌మైన్ ఉంది. ఇదొక విచిత్ర గుహ. కౌడర్‌స్పోర్ట్ అంటారు దీన్ని. ఎండాకాలంలో ఈ గుహలోని నీరు మంచుగా మారుతుంది.

-చిన్నారి

# సుధామ పదగారడి-288

సెల్: 98492 97958

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| h | h | 1 | 2 | | h | 3 | 4 | |
| 5 | h | h | | h | 6 | h | h | h |
| | h | h | | h | 7 | 8 | | |
| 8 | | 9 | h | 10 | | h | | h |
| | 11 h | | h | | h | 11 | h | 12 h |
| h | 13 | 15 | 14 | h | h | 15 h | | |
| 16 | | h | | h | 17 | 19 h | h h | |
| h h | | h | | h | | h | 18 h | |
| 19 | | | h | 20 | | | h | h |

## ఆధారాలు

**అడ్డం**

1. చాయ్ (3)
3. పెళ్ళీడు కొచ్చిన ఆమె ఒకప్పుడు గుండెలమీద కుంపటి అనుకునేవారు (3)
5. తెమ్మెర మధ్యలో తీసివేయ తీయగరాదా! (2)
7. దట్టంగా వేయబడిన ముడి (4)
8. ఆపద (3)
10. మాట్లాడకుండా వుండటం! (2)
13. జీళ్ళు కారే రసం! (4)
15. లాయర్, డాక్టర్ ఫీజు పుచ్చుకునే ఇస్తారు (3)
16. అత్తకొడుకు (2)
18. గదిపై మూలలకు పట్టే దీన్ని దులుపుకుంటుండాలి! (2)
19. లోలోపల దుఃఖించు, రసలు (3)
20. భర్త (3)

**నిలువు**

2. స్నానము చేయు (3)
4. అరిమేదము తాలూకు కంటకము (4)
5. ధవళ వస్త్రము కాదు స్త్రీలలో ఒక వ్యాధి (4)
6. గోచీ (3)
9. బంగారం (3)
10. ముత్యము (3)
11. పద్యపాదాల్లో రెండవ అక్షరం (2)
12. చక్రవర్తి, కవి, కథకుడు దేవరాజు... (4)
13. బ్రతుకు (4)
14. ఇరవై అయిదు (3)
17. ప్రాదము (3)

### పదగారడి-287 సమాధానాలు

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| 1 బా | ల | 2 మి | త్ర | | 3 సం | 4 పు | టి | |
| ర | | ఘు | | 5 బు | | డ | | 6 వా |
| సా | | 7 నం | దు | డు | | 8 మి | రా | యి |
| 9 ల | 10 తే | | | 11 గు | 12 రి | | | దా |
| | 13 ల | వం | 14 గం | | 15 క్షా | మ | 16 ము | |
| 17 ఇం | | | 18 జ | 19 ల | | | 20 సి | 21 జం |
| 22 ది | వా | 23 సు | | 24 వ | ల | 25 పు | | తి |
| ర | | రు | | ణం | | రు | | క |
| | 26 అం | గు | ళం | | 27 ముం | గు | రు | లు |

Printed and Published by VEMURI RADHAKRISHNA, Managing Director, on behalf of Aamoda Publications Pvt. Ltd., Plot No.76, Aswani Layout, Huda Heights, Jubilee Hills, Hyderabad-500 033. Ph.(040) 23558233/44, Fax No.23558288. Printed at Aamoda Press, R.S.No.191/3, Ward No.43, Donka Road, Patamata, Vijayawada 520 010, Reg.No.: APTEL/2004/12594. Editor: A.N.JAGANNADHA SARMA

